శ్రీరస్తు.

ఉన్మాదసహస్రము

అను

# వెఱ్ఱికివేయివిధములు.

ఇది

ఆరోగ్యదాయకము, సౌఖ్యదాయకము, నీతిదాయకము,

జ్ఞానదాయకము, నానందాయకము నగునట్లు,

క్రొత్తపల్లి - సూర్యరావుచే

రచింపఁబడినది.

మొదటికూర్పు ౧౦౦౦ ప్రతులు.



చెన్నపురము:

బ్రిటిష్ మాడెల్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

౧౯౨౪.

వెల, రూ. ౧-౦-౦.

# ప్రార్థనము.

—०:※:०—

రసికవతంసములారా! సంస్కృతములో లక్ష్మీసహస్రాదులు గలవు. తెనుఁగులో షణ్ముఖసహస్రమని యుత్పలమాలాదిసమవృత్తములలో సీతయ్యకవి సుబ్రహ్మణ్యస్తుతి పది శతకములు రచించెను. వెట్టి వేయివిధము లని వెట్టికి వేయిగుణము లనియు లోకములో నున్న వాడుకలనుబట్టి యేదోయొకసమయములో నేవెట్టి యేరీతి పని వెట్టియూహ కలిగినది. దానిపైని దీనిని రచించితిని. ఎంతటియల్పజ్ఞానియైనను దానెవ్వఁడో గొప్పబుద్ధిశాలియని తాను లేకున్నఁ బ్రపంచమునకుఁ గొంత లోప మగు ననియుఁ దలంపక మానఁడు. అట్లు తలంపకున్న ఘనకార్యములను జేయువారిప్రక్కన హీనకృతి యెట్లు నిలుచుచున్నాఁడు? సత్కావ్యముల వెంబడి నసత్కావ్యము లెట్లు బైలువెడలి యాడంబరము చేయఁగలవు? నాయూహయే క్రొత్తది, నావిమర్శనమే నిర్దుష్టమైనది, నాపద్యమే హృద్యమైనది యని యెవ్వనికి వాఁడే పొంగును. దానివెనుకనే విమర్శలు లేచుచున్నవిహాస మెఱుఁగును. కాని యాత్మోలియూహ వానిని విడువదు.

లోకజ్ఞులయినవారు సెలవిచ్చునట్లుగా నెవ్వనైన నీది తప్పని చెప్పువఱకుఁ దన తప్పు తనకుఁ దెలియదు. కావుననే నిరాఘాటముగా నేను నేనని యహంభావమునఁ గవిగాని మఱియెవ్వఁడుగాని యెగురును. ఈమాటలన్నియు నాగ్రంథమును గూర్చి చెప్పుకొనునవి యని తమకుఁ జెప్పనక్కఱలేదు. "తాను నొక్కమనుజుఁడేనా తవుడు నొక్క రొట్టెయేనా" యని నలువురు సత్కవులవెనుక నేను నున్నాఁడ నని లేచుట నాయజ్ఞానమే కాని వేఱుకాదు. ఎంతటియల్పునైనను బైకి లేవఁదీయవలయు నను నుద్దేశము గల సహృదయులు ఘనులు లేకపోరు. తప్పో యొప్పో నాపొత్తమును గొని త్రిలోకీవిజయము చేసి పలువురయొద్దఁ జూపితిని. దొడ్డంపేట జమీందారు శ్రీరాజా వాత్రేవువిశ్వసుందరరావు బహద్దరుగారు, శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు, శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు, శ్రీయుత జయంతి రామయ్యపంతులు బి. ఏ., బి. ఎల్. గారు, మహారాజశ్రీ శ్రీచెలికాని అప్పారావుదొరగారు (బొబ్బిలి) నన్ను సర్వవిధముల నుద్ధరించి బైటఁ బడవైచిరి. నడుము ములిఁగినపిమ్మటఁ జలి యెక్కడిది. పదిమందిలోఁ బడినాఁడను. ఏమిచేసినను మీదేభారము.

చేతనైనను గాకపోయినను సాహసించినదానికైన మీరు నన్ను మెచ్చకుండరు. తిట్టుటకో తిమ్ముటకో యెట్లో నాకష్టమునకు ఫలితముగా నందఱు నాగ్రంథమును గొని యింత నెన్నఁడు. నిట్టియసాధ్యకార్యమునకు సిద్ధపడకుండున ట్లొనర్పఁడు.

గ్రంథము కవియొక్క ఛాయాపటమువంటిది. కావున నందేమి యున్నదో కవి యెట్టివాఁడో యని యొక్కచోఁ బెట్టి పోల్చి చూడ నక్కఱలేదు. వేత్తలహృదయములు తీఁగలులేని తంత్రీవార్తాకార్యస్థానములు.

ఇట్లు విధేయుఁడు,

క్రొత్తపల్లి - సూర్యరావు.

# పీఠిక.

శా. శ్రీమన్మైసురరాజ్యకార్యకవచుర్భద్రరీతి న్రమాజానిను
శ్యామాంగంబు స్వకాంబకాన్వితికటాక్షంబట్లు లోకంబుదు
ర్ధామాజ్ఞానతమంబు వాపి కలుషుల్ దైనాలఁగాఁ జేయు వి
ద్యామూర్తిన్ భవు నాయుమాపమును నిత్యంబేను గీర్తించెదన్. ౧

మ. ఘనునేష్టాంశసత్పురాణములు శస్తంబుల్ల జింకన్నియుం
జనుఁ బౌరాణికకల్పితంబు లవియే చాలున్వృథాయంచు నా
ఘనమార్గంబున కడ్డురావలదు వాత్సల్యంబునిండారఁగా
వినుఁ డాకాశపురాణము న్బుధులు సేవింతు న్నిను న్నెమ్మదిన్. ౨

చ. పలుపురు సేయురీతివి ప్రబంధములా న్నపవల్ రసోచి
ఋలు బహునాటకంబులును మున్నిటిపాటలయె యంచు నెల్లరుం
దలఁచుచునుండి రుండినను దత్కృతికల్పన నాతరంబె యీ
తలయును దోఁకలేని పెనదారికవిత్వముగాక యెంచినన్. ౩

చ. కలవుసహస్రసంఖ్యగల కావ్యము లియ్యది వానిహంతకుం
గలనయినం జనంగలదె కావ్యమునం జనునే యనీయనన్
వెలను పఠింటు నూటఁ బది వందలలో నొకపద్యమేని వి
జ్ఞులఁ దల లూఁపఁ జేయదె ఘనుం బెనుడుండుభమట్ల వ్యర్థమై. ౪

ఉ. మానవభూమిలోఁ బనికి మాలినవస్తు వటంచు నున్నదే
తేనెయుఁ ద్రాఁచు ముండ్లపొద త్రేలును బెబ్బులి తెక్కలీఁడు వి
ద్యానిధి మంచిపుస్తకము తప్పులకుప్పలపొత్త మున్న నే
యా నొకటున్న నొక్కటికి నక్కఱగల్గును బ్రాణికోటికిన్. ౫

గీ. అరివెలఁగపండు నారగింపఁ దలంపఁ, బగులఁగొట్ట గుండు బండ వలయు
నటులు మంచిగ్రంథ మాహ్లాద మిడ దొక్క., చెత్తపుస్తకంబు నెత్తకుండ. ౬

గీ. కవితలంపుతోడఁ గవిసంతసముతోడఁ, గవిసి చదువకుండఁగ వినిగి యని
యనరు తెలిసినట్టి జనులు నాకన్నుల, తోడఁ జూడుమనఁడె తొల్లి యొకఁడు. ౭

శా. తూకం గౌరవ మిచ్చ మెచ్చనుచు వంతుప్రీతి యీమాటలోఁ
జాకుం గల్గినయట్టిభావము ప్రశస్తంబంచుఁ దూచాలకై
పోకలోవుచుఁ బూర్వకావ్యములఁ, దప్పుల్ వ్రాసి యర్థంబులం
బోకార్పన్ సమకాలికుల్ దమకృతిన్ భూషింపఁగాఁ జెల్లదే. ౮

శ్రీ గురుమారమణాయనమః.



# ఉన్మాదసహస్రము.

# వెఱ్ఱికివేయివిధములు.

## ప్రథమశతకము.

—౦౦:౦:౦౦—

సీ. మొట్టమొదటివెఱ్ఱి మూర్ఖున కతిరసాభ్యంచితకావ్యము ట్లరుచిపుట్టు
యాచకావృతలోలుపాగ్రేసరునిరీతి నాత్మ యేవేళ నఱ్ఱాడుచుండు
భూషణార్థినియైన పొల్తిని సంఘసంస్కర్తయాపతియట్లు కసరఁదొడఁగు
మనుపురశ్చరణార్థి మాంత్రికునట్లు లోలోన నేమే సూక్తులు పచరించు
వినియువినమి కనియుఁ గనమిదినియుఁదని, యమిస్పృశించియు నెఱుఁగమియరయమి
పరిమళము నగంధభావంబు మఱపును, దెఱపు వెఱ్ఱిమొగము దేలు నరుని. ౧

సీ. రెండవవెఱ్ఱి నొక్కండ పెక్కండ్రతోఁ బలెను సంభాషించు వ్యర్థవాద
మొనరించు గగనంబుఁ గనినవ్వు గాలితోఁ బోరాడు నొకవేళ బూతులాడు
నఖిలజంతుధ్వను లనుకరించుఁ బురాతనాంశంబులెత్తి వ్యాఖ్యకుఁ గడంగు
దెల్పరాని రహస్యము ల్పరులకుఁ జెప్ప దిగ్వాసనుఁడు నష్టహ్రీయు నగును
జెడ్డపని చేయఁ గడఁగు మంచిపనిఁ జెఱచు, నిద్రయుడుగును వెఱ్ఱితిండి దిను భయము
దొక్కతటినుండు సాహసమొక్కతఱిని, వికవికని నవ్వు సేడ్పుఁ గల్పించుకొనుచు. ౨

సీ. మూఁడవవెఱ్ఱికి మున్నిట్టి కఠినోక్తు లీతనినోట రా వేమికతమొ
యని లోకు లేర పిచ్చా వెఱ్ఱియా యని సంభాషణములోన సాదుసేయ
నాకుఁ బిచ్చా యన్ననీకంచు వాదించి కానిలే రేపురా గడవలేదు
పోయి ర మ్మని పంపఁ బోయి భార్యనుదిట్టు బిడ్డల మిషవెట్టి బిట్టుఁగొట్టు
నాకుఁ బిచ్చని యెవ్వరెన్నఁడనలేదు, నాకుఁ బిచ్చట యనికొంచు నాఁడునాఁడు
నిద్రపోవక ప్రలపించి నెయ్యునైనఁ, గసరివైచుచుఁ గంబానఁ గట్టఁబడును. ౩
సీ. నాల్గవవెఱ్ఱిలో నాయనా నిన్నప్డు తిట్టినదానికా యిట్టి శిక్ష
త్రైరాశికములెక్క తప్పఁ దప్పెఁ బరీక్ష తంటాలమారి సాధనముగొనియె
వీరన్నఁ బిలువకు పెట్టు తిందును బువ్వ చెప్పరా సంతలు చెప్పకోర
బిడ్డనైనను రేపు పిలిపించికొందును గొలుసువిప్పినఁ బండుకొందు నాకుఁ
గడుపు నొప్పి సీళ్లు గావలెఁ దాళఁ, జెవిని దెమ్మ చెల్లి చెప్పఁబోకు
వట్టిదేసె వదలిపెట్టిననింతలోఁ, గాకినాడ యనుచుఁ గన్నుగిఱుపు. ౪
సీ. ఐదవవెఱ్ఱి బొయ్యని కుక్కమొఱిగిన దానితోపాటుగాఁ దానుమొఱుగు
గాలికిఁ దలుపు దగ్గఱఁ బడ్డ ఢమ్మనఁ జెయితట్టి యెగిరి యెచ్చెల్లనుఱుకు
నాకసం బుఱిమిన నర్జునఃఫల్గునః, కొట్టునీతస్సని మిట్టిపడును
గడియారమును గాంచి కత్తెర్రి గింజుకో చచ్చిన మ్రింగను బిచ్చిమందు
నొక్కదానికినొక్కమందెక్కువగును, నేఁడు గానిమ్ము గంపెఁడు నిమ్మకాయ
లైనఁ దెమ్మను బిల్లనూయగపఱిచెదఁ, దోడనిమ్మని తిట్టు సంతోషపడును. ౫
సీ. ఆఱవవెఱ్ఱిలో నన్నంబు దినుమన్నఁ దాయెత్తు విప్పెదవా యటనును
దానమాడర యన్నఁ దాసు నీవానీటఁ జేయిముంచితి వేమి చేర్చితివనుఁ
బండుకోరా యన్న బల్లపైపొట్లాలు వంటింటఁ బెట్టెద వాయటనును
మాటాడకురయన్న నోటికిఁ దాళమా నీవొక్కతెవె యమ్మ పోవెయనును
ఎట్లు గుదురునురాయన్న నేమిజబ్బు, పిచ్చిగాదమ్మ పెదపెద్ద పేళ్లువెట్టి
చంపుచున్నారు దొమ్మరి సత్తిగాఁడు, వైద్యుఁడయ్యెనె యని బడాపగులనవ్వు. ౬
సీ. ఏడవవెఱ్ఱి దానెప్పుడుఁ గారంబుఁ దినుచుంటఁ బులుసు హృద్వ్యాధిమందు
నట్టివేఁడిపదార్థ మారగించుటఁ గోపగించుటయు నుపవసించుట లవ
ణాధిక్యభుక్తిచే నాతపంబునఁ బరిభ్రమియింప నువ్వులప్రప్పు నగిసె
నూనెయుమున్నగువాని సేవించుటఁ బెరుఁగు ద్రావుటఁ గల్లు పెల్లుగొనుట
గంజి తరవాణి గ్రోలుట ఘర్మకాల, మందును శరత్తునందు జీర్ణావసరము
నందుఁ గామాంధుఁడైన మధ్యాహ్నముననొ, యర్ధరాత్రంబుననొ నరునావహించు

సీ. ఎనిమిదియవవెట్టి యెట్టిఁగాఁ గాఁగిన నక్కఁజూచిన మేషకుక్కటారి
జంతుహింసలఁ గాంచినంతనె గరువుట్టుఁ దాటిపెంకలుగీఱ ద్రవపదార్థ
ములు సూడ వ్రణపట్టికల ముడుతలుగన నొలిచిన పచ్చితోల్గలయఁగనఁగ
మరణంబు విన్నను మాంసంబు గన్నను మంటలు సూచిన గంటవినిన
నార్తనాదంబు హాతమున నాలకింప, దొంగ దొంగని యఱచినఁ దోడులేక
యున్న నెన్నిగతులనో యీయుగమునందు, మెలఁతలనుబట్టి బాధించు మిక్కటముగ.

గీ. తొమ్మిదవ వెట్టియును బొలంతులనె పట్టు, ధనమువెట్టియు నగలు వస్త్రములవెట్టి
సుందరాకృతివెట్టి యసూయవెట్టి, సంతుసై వెట్టి పూజలు సలుపువెట్టి. ౯

గీ. పదియవది యసవెట్టి సంభవిలు స్త్రీపు, రుషుల కనవరతంబు గోరుకుల వెట్టి
నాటకమువెట్టి కథవెట్టి నవలవెట్టి, వెట్టిలో వెట్టి కొసవెట్టి వేలవెట్టి. ౧౦

సీ. పదునొకండవవెట్టి పరఁగుసుష్టాన్నమొ క్కప్పు డల్పాన్న మొక్కపుడుఁ జలిది
యొక్కప్డు దినుటను నూరక ప్రత్యాదివారంబు నేరండపానమనను
వాంతియు శమలంబు వలయునంచునొనర్చు కొనుట ధాతుక్షయగుణ మెఱుంగ
కుపవాసములుచేసి యోపిక వమ్ముగా నొనరించుకొనుటచే నుద్భవిల్లి
దీర్ఘచింతాదులను దెల్వితేట లుడిగి, హృదయ మది దుష్టమై యూహాయెడలి స్మార
కంబు దప్పి వికారదృక్ప్రకట మగుచు, వాతజోన్మాదమను పేర వఱలి యెందు. ౧౧

సీ. పంద్రెండవదియగు వాతజోన్మాదము గలుగుటఁ దెలియు లక్షణము లివ్వి
కారణం బొక్కింత గలఁగకయే నవ్వుఁ దగనిచోటను హాస్యతను నెఱపును
గూనిరాగంబులు గుసగుసల్ కుంటినృత్యంబులు చిఱునవ్వు స్వాంగవాద్య
మర్థవిహీనమౌ వ్యాహార మొనరించు ముక్కుమూతియుఁ ద్రిప్పు మూర్ఖవృత్తి
రోదనం బొనర్చు రూక్షమౌ దేహంబు, మేనుచిక్కనొండె మెక్కినన్న
మఱుగునపుడువ్యాధియధికంబునొందును, నొడల నరుణకాంతి గడలుకొనును. ౧౨

మ. పదుమూఁడైన యుమాద, మేగుణము చెప్పంబడ్డదో శాస్త్రకో
విదపక్కి న్విషకోటి కాగుణము లుర్విం గల్గుమద్యంబు నొ
ప్పిద మొప్ప న్వినియోగముంజలుప కేవేళన్ వృథాసేవచేఁ
బొదలు న్వింతగ భూగృహాంగధనలబ్ధుల్ క్షీణతం జెందఁగన్. ౧౩

సీ. పదునాలుగవవెట్టి యుదయమౌ దుర్బుద్ధు లొరులస్వభావంబు లరయలేక
దొర లెప్పుడును ద్రావుదురు వారి కైశ్వర్య లోపమాయెనో మనలోపమేమి
యని కన్ను మిన్నుఁ గానని దుష్టసహవాసములలోఁగి జారత్వమునకు నంగ
మైనయీదుర్వృత్తి కులవాటుపడినను మద్యంబునైజమ్మంబు వరల

కన్నవట్టులు మంచివౌ నద్ది యుక్తి, యుక్తముగ వినియోగింపకుండి రేని
రోగమును సర్పమునగవినియోగపఱుప, నమృతతుల్యగుణంబుఁ దా నమరఁజేయు. ౧౪
సీ. పదునైదవదియయి పరఁగునున్మాదము ప్రాచుర్య మిదియగుఁ బ్రాణికోటి
కన్నంబు ప్రాణమౌ నది సప్రమాణమై యధికమై యసుఖుల నవలికనుదు
గరళంబు ప్రాణభంగకరవృత్తియునైనఁ దిలమాత్రసేవ వర్ధిలుసుఖంబు
వీని నెఱుంగక పానాత్యయంబునఁ జెడుదురు మద్యంబు చిత్తవీథి
కెక్కి స్వగుణపుష్టి నింద్రియోజోధాతు, గుణసమృద్ధిఁ జెఱచి కొంకక యల
ధాతువునకుఁ గల్గు దశశక్తులను సత్త్వ, గుణము మాల్చు దీనఁ గూడు మదము. ౧౫
సీ. పదునాఱవదియగు పానజమద మను వెఱ్ఱినాలింపుఁడు వివిధగతులు
వేఁడిచేయుగుణంబు పోఁడిమేచే శీతలోపచారములకు లోపుగాదు
తీక్ష్ణత్వముండి మతిని బోనడంచును సూక్ష్మత్వమున మేనఁ జొచ్చువేగ
విశదతఁ గఫశుక్రవృద్ధికడ్డమువచ్చు రూక్షత్వమున వాతరూఢమగును
ఆశుకరవృత్తిఁబుట్టి మోహాదులెల్ల, గసురుపాటొందు దేహంబుఁ గదలుకొనును
జొక్కులాహిరిమించిన శూన్యహృదయుఁ, డెల్లతావులఁబడి దొర్లు హీనబుద్ధి. ౧౬
సీ. పదునేడవదియగు పానంపువెఱ్ఱి యి ట్టిదియని నరుఁ జూచి యెన్నవచ్చు
మద్యంబు మృద్వన్నమాంసాజ్యభక్ష్యభోజ్యములతో సేవింప నాయువెదుగు
దేహపుష్టియుఁ గల్గుఁ దల్పినట్లుగఁ ద్రావ సౌందర్యమొదవును సంతసంబుఁ
దేజస్సు విక్రమదీప్తియు నలవడు నదిగాన కజ్జు లన్నాదు లుడిగి
మొగముగడుగంగ సందెవార్వఁగ జలంబు, లుడిగి దీనిన వాడి నాణెడమెలేదొ
నీరసపు నీరుద్రావంగ నేరననుచు, గుండెయెండి కృశించి తా నంతుకతన. ౧౭
సీ. పదునెనిమిదవవెఱ్ఱి పొడలు మద్యమదాఖ్య మద్యపానముచేసి మతిచలింప
కుండనాటకముల నొప్పుగా నటియింత్రు సంగీతములఁ బాడఁ జాలియుంద్రు
సరససంభాషణ సంతుష్టభోజన సుఖనిద్రలను మత్తుసోఁక కుంద్రు
శయ్యతోడఁ బురాణశైలి భంజింపక కథ నింపుగాఁ జెప్పఁ గాంత్రు మఱియు
మద్యసామాన్యగుణ మగుమత్తు గొనక, మంచిపను లెన్నియేఁ జేయుమనుజులుంద్రు
గాని వారిని సజ్జనకక్ష్య నిడుట, వేయునొక్కటి యగువెఱ్ఱి వేయునేల. ౧౮
సీ. పందొమ్మిదఁవవెఱ్ఱిఁ బానకారణమున మత్తిల్లి బుద్ధి సూక్ష్మతనశించి
స్మృతి దప్పి వడి తనసిగ తానె బిగఁబట్టికొని విడురా ముండకొడుకయనును
గొణుఁగుపోయినమాట గొడఁగు నేనిప్పుడు త్రాగుటమానితి ధనములేక
యను శాంతి నిలువక యట్టిట్టు విసుగును [illegible] గోప

గించు నిద్రవోవు నించుకసేపట, లేచు నీళ్లు గలిపె నీచుఁ డంచుఁ
దిట్టు నాగవుండ్లఁ దినఁ డన్నమెక్కఁడు, త్రావఁ జోటులేకపోవు నంచు. ౧౯

సీ. ఇరువదియవవెఱ్ఱి నెఱుఁగఁడు వావివరుసలు పెద్దలనైన విసిగితెగడు
బ్రాహ్మణాండమ్ముఁ జేపలఁ గఱకుల్లులను దిను బ్రజ్ఞలేక పిల్లిల్లుఁ దొల్లి
మంతనంబునఁ జేసి మాటిన వెల్లను వెలివుచ్చుఁ బ్రాణహత్యలు మొదలుగ
నేఁ డేనిదుష్కార్య మొనరింపఁ దలఁచున్న, నెవ్వరు వినగని యెత్తిపలుకుఁ
గానికూళ్లు దినును గావింపరాని కృ, త్యములు సేయుఁ దన్నుఁ దానె మఱచు
మద్యపానమునకు మడిగట్టుకొన నేల, యని సమస్తమునకు నతఁ డెవచ్చు. ౨౦

క. ఇరువదియొకటవవెఱ్ఱిని, మరణించినవానిరీతి మ్రానిక్రియం దా
నరుఁడుండు నెఱుకగలదె, వ్వరు నీపానంబువాఁతఁ బడుదురె జగతిన్. ౨౧

క. ఇరువదిరెండవవెఱ్ఱిని, బోరిపుచ్చెదు పులులు గలుగు పొదకింగ్లక్రియం
బోరి గంజాగృహములలోఁ, జోరఁబడి నశియింత్రు జ్ఞానశూన్యులు పెలుచన్. ౨౨

క. ఇరువదిమూఁడవవెఱ్ఱిని, సరసాన్నము లుడిగి యెపుడుఁ జాలఁగ మద్యం
బురుచింబడి దుర్బలుఁడై, మరణించును బుద్ధిలేనిమనుజుఁడు భూమిన్. ౨౩

సీ. ఇరువదినాలుగై యొసఁగినవెఱ్ఱి కోపంబడ్డు భీతిఁ బిపాసితుఁడగ
శోకంబు పట్టున క్షుధితుఁడై యున్నపుడ్డుఁ బనులచే నాయాసపడిన సమయ
మందున మలమూత్రబంధనంబునఁ బొట్ట నిండ నీర్ద్రావి జీర్ణింపకుండ
మరలభుజించియు మైస్రుక్కియున్నంత నెంతతాఁకుడువడియుండునపన
మద్యపానమునను మనుజునకు విశేష, వికృతు లాపవు నిట్టివేళ లన్ని
విడిచి యుచితవేళ విధివంతముగఁ ద్రావఁ, గడఁగ సంతగండకత్తైచేమి. ౨౪

క. ఇరువదియైదవ వెఱ్ఱిని, నిరుప్రక్కల నొప్పి శ్వాస హిక్క శిరఃకం
పరుజయు నిద్రాభంగము, చిరముగ నరుఁబొందు మద్యతీక్ష్ణత్వమునన్. ౨౫

క. ఇరువదియాఱవవెఱ్ఱిని, జ్వరము చెమట డప్పి భ్రమము వచ్చఁబడినమేన్
పరితాపము స్ఫురియించుం, బరువడిఁ బైత్త్యాప్తి మద్యపాయింగనినన్. ౨౬

క. ఇరువదియేడవవెఱ్ఱిని, శరీరమతిభారయుతము జలుబు విరసతా
స్ఫురదాస్యము మూత్రాదిక, నిరోధమును గల్గుఁ బాననియమము లేమిన్. ౨౭

క. ఇరువదియెన్మిదియవవె, ఱ్ఱి రయంబున నుబ్బుఁ గడుపు త్రేఁపులు మెండౌ
పరితాపము త్రావినక, ల్లరయఁగ జీర్ణంబుగామి నగపడునెందున్. ౨౮

క. ఇరువదితొమ్మిదియవవె, ఱ్ఱిరవసుఁ దనయేకపుత్త్రుఁ డే సేండ్లున్నన్
దరిఁ జేరనీఁ... లేకను, దరియింపం జెట్టు లొక్కె దైవము యనినన్. ౨౯

సీ. ముప్పదియవ వెఱ్ఱి యొప్పును బానవిభ్రమమన హృదయంబుఁ బట్టు నవయు
వంబులఁబోట్లు కఫస్రావ మాయాయిస్రోతస్సులను గంఠశోషణంబు
మూర్ఛ వాంతియు జ్వరమును దలనొప్పియుఁ దలమంట యొదవు మద్యమును దప్పి
కాగంబు నన్నవికారమారుచ్య భక్ష్యములపై నరుచి లక్షణము లివ్వి
గలుగు దేహమందుఁ గదలఁగా దున్నివి, త్రనము పవనఁ జల్ల నెనసినట్లు
పొదుకొనును విడవు పైబాధ లెన్నఁడు, విడుచుఁ బ్రాణ మొక్క వేళయందు. ౩౦

సీ. ముప్పదియొకటగు ముప్పసవెఱ్ఱిని బెదవులు వ్రేలాడు హృదయమునను
శీతంబు వెలుపలఁ గాత్రోష్ణంబును నోట జిడ్డునుగల్గును రదనోష్ఠ
జిహ్వాలనైల్యము చేరుఁ గన్నులనెఱ్ఱ వాగొండె గాకను బచ్చయొండెఁ
బుట్టును మితిమీటి పురుషుఁడు మద్యసేవాసక్తుఁడౌట నయ్యాధముఁ డెంత
కాలముండు వలగు కష్టసాధ్యంబగు, మందులేల రోగమహిమ ప్రబలి
కుదురఁబెట్టుఁ బీర్ల గుండానఁ బడవైచి, తానె యేచా యొక్క లరుణమందు. ౩౧

క. ముప్పదిరెండవ వెఱ్ఱిని, దప్పాకొన స్వార్గమొందు దగు మద్యాతిక్
గుప్పున వెడలిన దోసము, చప్పునఁ దత్సేవవిడువ శాంతిం బొందుక్. ౩౨

క. ముప్పదిమూఁడవ వెఱ్ఱియు, ముప్పాదవినఁ ద్రావమాని ముఖ్యారోగ్యం
బెప్పుడు గలిగిన వెండియు, నెప్పటియాటాడువాని నెత్తికొని చనుక్. ౩౩

సీ. ముప్పదినాల్గవమూర్ఛాఖ్య వెఱ్ఱి తా నీక్రింది వేళల నిరవుకొనును
క్షీణించియున్నను జెందని యాహారము భుజించియున్న విణ్మూత్రబద్ధ
మయినప్డు దెబ్బల నంగమెల్లను ఘాతములఁ బొందినప్పుడు మున్నుగలుగు
సత్త్వగుణంబు నాశమునొంది బాహ్యాంతరముల నింద్రియముల ధమనులందుఁ
గ్రూరవాతాదిదోషములు లక్కదురుపడిన, సంజ్ఞను వహించునాడుల శక్తిపోయి
మ్రానుపడి వ్రాలుదురు నేల మనుజులదియె, మోహమందురు కొందఱు మూర్ఛయంద్రు.

క. ముప్పదియైదవ వెఱ్ఱిని, దెప్పరమగు ఱొమ్మునొప్పి దేహమువిఱుపుల్
విప్పుగ బడలిక జృంభలుఁ, జెప్పను రానుండె మూర్ఛ సిద్ధం బనుచుక్. ౩౫

క. ముప్పదియాఱవ వెఱ్ఱిని, గప్పగ నెఱ్ఱగను జూచు గగనము మూర్ఛం
జొప్పడి యప్పుడ లేచును, నొప్పులుఁ గంపంబుఁ గృశతనుం గనుమేనక్. ౩౬

క. ముప్పదియేడగు వెఱ్ఱిని నుప్పరమును రక్తపీతయుతవర్ణములం
జెప్పను మూర్ఛం దేలినఁ, గప్పును జెమ్మటలు దప్పి గ్లానియు మేనక్. ౩౭

గీ. ముప్పదెన్మిదియగు వెఱ్ఱి మూర్ఛమునిఁగి, లేచుఁ జిరకాలమునకును జూచి మిన్ను
మేఘయుతమను దేహంబు మిగుల బరువు, నెగడు నోటను జొంగ వాంతియును దోఁచు.

సీ. ముప్పదితొమ్మిదౌ మూర్ఛాభిధాయి వెఱ్ఱి జనించునరుని గుర్తింపవచ్చు
సన్నిపాతాంగలక్షణముగా వాతాది దోషత్రయములోఁ దోడుగూడి
బీభత్సకరములై వెడలుఁ జొంగలు దక్కఁ దక్కునపస్మారతావిశేష
గుణములతోఁగూడి గొబ్బునఁ బడఁద్రోయు మనుజుని నేలపై మాటవెడల
నీక మూర్ఛలనేకముల్ పృథివియందు, బాలికల యువతులఁ బట్టి బాధపెట్టు
దుఃఖజాదులు గలవు ముందు వివరింతుఁ, జిత్తగింపుఁడ యవధాన చిత్తులగుచు. ౩౯

గీ. నలువదవ వెఱ్ఱిపట్టును నరులనెందు, రక్తమును జూడ దాని నాఘ్రాణ మొనరఁ
జేయ నదిగాన హింసలు చేయుచోట, నిలువరాదట్టి హింసలఁ దలఁపరాదు. ౪౦

క. నలువదియొకటవ వెఱ్ఱికిఁ, గలుగును విషమూర్ఛనామగౌరవ మదియాం
తెలుదు తనంతట నణుగని, విలక్షణముగుణంబు కలిమి వెజ్జువలసెడిన్. ౪౧

క. నలువదిరెండవ వెఱ్ఱికి, మలయును మద్యజవిషాఖ్య మద్యంబునకుం
గలుగును జీర్ణంబగు గుణ, మలయించి శమించునది తనంతటఁ దానై. ౪౨

క. నలువదిమూఁడవ వెఱ్ఱియు, బలవత్తరములగు విషమువంకను గలవె
ఱ్ఱులు సర్వముగల మద్యము, నిలుపక సేవించువారినిం బొరిపుచ్చున్. ౪౩

క. నలువదినాల్గవ వెఱ్ఱిని, జలనవిహీనాంగములను జత్తువులను జూ
డ్కులు నిలమి నూపిరాడమి, దెలియంచగు రక్తజాఖ్య దీప్రపు మూర్ఛన్. ౪౪

క. నలువదియైదవ వెఱ్ఱిని, బలుదెఱఁగులఁ బలుకు నొందుభ్రమము మదిం జే
ష్టలుదక్కి జీర్ణమగువఱకు, కిలఁబడియుండును సురాదు లెప్పుడుఁ గ్రోలన్. ౪౫

క. నలువదియాఱవ వెఱ్ఱి వ, అలునది పైత్తమునఁ దమము గ్రమ్మిన మూర్ఛా
విలసనమున దానిని వై, ద్యులు నేర్పఱులైనఁ దొలఁగఁ ద్రోయుదురు నెఱిన్. ౪౬

సీ. నలువదేడవ వెఱ్ఱి నామంబు తంద్ర యింద్రియములశక్తి పర్తిలక యుండుఁ
గన్నులు చూడవు ఘ్రాణంబు మూచూడ దేహమాకసుఁ బోలె నెసఁగుఁ జెవులు
బరువగు దేహంబు బడలిక నొందగు, నాలుక రుచిఁ దెల్పఁజాలకుండుఁ
దమము వాతమును గఫమును దీనికిఁ గారణంబులు గావున నరుఁడు మేలు
కనిన నిద్రించునట్టు లంగములు స్వవశ, మునఁ జరింపమి నిదియొక మూర్ఛయగును
మలఁపఁ జాలిన చక్కని మందుగలదు, వైద్యరత్నంబులక్కడ వలయునేని. ౪౭

సీ. నలువదెన్మిదవ యున్మాదంబు నిద్రయె యెల్లరు నెఱిఁగినదేని దాని
కారణం బెఱుఁగరు గతిపయజనులు మానసము మిక్కిలి శ్రమ నలఁగినప్పు
డింద్రియంబులు స్రుక్కి యేమియుఁ జేయఁజాలని యపు డావహించును బ్రపంచ
మునఁ బ్రాణికోటిని మున్నిటి తంద్రకు నెక్కుడౌ మనసు వ్యాప్తిని మాలి

శ్లేష్మము తమోగుణంబును జీవులందుఁ, బ్రబలమై యుండఁగల్గు నిద్రయును నిద్ది
స్వప్నసంకులమును బ్రలాపయుతమగును, గొండఱకుఁ బండ్లుగీటుట గుఱకగలుగు.
గీ. నలువదియుఁదొమ్మిదియునగు కలఁతవెఱ్ఱి, భ్రమయనఁగఁ బుట్టు వాత పైత్తములునుం ద
మంబు కారణములు చక్రమధ్యమట్లు, భ్రమముదోఁచుట లేవఁడు పంచుకొనును.౪౯
గీ. ఏఁబదవవెఱ్ఱి గల్గు ననేకగతుల, మూర్ఛలన వాతపిత్తాదిముఖ్యగుణము
లాత్మశక్తిఁ గనంబర్చి యడఁగినంతఁ, దాను శాంతించు నొకట వైద్యంబు వలదు. ౫౦
గీ. ఏఁబదియునొక్కటవవెఱ్ఱి యింద్రియములు,సది ... గాఁ బట్టి నాకున్నకున్నను బిగించి
దుర్బలునిలోన నిల్చి మృత్యువున కొప్ప, గించు సన్న్యాసమనుపేర నెంచికొనుఁడు.
సీ. ఏఁబదరెండవ యీవెఱ్ఱి యుడుకని యస్నాదులఁను గార మామ్లరసము
తాపోష్ణకృత్పదార్థములు భుజించిన నింద్రియవశునరు హృదయ మెక్కి
యున్మాదమొనవించు నోర్పు దాననశించు నార్భాటము దిగంబరాటనంబు
భయపెట్టుటయును గోపంబుచూపుట పన్నువెట్టుట దేహంబు వేఁడిగిలుట
సీడయం దుండఁ జల్లనినీరు లిండి, దినఁగఁగోరుట పసుపుపచ్చని మొగంబు
గావుటయు నిట్టి దుష్టలక్షణము లొందుఁ, బిత్తజోన్మాదమని దీనిఁ బెద్దలండ్రు.౫౧
సీ. ఏఁబదిమూఁడవ యొక్కటి వెఱ్ఱి దేహపరిశ్రమము చేయునట్టివాఁడు
వృష్టాన్నభోజియౌనేని గఫంబును బిత్తముతోఁగూడి పేరురంబు
నం దెక్కిదుష్టమై యజ్ఞానమును గప్పి బుద్ధిపోకార్చి వృద్ధిచెఱచి
యున్మాదమును జేయు నొక్కప్డు మోహమా మాటాడనీదు నమలఁగనీదు
నరుచి మంద మంగనాసక్తి విజనస్థ, లాధివాసబుద్ధి యధికనిద్ర
వాంతిలాల లొదవు వాతను భోజనా, నంతరమున రోగ మధిక మగును. ౫౩
గీ. ఏఁబదియునాలుగవవెఱ్ఱి యేరుపడును, వాతపిత్తకఫంబులు వానివాని
వివిధగుణములు చూపింప వెఱ్ఱిలిట్టి, వ్యాధి సన్నిపాతోన్మాద మనిరి తొల్లి. ౫౪
సీ. ఏఁబదియైదవ యిట్టివెఱ్ఱి జనించు భటచోరధననశత్రుభయమువలన
భార్యావియోగంబు భర్తృవియోగంబు ప్రియతమాలాభ విక్రియయుఁ దొడరి
మనసు ఖేదించియున్మాదంబు జనియించుఁ గ్రూరవృత్తిని దానిగుణము లివ్వి
బహువిధంబులను సంభాషించు లోగుట్టు వెలివుచ్చు నేకాంతవివృతిసేయు
గానమొనరించు వికటవిజ్ఞాన మొదవు, నవ్వు నేవేళ నేడ్చు మానసము మూఢ
వృత్తి కిరవగు దీనిని వృద్ధు లనిరి, శోకజోన్మాద మని పరిశోధనమున. ౫౫
క. ఏఁబదియాఱవవెఱ్ఱి య, నాఁ బరఁగును గన్ను లెఱ్ఱనయగుట మొదలన్
లేఁబరువుకాంతి దైన్యము, లోఁ బొదవిన మొగము గలుగు దుర్బలయుక్తిన్. ౫౬

గీ. ఏఁబదియు మీఁద నేడయియొసఁగువెట్టిఁ, దలఁపువాంచునుఁ బైకెత్తుఁ దప్పయొందు
నిద్రనశియించు మత్తుజనించు నిద్ధి, యగుచసాధ్యమ్ము వైద్యులహస్తమునకు. ౫౭

సీ. ఏఁబది యందుపైనెనిమిదియవవెట్టి భూతసంబంధమవు నొకవికృతి
రానిభాషలుప్రాయుఁ బ్రస్తావమొనరించు ననధికారియును శాస్త్రార్థములను
రాఁబోవుఫలము పూర్వజ్ఞానివలెఁ జెప్పు నెత్తిదింపఁగరానివెల్లఁగదవు
నొరులుఁజెప్పఁగలేని గురుసంఖ్యలెజెఁగించు భుక్తిలేకయ దేహపుష్టినొందుఁ
దనకుఁ దెలియని చిత్రలేఖనముసేయు, నర్థములుచెప్పు శ్లోకంబులనయకుండ
దుర్బలుండయ్యునడచు సుదూరమిట్టి, విక్రమ మమానుషంబునుక్కినరునొందు. ౫౮

సీ. ఏఁబదితొమ్మిదై యొసలారువెట్టి దేవగ్రహోన్మాదసంబంధ మగును
నిత్యసంతోషియు నత్యంతశుద్ధుఁడు దివ్యమాల్యావృతదేహి యగును
నిద్రనోవఁడు శుద్ధనిర్జరభాషమాటాడు దేజస్వియౌ నమలనేత్రుఁ
డయియుండు వరములుదయసేయు బ్రాహ్మణభక్తివిశ్వాసము ల్పాటిసేయు
నిట్టిలక్షణములు గల్గు నేనివాని, దయ్యమని కయ్యమనుచు బాధలకులోను
చేయరా దతఁ డొక్కప్రసిద్ధివలన, నట్లువర్తించు దాన నేహాని లేదు. ౫౯

సీ. అఱువదియవవెట్టి యరయంగనగు మాతృగణదేవతావేశగణన నద్ది
క్షుద్రమానవుఁబట్టి క్షోభపెట్టును చెమ్మ కోడినిగొట్టెఁ దే గోడ్డుఁదెమ్ము
అన్నంబువెట్టెద నని మొక్కుదీర్పవు గుంటంబుద్రొక్కవు కట్టువాని
పేరుపెట్టవు నిన్నుఁ బ్రేల్చెదఁ గూల్చెద మూఁడుమూరలులేవు మోసపుచ్చఁ
దలఁచినాఁడవు చూడునాదర్పమనుచుఁ, బ్రేఁపబెత్తము జళిపించుఁ బీఁకికొసకు
జిట్టువెండ్రుకలను గన్నులెఱ్ఱసేయు, సాంత్వనమ్మునఁ జల్లారి జరగు నవల. ౬౦

సీ. అఱువదియొకటవదగు వెట్టి గ్రామదేవతఁమూలమునను బ్రకటమగును
ఊష్పుఁబట్టికిలేని యొకపురుషుఁడొ స్త్రీయొ నేను దేవత నని నిలయమందు
గద్దెలంచును నిల్పి కలకాలమిక్కడఁ బొరలుచు సాంబ్రాణిపొగలు ధూప
మనివేయు నావహించినయట్టు లూఁగుచు మీకు భయములేదు మిమ్ము నేను
గాచియుంటిఁ గాఁడిగట్టు నాచెల్లెలు, రాఁదలంచె నిటకు రాకయుండఁ
గట్టివైతు నాకుఁ గట్టఁ గోకిమ్మని, యిల్లుగట్టు మంచు నెపుడుఁబాడు. ౬౧

సీ. అఱువదిరెండవదయిన వెట్టిజనించు మూఢమానవులకు బుద్ధిమంతు
లను జేరరాదు దానినిలక్ష్యపెట్ట గగ్రకులంబువారు మారెమ్మ ననుచ
గంగమ్మ ననుచు నాఁకలిగొంటి నాకేడుకొమ్ములపోతును దెమ్మటంచు
వేఁపకొట్ట పసుపు వండిపాన్పుల బెత్తములు పంకకత్తులు బూని యూర

వీధులంబడి ప్రజలను బెదరఁగొట్టి, యట్టహాసము సేయుచు నావురనుచు
నోరు దెఱచుచు సివమెత్తి ఘోరవృత్తి, మొండిగోడలు దుముకుచు మెండుకొనును. ౬౨

సీ. అఱువదిమూఁడవదనఁ దగు వెఱ్ఱిఁ గోపము గల్గియుండుట వణఁకుటయును
నవయవంబులు శిథిలావస్థనొందుట సుహృంగయుఁ జొల్లును నోటవెడలు
టయును గాఢనిద్రనుంటయు మాటలేక మూఁగయుఁ బోలెనుండుట గట్టిమూఁగ
యగుట సివంబాడు టాదియౌగుణములు గలుగును క్షుద్రులౌ గ్రామదేవ
తలకతంబున నట్టి వారలు భయంబు, చేత నుపవాసములు చేసి చివికి యేమి
చేయ నేమియగునొయని చెడుదురవని, మందులే దిట్టివారికర్మంబునకును. ౬౩

సీ. అఱువదినాల్గవ దనఁబడు వెఱ్ఱికి నపరగ్రహోన్మాద మనెడు పేరు
చెమటగాఱును శరీరమునుండి యెక్కుడు బ్రాహ్మణాదులఁ గన్న బ్రహ్మిగాఁడు
రాచవాఁ డలసుత్తరాచవాఁ డుల్లిపాయలబచ్చు పిలికియం చాడిసురుపుఁ
బుచ్చగింజలు సామి పుచ్చుకొండని వాలిప్రలిమ నీకుం గితకితలుగలవె
యనుచు దోషోక్తులాడుచు నడ్డుచూపు, నూచుచును నిర్భయుండయి శ్రుతివిరుద్ధ
కార్యములు సేయఁజూచు వెక్కసము లేద, చెంతదిన్నను జనఁడొకింతేని తృప్తి. ౬౪

సీ. అఱువదియైదవ దగు వెఱ్ఱి గాంధర్వ మనియిట్టులుండు నెల్లప్డు మనసు
సంతోషమును బొందు జననకు నిసుకతిన్నెలమీఁద నుద్యానములనుదిరుగ
నభిలాష మెండగు నాచారవంతుఁడౌ సంగీతమునయందు సంతసంబు
గంధపుష్పాక్షత లక్కలపములే పరిమళతైలము లర్కము ల్తలగడుగులు
వలిపములు నృత్యములు నీనిపైని బ్రీతి, చూచ్చు స్మితహితమృదుపవనసంఘనమ్ము
వానితో మాటలాడంగ వానిపల్కు- లాలకింపంగ జనులకు హర్షమొదవు. ౬౫

సీ. అఱువదియాఱవ దగు వెఱ్ఱిఁ గన్నులెఱ్ఱగనుండు రమ్యములగునవి మృదు
శంబులు రక్తవర్ణంబులు నగు వస్త్రములఁ దాల్చు గాంభీర్యము గనఁబఱుచుఁ
జఱచఱనడచును జూఱుసుఁదనంబెచ్చు మితభాషియగు బంధుమిత్రులకడ
శాంతంబునవహించు సకలంబుపట్లఁ బ్రశస్తమైనట్టి తేజంబుగలుగు
నెవ్వరేమిగోర నిచ్చెదనను నీకు, నేమివలయు నడుగు మిచ్చెదనను
నీని కేమియిత్తు వేఁడకయే యను, యక్షజం బుమావ మంటినపుడు. ౬౬

సీ. అఱువదియేడవదైన వెఱ్ఱికిఁ గల్గుఁ బితృభక్తి తద్గ్రహప్రేరణమున
దర్భలుపఱుచు ముద్దలుచేసి పిండములను బెట్టు పితరుల కనుదినంబు
నమవసయని శ్రాద్ధమని శాంతభావంబు గలిగియుండును బయిఁగప్పువస్త్ర
ముపవీత [illegible] సవ్యముగ మార్చు జలతర్పణము సేయుఁ దిలలుగలిపి

మాంసభోజియగును మాషాక్తములు పిండి, వంటకములు గుడము పాయసంబుఁ
దినఁగ మనసుపడును మన సెప్డుఁ బిల్పుదేవ, తర్పణంబునంద తగిలియుండు. ౬౭

సీ. అఱువదియెనిమిది యగు వెట్టి నాగగ్రహోన్మాదమనియందు రక్ష్యబుధులు
ఉరగంబుగలినేల నురమునఁ బ్రాఁకును నాలుకచాఁచును నాకు పెలవి
కస్సను బుస్సను గసరుఁ గోపంబునఁ దలయెత్తు వంచును దాఁగనడుమ
మసలుచుండును డాఁగు మాటున ముడుచుకొని పడుండు బుసకొట్టు నేర్పుమీఱఁ
గుబుసమును సడల్చ గొబ్బునఁ దొడుగును, మెలఁపుఁ దోన పాముమీసములను
బాలుఁ దేనెఁ బ్రాలపాయసంబును బెల్ల, ముఁ జలిమిడిని గోరు భుక్తియందు. ౬౮

సీ. అఱువదితొమ్మిదియవ వెట్టి సోఁకిన మాంసమ్ము దిను చాటుమాట రక్త
పానంబొనర్చును నానావిధంపు మద్యమ్ములు రుచిచూచు నధికశౌర్య
మును గ్రోధమును గల్గి ముడివెట్టు బొమలను ధనమదదేహసిద్ధమగు బలము
గలిగి త్రిమ్మరును మిక్కిలి నిష్ఠురోక్తులు పలుకునెల్లర లజ్జ వదలివేయు
రాత్రులందు నిద్ర రాక సందులు గొందు, లందుఁ దిరుగు దుష్టుఁడగుచు మడియు
మైల యనఁడు శుద్ధిమాట దెలియంగఁడు, రాక్షసగ్రహంబు రాయిడింప. ౬౯

సీ. డెబ్బదియవ వెట్టి డెప్పరంబగును దంత్రాంతరదర్శనవ్యాప్రియతను
వేదంబుఁ జదువును ద్వేషించు బ్రాహ్మణు దేవత లెవ్వరు తెలివిలేమి
గురుఁ డెవ్వఁ డొకనికోర్కులుదీర్ప నను బరిశుద్ధుఁ డౌటయకాని శుచియనంగఁ
దడిబట్ట కట్టుట యడియాళమా మాలమాదిగలకు రక్తమాంసయుతశ
రీర ముండ దొక్కొ రీతులా యివియని, నవ్వునొరుల మనసు నొవ్వ నెంచు
బ్రాహ్మణుంద్రు దీని రాక్షసోన్మాదమే, పలుదెఱంగు లిదియుఁ దెలియఁ గోర. ౭౦

సీ. డెబ్బదిపై నొక్కటియగు వెట్టి పిశాచజుష్టమా నది కడుఁ గష్టమబ్బ
దాన హస్తంబు లూర్ధ్వమ్ముగా నెత్తుట దేహంబు కృశియించి తీక్ష్ణమగుట
సందర్భహీనప్రసంగం బసంబద్ధవాచకయుతియును వాసనాక్త
సర్వాంగుఁ డౌట యాచార శూన్యుం డౌట యపరిశుద్ధుండయి యన్నపాన
ములను బేరాసగొనుట సంపూర్ణభుక్తి, గొనుట నిర్జన వనదేశమునఁ జరింప
నాసగొనుటయు నేడ్చుట యఖిలవిధవి, కారచేష్టలు చేయుట గలుగునెపుడు. ౭౧

సీ. డెబ్బదిరెండవ డబ్బఱియగు వెట్టి వృక్షాగ్రమునసుండి శృంగమందు
నుండి గజాశ్వాదినుండి పడ్డప్పుడే గ్రహమైనఁ బట్టినఁ గన్నుగ్రుడ్లు
మిడివడ లాలలుమిసిన నోష్ఠంబులు నాకిన వణఁకును న్యాకులత్వ
మలవడి నిద్రలేదైన

దుర్గ్రహులు స్వస్థులగ నగుదురు క్రమమున, స్వస్థులగుదు రె హింసార్థ సన్నివేశ
భూతులగువారు పై దుష్టరీతిగుణము, లెన్న హింసార్థమని బుధబృంద మెపుడు. ౭౨

సీ. డెబ్బదిమూఁడయి ప్రబ్బువెఱ్ఱికిని ఘోరమిఁ బట్టు దేవతాగ్రహము సంజ
ప్రొద్దున రాక్షసభూత మావేశించు నష్టమి గాంధర్వ మావహించుఁ
బాడ్యమి యక్షసంబంధగ్రహంబును నమవసను బితృగ్రహమ్ముఁ జేరు
నాగగ్రహమ్ము పంచమిని బ్రవేశించు రాత్రులం దెప్పుడు రాక్షసగ్ర
హమును జొచ్చుఁ జతుర్దశియందు వాలు, నోలిని బిశాచమనునాలిగాలి యంచు
విజ్ఞులాడుదు రది యట్లె విదితమగును, బట్టినన్నాఁడు లిరిగిరాఁ బ్రబలమగును. ౭౩

సీ. డెబ్బదినాలుగై యుబ్బువెఱ్ఱికి దర్పణమున బింబంబు న ట్లమలసూర్య
కాంతంబునందు భాస్కరతేజమట్లు శీతోష్ణము ల్ప్రాణులయొడలినట్లు
జీవుండు దేహిన ట్లేవారికంటికిఁ గనఁబడకుండఁ దాననువసించుఁ
దనకాశ్రయంబైన జనమునకుం గానఁబడదు చిత్రంబు దేవగ్రహంబు
మనుజునిస్పృశింపఁ దటుగానఁ జను నెఱుంగ, దేవతల నాశ్రయించి వెఱ్ఱిలు గ్రహంబు
మానవులఁ బట్టునని జగన్మాన్యసుశ్రు, తంబుచొప్పు నెఱుంగుట తగవుగాదె. ౭౪

క. డెబ్బదియైదవ వెఱ్ఱియు, నుబ్బతిలుక్ రోగజముల గుణము లెఱుఁగకే
యుబ్బున గ్రహజము లెఱుఁగక, తబ్బిబ్బులు వల్కు వైద్యుతలపైఁ గినుకన్. ౭౫

క. డెబ్బదియాఱవ వెఱ్ఱియు, దబ్బాటునవచ్చు నాముదపు జిట్టలు నా
ముబ్బెడు జొన్నయిలకలం, గెబ్బినచేయి కడిగికొనక గీటునఁబుచ్చున్. ౭౬

సీ. డెబ్బదియేడవ నిబ్బరపువెఱ్ఱి పల్లెలపేడలఁ బట్టు వింత
గా నెఱుంగన్ రాని గతి నాళ్లలోఁగూడు చుక్కబొమ్మనునట్టి మొక్కగింజ
లన్నంబులో జీర్ణమగునప్పు డింటిలో నందఱునొక్క..మా అవనిఁబడుదు
రన్నంబుతిని చేని కరిగినకాఁపును గట్టుపైనొరగు మైకంబుగప్పి
తెలిసి పాఱుగింటివారలు చిలుము గిలము, పట్టితాళించి కక్కింత్రువాంతియైన
శాంతినొందును దిక్కగింజలప్రభావ, మలఁతయేగాని హానిలేదందువలన. ౭౭

సీ. డెబ్బదియెన్మిదై యుబ్బువెఱ్ఱిజనింప నాగమ్మకాకియ ట్లఖిలదిశలఁ
ద్రిమ్మరుఁ బిసవెఱ్ఱి తిరిపెగానింగొల్చు దేవుఁ డాతండని దేవురించు
వెనువెంటఁదిరుగుచు వెతిపదాల్వాడు చూడ నెఱుంగఁనీని జడలపత్రి.
గంజాయిచిలుము ప్రఖ్యాతిగాధరియించు నెంగిలియనకిచ్చు నెల్లవారి
కడఁదధియొండి నిద్రయుడిగి జ్ఞానమువోయి, కూడుగుడ్డఁ గొంపఁగొమ్మవిడిచి
జ్ఞానహీనుఁడమ్ముఁ జాలియుం [illegible] చుట్టు [illegible] బ్రదుకనేర్చుఁడు. ౭౮

సీ. డెబ్బగితొమ్మిదై డీల్పడఁజేయు నా వెట్టియెట్లన్న భావిగతి లెస్స
యోజనసేయక యువతులు యువకులు నొడలెఱుంగక తమయొద్దనున్న
నగ లెల్లకాలంబుఁ దెగనమ్ముకొని తినఁజాలునంచని యిట్లె సౌఖ్యముగను
దేహముంచునటంచుఁ దెగడెంపులైపోయి యిద్దఱిలో నెవ్వరేని మడిసి
కులసుగుణమును జెడిబంధుగులకు దూర, మై బలంబును గోల్పోయి యైనవారిఁ
గానివారిని యాచించి కాని కూళ్లు, నెంగిలాకులు దిక్కుగాఁ గ్రుంగుగాం త్రు. ౬౯

గీ. ఎనుబదవవెట్టి వెట్టియెత్తినళునకమొ, నక్కయో కఱచిన యట్టినరుఁడు కుక్క
యట్లు నక్కనుబోలెఁ దానఱచుఁగఱచు, నతఁడు గఱచినవానికి నట్లెయగును. ౭౦

క. ఎనుబదియొకటవ వెట్టియు, మునగయు నానుగము పుచ్చమున్నగునవిచేఁ
దనిచెప్పక యమ్మినఁగొని, తినఁగా జనియించు నొడలు తిరుగుం గ్రక్కున్. ౭౧

క. ఎనుబదిరెండవ వెట్టిఁ గ, ననగుం బాత్రములశోధనంబున లోపం
బునఁ దగరము పూఁతచెడం, గను నలఁతియకాని కీడుగలుగదు దానన్. ౭౨

క. ఎనుబదిమూఁడవ వెట్టియుఁ, దనవంశమునందుఁ దొల్లి తాతకొ మఱియుం
జనకునకో పైత్త్రభ్రచు, దనికినఁ బారంపరీగతంబునఁ దనకా. ౭౩

క. ఎనుబదినాల్గవవెట్టి జ, నన మొందుం బెట్టుమందునను, ననురాగం
బునుగోరి వెట్టినీళ్లం, దునఁజేరిచి స్త్రీలువెట్టుదోషమువలనన్. ౭౪

క. ఎనుబదియైదవవెట్టి, త్తుచు దనకూఁతుపయిఁ బ్రేమతోనుండుటకై
శునకపుఁబాలఁ గలపియు, ల్లునకత్త యొసంగునందులోనం ద్రు జనుల్. ౭౫

క. ఎనుబదియాఱవ వెట్టియ, దనుగని యెఱనీళ్లుసుట్టి దారినడుమఁబో
సిన దెఱుఁగక త్రొక్కినకత, మున వచ్చునటం డ్రు విషయమువెఱుంగుబుధుల్. ౭౬

క. ఎనుబదియేడవ వెట్టి ప్ర, జననంబగుఁ జేఁతఁబడుల జడజనకృతులన్
జనుఁజెడిపి యెట్లుమారియు, ననఁ జిల్లంగియననిట్టి వందలివికృతుల్. ౭౭

క. ఎనుబదియెనిమిదియవవె, ట్టిని గొనితెచ్చికొనవచ్చు శిపునముస్తల్
దిని మూత్రపాన మొనరిచి, యని యనియెద రద్దినమ్మనగునో కాదో. ౭౮

క. ఎనుబదితొమ్మిదియవవె, ట్టిని జెప్పెద రజ్ఞజనులు ప్రేలొప్పటనుబె
ట్టి నితాంతము పొరటలు ద్రి, ప్పినకతమునఁ బుట్టునంచు విదితంబె కదా. ౭౯

సీ. తొంబదియవవెట్టితోఁచును ధూమ్రపత్రము నుపయోగించు ప్రజలయందు
నమలెడువారికి నస్యమువేసెడు వారికిఁ బొగద్రావువారి కెవుడు
రుచిచెడునాల్క నెత్రు విఱిగిపోవు హృత్పీడ కంపము కార్శ్యవికృతరేఖ
లొానవు నొడ [illegible] ముదును

రాగిమీసములగసు వక్త్రమ్ముదుష్ట, గంధయుతమగు నాసికారంధ్రరోగ
మబ్బు నదిలేకయుండిన నష్టమైన, వారియొద్దను జేఁ జాఁపవలసివచ్చు. ౯౦

క. తొంబదియొకటవ వెట్ట్రిక, నంబడుఁ దొలిమేనఁ జేసిన పనులఫలమిం
దుంబంచికడువఁగా జ, న్మంబాడిగ మూఁగ చెవుడు నరులందొకటన్. ౯౧

క. తొంబదిరెండవ వెట్ట్రియ, నంబడు మున్నెపుడొ తానొనర్చినయద్దౌ
ష్ట్యంబిపుడుదోఁప ప్రేలుము, ఖంబుననిడికొటికికొనుట కసరుట గతిగాన్. ౯౨

క. తొంబదిమూఁడవ వెట్టి క, నంబడినవి యొల్లనుంగొన మనోదౌర్బ
ల్యంబును ధనలోభంబును, రింబంగను వెట్ట్రియనఁగ వృద్ధిగనుఁగనన్. ౯౩

క. తొంబదినాల్గవ వెట్టి వి, నంబడు ద్యూలోత్థమయి ధనవ్యయఫలమై
యింబడరు పండితులనే, వెంబడు నీవెట్టి మిగత వెట్టులగెలచున్. ౯౪

క. తొంబదియైదవ వెట్టి జ, గంబున మృగములను బక్షిగణమును దినశే
షంబయిన మాంసమును భ, క్ష్యంబులు ఫలములును దినఁగ సంభవిలుఁగడున్. ౯౫

సీ. తొంబదియాఱయిలోఁచెడు వెట్టి చిత్రంబయినది దానిరాకవినుఁడు
స్థిరముగాఁ గూర్చుండఁ దీరదు తీర్థాదు లరయఁ బుట్టించు దృఢానురాగ
మేగు వినోదము లీక్షించి యానంద మందుచుఁ దలద్రిప్పి యవనిఁ బడును
మొగమున నీరుచిమ్ముదురు కొందఱు చెవుల్ మూయుదు రిఁకఁగొంద ఱీయవస్థ
యేటి కెఱిఁగియుండి యిటు రాఁగఁ గర్మమా, యైనయింటిబిడ్డ యనుభవంబు
తప్పదంద్రు ప్రబలి తలనిండ బొప్పులు, దేహమెల్లఁబుండ్లు దేఱియుండు. ౯౬

సీ. తొంబదేడవవెట్టి స్తోత్రపాత్రంబగు నిదురపోతుతనంబు నెగడునందు
నొక్కఁడు నిద్రలో నొడ లెఱుంగకలేచి పనులుచేయును జేసి పండుకొనును
జెట్లెక్కికాయలు చిదిమితెచ్చును నష్ట మెలఁకువవచ్చెనా మేదినిఁ బడు
నింతకంటెను జిత్ర మేఁబాద్రుఁ దొంబంద్రు నేకకాలంబున నేగి పగలు
చేసివదలినట్టి శేషకార్యంబులు, తీర్తు రిండ్లు బండ్లు దేవగృహము
లద్భుతముగ మరల నందఱునిద్రింతు, రెల్లవారఁ బొగడఁ దెల్లవాఱి. ౯౭

సీ. తొంబదియెన్మిదై యింబడరెడు వెట్టి పైత్తలక్షణమందు బ్రాహ్మణులును
దయ్యాఁబంచును నొక్క దద్దమ్మ కాల్పట్టుకొన వాఁడు మేఁకనుగోసి దాని
ప్రేవులుఁ రోగికిఁ బేరులుగావైచి కల్లుముంతలుదెచ్చి కాటినిప్పు
రగిలించి పొగవైచి రక్తంబుబొట్టిడి పద్మముల్ వైచి సబ్బండు బూతు
లాడిదయ్యముఁ దిట్టుఁ దానటుచి బింది, నాదమొనరించి జడఁగోసి నాళ్లనడుమ
దారిలోఁ బాఁతిపెట్టు నందఱును దాని [illegible] మ్మెదరునిచ్చ. ౯౮

సీ. తొంబదిపైనొక్క తొమ్మిది సంఖ్యవెట్టియగుఁ జేలునకుఁ జెట్టికిని మందు
పాముకాటునకుఁ జింతామణియని నాల్గు త్రేళ్లఁ జేపట్టినర్తించుఁ బాముఁ
గఱపించికొందు వేగమ కుదిరించెద నీశ్వరవేరుగలదది చవుక చేహురఁ
గాకిపొఁడును బెట్టఁ గంటిని సంజీవి పుల్లచూరునఁ దోప నిల్లుగాల
జేటిలోవేయ నెహురీఁదు నిట్లుబొల్లి, కాసునకు గుల్లకుసు నమ్మ మోసగాండ్రఁ
బట్టి ప్రశ్నించిశిక్షింప కట్టెవిడిచి, పెట్టి పేపెత్తఁజేసెడు పెద్దలయది. ౯౯

సీ. నూఱవ వెట్టి వేయాఱు ప్రకటనపత్రికలలో నూరెల్లఁదిరిగి కమ్మ
నూనె మంబాపునూనె కుంతలశోభి తెల్లవెండ్రుకలెల్ల నల్లపడు న
కాలపునరనిల్పు రాలెడు వెండ్రుకలనునిల్పు బట్టతలలను మొలచు
మొసఁదును బలపష్పు మేధాభివృద్ధియాఁ గన్నులం జలు వెక్క ఘ్రాణతర్ప
ణంబటంచును బల్కు జనంబుఁబట్టి, యెవ్వరికి గుణమిచ్చెరా యెచటఁజూఁవు
డబ్బులాగెడు యంత్రమా జబ్బుచేయుఁ, గన్నులకునంచుఁ దిట్టని ఘనునికెత్తు. ౧౦౦

ఇది ప్రథమశతకము.

---

## ద్వితీయశతకము.

గీ. నూటయొక్కటియగు వెట్టి నోరనురుఁగఁ, గ్రమ్మఁబడియున్న శవముపైఁ గన్నుబఱపి
వేఁపకొమ్మను వేమఱు విసరుసపరి, శుద్ధవాగ్గవ్వరుని బట్టిచుట్టుకొనును. ౧౦౧

గీ. నూటరెండవ వెట్టి జనులనుబట్టు, వస్తువులు పోవనొక కుఱ్ఱవానిఁదెచ్చి
యంజనమువేసి వానిచే నయినవారి, దొంగలఁగఁ జెప్ప నుంకించుటం గడంగి. ౧౦౨

గీ. నూటమూఁడవవెట్టి చెందును బ్రజలను, వైద్యుఁడుగుదుర్పఁ జాలని వ్యాధి రక్ష
ప్రోగుసట్టిన రక్షలో బొట్టువెట్ట, మంత్రపున్నీరు ద్రావింప మానుననిన. ౧౦౩

గీ. నూటనాల్గవవెట్టి యంధుండు కలిక, మొసఁగుచోటను నరుదెవుల్మసరి యొక్క
సారిదినువెజ్జు జీర్ణరసాయనమ్ము, లొసఁగుచోటను దాంపవ మొప్పఁజేయు. ౧౦౪

గీ. నూటనైదవవెట్టి ఘూనుసుజనులకు, మన్ను రూపాయలొనరింప మావిమొక్కఁ
బాఁతికాపింప నదిమంత్రబలమటంచు, గారడీని స్తుతించెను కారణమున. ౧౦౫

గీ. నూటయాఱవవెట్టి జనులనుబట్టు, సృష్టియప్పటినుండియు స్పష్టముగను
జూచుచును గారడియొనర్చుచోట డోలు, గొట్టనులుకుచుఁ బడినవ్వుకొనెడునపుడు.

గీ. నూటయేడవవెట్టి చెందును మనుష్య, కోటి నొకయాట చూడంగఁగూడి యేమి
యీ మకయసొపుకారి మన్న [illegible] ౧౦౭

గీ. నూటయేడ్మిదియవవెట్టి తేటపడును, బొగ్గుదండాలఁ దిరుపతి పోవ మ్రొక్కు-
కొంటినని వచ్చి యొకరేణిగుంటవాఁడు, సీతపురివీథులను దొర్లువేళ నమ్మ. ౧౦౭

గీ. నూటతొమ్మిదియవవెట్టి నూలుపట్టు, నరులలోపల నేడుగొండలపు బాబు
భిక్షమెత్తుచురమ్మని శిక్షచేసె, ననుచుఁ దిరిసెడు జను నమ్మునట్టివేళ. ౧౦౮

సీ. నూటపదవవెట్టి వాటమౌ నోటితాళములతోఁ బసుపువస్త్రములతోడ
గొడుగులతో స్వామిముడుపులతోఁ గుటుంబములతో నూరూరువచ్చి గరుడ
వాహనంబునకని ప్రాఁతయిత్తడి సిబ్బె గరిటకాఁడిమయుఁ జిల్లికంచములను
దండుచుండఁగ నమ్మి తమపేరు వారిపుస్తకములో నెక్కుట ధర్మమనుచు
నట్టుకలమీఁదికెక్కి యందందువెదకి, తెలివితేఁటలలోఁగూడఁ దిరిపెగాండ్ర
కిన్నివస్తువు లర్పించు నట్టిమూహ, చాలిమనుష్యుల హృదయపద్మములను. ౧౧౦

సీ. నూటపదునొకండను రొక్కవెట్టిని మేమైదుగురము నైజాముసీను
లోసేద్యమొనరించి, వాసిగాంచితిమి కృష్ణానది వెల్లువ సదమదంబు
చేసెఁ బంటలసొమ్ము చెల్లింపఁజాలని కతమునఁ దురకలు కట్టి కొట్టి
మాతల్లిసంద్రుల మర్యాదపోకార్చి బందెలో వైచిరి వారిని విడి
పించుకొనఁగోరి వెదలి మీపేరువినుచు, వచ్చినామిందుఁ గులవృత్తి వదలలేక
నాఁగలిని సంకెలలఁ దాల్చినారమంచు, ముష్టియెత్తెడువారి నమ్ముసమయమున. ౧౧౧

సీ. నూటపండ్రెండుగ నుతియింపఁబడు వెట్టి మూఁగవాఁడని చిన్నపుడె జనకులు
మరణించి రని వానిమహనీయగోగృహధనధాన్యములు పరుల్గొనిరనియును
నాలుక ముద్దయైనది వైద్యులెందఱో యత్నించి విఫలప్రయత్నులైరి
యని పెండ్లిగానిచిన్నది చెల్లెలున్నది కట్టుపస్పును బెండ్లి గాకయున్న
నను చు ఘనుఁడెవ్వఁడో జాలిగొనియొసంగి, నట్టు కాగితమూహూరుఁ జుట్టిచూపి
యందఱను వేఁడికొనుచు ధనార్జనంబు, చేయుదాంభికుదయఁజూడఁ బోయిరేని. ౧౧౨

గీ. నూటపదుమూఁడవదియాచును దగువెట్టి, యొంటిఁగడు మన్నెములకేగియున్నయపుడు
పాండవులపేరఁ బరఁగెడుకొండరాజు, లొప్పమిరయొనర్ప మతిచెడియున్నయెడల.

సీ. నూటిపైపదునాల్గునుగ నెన్నఁదగు వెట్టి నెలుకలదానికి నెలుఁగఁజేసి
బిడ్డలకైముందు వేఁడినఁ గుంచెఁడు బియ్యమ్ము దెమ్ము నే నయ్యగారి
కారగింపఁగఁ బెట్ట నందు మంత్రించెద నని బియ్యపుంజేఁటయందుఁ బెద్ద
యెమ్ముకఁబెట్టి యట్టిటుఁ ద్రిప్పికొనిపొమ్ము నా నిసీ యెముకుంచినవి వలువదు
తీసికొని పొమ్ము మాయత్త తెలిసెనేని, తిట్టునన నేను దినరాదు బుట్టపెరుఁగుఁ
బుంజుతే దని చెప్పఁ దమలించి జాలినని పరచు వసతిఁబట్టు. ౧౧౪

గీ. నూటపదునేను గాఁగ నెన్నఁదురు వెట్టి, నాఁడువారలవలె వేష మాభరణము
లాఁడుచేష్టలు స్వరమును నాట పాట, లమర రెంటికిఁ జెడుమను ష్యాధములది. ౧౧౫
క. నూటపదాఱవవెట్టిగఁ, బాటింపన్వచ్చు నొక్కఁడు వాఁ డేసరకో
నాటుకొని యమ్మ నిల్చిన, చోటన తా నదియ యమ్మఁ జూపిన నరునిన్. ౧౧౬
క. నూటపదేడవవెట్టిగఁ, జాటింపందగును ధనికుసాటికిఁ దాను
న్నీటగు వేషము దాలుప, మీటుగ స్థలభాండశుద్ధి మిడిసి పడునరున్. ౧౧౭
గీ. నూటపదునెన్మిదవ వెట్టి పాటసభలు, నాటకమ్ములు నచ్చుయంత్రములు మళిగ
లొకరి వెనుపోటుగాఁ బెట్టి యోర్వలేక, నష్టమునుబొంది చెడుగర్విఁ గష్టపెట్టు. ౧౧౮
గీ. నూటపందొమ్మిదవవెట్టి నుఱుము సేయు, మానవులను మఱూరిలో మాంసగతము
నస్థిగత మగుపోఁతచే నలఁతవెట్టి, గంగవెట్టి యటందు రొకానొకతతి. ౧౧౯
గీ. నూటయిరువదియగు వెట్టి సుతుఁడగును, ముసలి రైనకొలందిని గసరుపుట్టి
యింట నుంపక కొడుకులయిచ్చ మెలఁగ, కదిరియుసంగ రదీయరం చఱచునతఁడు.
గీ. నూటయిరువదియొకటి యంచును వచింత్రు, వెట్టి నద్ధానఁ దనవైన వేషభాష
లకు విరుద్ధుని జనకుని లాఁతివార, లడుగ సేవకుఁడని పుత్త్రుఁ డనినయెడల. ౧౨౧
గీ. నూటయిరువదిరెండనునుడికి వచ్చు, వెట్టి తలిదండ్రులకుఁ దిండిపెట్ట కడిచి
బిచ్చ మెత్తంగఁ జేయుచు వ్రీడ లేక, పెద్ద నని సంచరించు పాపి దగు చేష్ట. ౧౨౨
గీ. నూటయిరువదిమూఁ డటందు రొకవెట్టి, నింట నిల్లాలిచేతఁ జేయించి భత్య
ములను గొనిపోయి కులటలముందు వెట్టు, సిగ్గుమాలిన దుర్ధనిచేష్ట లరసి. ౧౨౩
గీ. నూటయిరువదినాలుగై సుతికిఁ బాత్ర, మగు నొకానొకవెట్టి నన్యధనహరణ
మొనరిచిసుదూరమేగియందుసుఖుదొరఁగి, నట్టులూరు చేత వ్రాయించునధము బ్రదుకు
గీ. నూటయిరువదియైదగును మఱియొక్క, చిత్రమగువెట్టి యప్పులుచేసి తీర్ప
నిష్టపడక మృతుండయ్యె నీతఁ డదిగో, వల్లకా డనఁ బరుల నేర్పఱిచె నేని. ౧౨౫
గీ. నూటయిరువదియాఱు వినోదకరపు, వెట్టి యవివాహితుఁడు రేపు పెండ్లమునకుఁ
దద్దినము మించి వచ్చితి దవ్వు గ్రామ, మనుచు యాచింప నిజ మనికొనునరులది.
గీ. నూటయిరువదియేడగును బహురమ్య, మైన వెట్టి యొకానొక యతివ యొక్క
యతఁడు దంపతుల మటంచు నడుగవత్తు, రర్థిమై వారి నెఱుఁగని యతని దరయ.
గీ. నూటయిర్వదియెన్మిదౌను గడు వెట్టి, బీదలము పెండ్లి యని యొక్క పిల్లఁ బెండ్లి
కూఁతు నొనరించి తెచ్చిన గుఱుతుపట్ట, నేర కది నమ్మి ధన మిచ్చువారిఁ బట్టు.
గీ. నూటయిరువదితొమ్మిదై నొడువఁబడును, వెట్టి పలువురు పుట్టిరి పెరిఁగి చచ్చి
రచ్చిరా దాత్తదన మొర లిచ్చు దాన, ముక్కుఁ గుట్టింతు బిడ్డ కనులుచ నమ్మ. ౧౨౯

గీ. నూటముప్పదియవవెఱ్ఱి సతికి నెక్క, నొక్కవస్త్రంబు నద్దెకు నొకనియొద్దఁ
బుచ్చుకొని దీని భార్యకై పుచ్చుకొంటి, ధనము లోటయ్యె నన నమ్మ జాతపట్ల.

గీ. నూటముప్పదియొకటని పాటికెక్క, వెఱ్ఱి మసిబొగ్గుఁబోలిన పెండ్లికొడుకు
రత్నపుత్త్రికయా వధూరత్నమందు, నాసపడి యత్నమొనరించు నక్కతమున. ౧౩౧

గీ. నూటముప్పదిపైని రెండుగ గణింత్రు, వెఱ్ఱిఁ దమలోపములఁ గట్టిపెట్టి యొరుల
లోపముల నెంచువారి నీలోకమందు, నెఱుఁగ కజ్ఞులు గావింతు రిట్టితలఁపు. ౧౩౨

గీ. నూటముప్పదిమూఁడగు మేటివెఱ్ఱి, నరులఁ బట్టినఁ దను కట్టినాతి దొరక
దని విచారింతురు కుహాపు లతివమాత్ర, మాసచేయదొ సుకుమారునందు మదిని.

గీ. నూటముప్పదినాలుగందు రొకవెఱ్ఱి, ధనము చూపించి మోసపుచ్చినను రూప
మగపడిచి వంచనమ్మున నగడుసేసి, నను భువిని లోఁగి చెడినట్టిజనుల దెంచి. ౧౩౪

గీ. నూటముప్పదిరైదని నుడువఁబడిన, వెఱ్ఱి యొక్కటిగల దందు వెలలు గుడువ
ధనము నింధనములఁబోయ మనసుచెడఁగఁ, బ్రాణములువీడఁదనుదానయత్నపడును.

గీ. నూటముప్పదియాఱని నుడువువెఱ్ఱి, చేటు గల దని యొరులకుఁ జెప్పుచుండి
తాను గనుమూసికొని పాలుద్రావుపిల్లి, పోలికినిఁ ద్రాగియన చేయుపురుషుఁబట్టు.

గీ. నూటముప్పదియేడు గణుతికెక్క, వెఱ్ఱి కాఁకరకాయనా వెక్కిరించి
తాను గీఁకరకాయనా ధరణియందు, నరయు రసికులు గాంతు రీ యద్భుతంబు.

గీ. నూటముప్పదియెనిమిది గాటమైన, వెఱ్ఱి వచియింపఁదగు దేహవికృతి మాటు
పఱచుకొని తానుసుకృతినాఁబరఁగజతన, మొనరిచెడువాడుపడుకష్టమునుగనుఁగొని.

గీ. నూటముప్పదితొమ్మిదందు రొకవెఱ్ఱి, ముసలితనమునఁ బరిణయమునకు నెంచి
పితృపితామహవర్గ మీ విధముగానె, చేసి రని తనదేహపుష్టిని వచింప. ౧౩౯

గీ. నూటనలువదియవవెఱ్ఱిఁ బాటిసేయు, దుర వరుఁడు దాను సూర్యచంద్రులనునింటఁ
గట్టివైచెను నావెనుకటియతండె, యింతగలవాఁ డనఁగ బిడ్డ నిచ్చిరేని. ౧౪౦

గీ. నూటనలువదియొకటి కుంటులును గ్రుడ్డి, వారునగు కన్యకలను సువస్త్రగుప్తిఁ
బెండ్లిచేయించి వరుఁడేవ్వఁ వేయిగొనుము, మంచిపిల్లను బెండ్లాడుమ యనువెఱ్ఱి.

గీ. నూటనలువది యవల రెండుగను వెఱ్ఱి, నెంత్రు తొలుత నె లోపము లిట్టి వనుచుఁ
బెండ్లి కాకున్న గంగలో వేయవలయు, ననుచు బతిమాలి వరుఁ దెచ్చిరైనయెడల.

గీ. నూటనలువదిమూఁ డటందు రొకవెఱ్ఱి, గ్రుడ్డితిమ్మన్నభట్టుపుత్త్రునకుఁ గూఁతు
నిత్తురే యని వంచించి యేసమాన, మనుచు వాదించుకొనువారి యాగడంబు. ౧౪౩

గీ. నూటనలువదినాలు గంచు నగువెఱ్ఱి, చక్కనౌకన్యపెండ్లిలోఁ జవటకాళ్ల
పిల్ల నొకదారిఁబోయెడు భిక్షుచేతఁ, బుపెట్టింప నగు ... దువ. ౧౪౪

గీ. నూటనలువది యైదంచును దగువెట్టి, పుడుకకో తడకకో వాచుపుట్ట నతివ
విడిచి దేశాంతరముపోవు విభునికతన, నిత్యసౌభాగ్యవతి యను పేరు తేఁ బట్టి. ౧౪౫

గీ. నూటనలువదియాఱటంచు రొకవెట్టి, నప్పుసప్పులు చేసి నీ టనుభవించి
యీఁగఁజాలక కాశిరామేశ్వరములు, తేచిపోయెదు దుర్బుద్ధు లేమచోట.  ౧౪౬

గీ. నూటనలువదియేడునా నుతికిఁబాత్ర, మయినవెట్టిని వినుఁడు తా నన్యజనుల
భూము లన్నియుఁ దమవనిపులిమిపుచ్చి, యప్పుగొని తెచ్చియొగఁ బెట్టు నధముఁడున్న.

గీ. నూటనలువదియెన్మిద న్నూటివెట్టి, యొరులసొమ్ములు గొని తన కున్నదెల్ల
భార్యపేరను వ్రాయించి పాండిచేరిఁ, జేరి మూఁడేండ్లపిదప వచ్చిన యతనిది. ౧౪౮

గీ. నూటనలువదితొమ్మిదౌ కాటువెట్టి, యప్పుదీర్పక సన్న్యాసమంది యాలు
బిడ్డలను వెంటఁగొని భిక్షవేళ నిచ్చు, దక్షిణల వారిఁబెంచెడుధన్యుఁ డెందు. ౧౪౯

గీ. నూటయేఁబదియవవెట్టి నుడువఁదగదె, చిల్లరప్పులకై యాస్తి చెల్లిపోవ
నప్పుబాధలు పడలేక యపుడు కన్నుఁ, దెఱచి విషభక్షణంబునఁ దెగినయెడల.౧౫౦

గీ. నూటయేఁబదియొక్కటౌను గన వెట్టి, యున్నయప్పుడు కనుగాన కూడినంత
నెక్కడే నొక్కయుద్యోగ మిండటంచు, నెల్లవారలఁగని యాశ్రయించునపుడు.

గీ. నూటయేఁబదిరెండగును ధరనొక్క, వెట్టి కలిగియుఁ దినక వ్రేల్వెట్టిరొట్టె
నేతిగిన్నెకుఁ జూపుచు నీరసిల్లు, లోభివారలసొమ్మరులు గొనిపోవ. ౧౫౨

గీ. నూటయేఁబదిమూఁడుగ నుడువరాదొ, వెట్టి నిల వర్తకములోన వేలకొలఁదిఁ
జేర్చి భార్యకు నగలుగాఁ దీర్చి సభల, రిక్తుఁడ నటంచుఁ బలుమాఱు వ్యక్తపఱుప.

గీ. నూటయేఁబదినాలు గందు రొకవెట్టి, నెన్నిసారులో సభకెక్కి యెఱుకపఱిచె
రిక్తుఁడ నటంచు వాని కాస్తి బిడ్డ, నీయఁగానెన్న నందు గ్రహించుకొనుఁడు.

గీ. నూటయేఁబది వెనుక నేనుగ గణింత్రు, వెట్టి నొకరిని గాదని జుట్టుకొనఁగ
రాశి దిరుగఁగ నంగవస్త్రంబుఁ జుట్టి, యెత్తలే కీడిగిలఁబడు హీనుఁగాంచి. ౧౫౫

గీ. నూటయేఁబదియాఱంచును వచియింత్రు, గిటుకులును మర్మములు నెఱిఁగియు ధనంబు
కొలఁదికిని మీఱియుండియుఁ గుదురుపాటు, లేక వాణిజ్యమునఁబెట్టి లేమిపడిన.

గీ. నూటయేఁబదియేడగును మఱియొక్క, వెట్టి దలవెండ్రుకను ముడివెట్టి కొండ
నాఁచికొనఁ జూడఁ బెద్దకుండల కెసళ్లు, వెట్ట నెంచిన సాగక వెలలుగుడున. ౧౫౭

గీ. నూటయేఁబదియెన్మిదౌను వినుఁడొక్క, వెట్టి యత్యాశచేత నీవిశ్వమెల్ల
నొల్లుకొని బుగ్గనిడఁజూచి డిల్లపోయి, చదికిలంబడి చెడునసజ్జనుని తెలివి. ౧౫౮

గీ. నూటయేఁబదితొమ్మి దను సఖ యిట్టి, వెట్టిని దనది కూడును బెఱలదైనఁ

గుంభమనియును దలఁచి వాగ్దుంభనమ్ము, నెఱపి వెఱపించఁబోయి తా వెఱచెనేని.

గీ. నూటయిరువదియవవెట్టి నూలుప్రోగు, నకును గట్టువడంజూచు నరునిఁగొంటె
యుక్తులను గస్టపెట్టు ననూర్జితాత్మ, నాస్యరంగంబునను లాస్యమాడుచుండు. ౧౭౦

గీ. నూటయిరువది యొండుగాను సతియింత్రు; పెండ్లివెట్టిని దీనిలో భేదములును
వివిధరీతులు వివరింతు నవహితమతి, నాలకింపుఁడు రసికాగ్రయాయులార.

గీ. నూటయిరువదపైని రెండుగ మదింతు, రవని నొకవెట్టి నెవ్వఁడే నధికుతోడ
వియ్యమమరించుకొనఁగ నుర్విఁ దలక్రిందు, చేసి రొక్కంబు వెచ్చించుచేతఁ గనిన.

గీ. నూటయిరువదిమూఁడుగాఁ దేటపఱుచు, వెట్టి ధనధాన్యముల విఱ్ఱవీఁగుకతన
నధికకులుతోడ సంబంధ మభిలషించు, హీనకులు నెత్తికోలు మహీతలమున. ౧౭౩

గీ. నూటయిరువదినాలుగునుగ నెఱుంగుఁ, డొక్క వెట్టిని హీనుఁ డుద్యోగవశత
విశ్రుతుండయి తనబిడ్డ బీదవడిన, స్వకులునకు నీయ నలజడిపడున యేని. ౧౭౪

గీ. నూటయిరువదియైదగును దిలకింప, వెట్టి పైదాని భేదంబు విత్తవృద్ధి
విద్యనేర్చినకూఁతు నీవెఱచి బీద, యక్కకొడుకున కుంచుఁ గన్యాత్వమున నె. ౧౭౫

గీ. నూటయిరువదియాఱగును దిలకింపుఁ, డొక్కవెట్టిని బీద కీనోపఁ డింతిఁ
గొడుకునకు ధనమిచ్చెదఁ గోరినంత, యధికకులులార బిడ్డనిం డనుచునుండు. ౧౭౬

గీ. నూటయిరువదియేడగును విదితముగ, వెట్టి స్వకులజులతోడను బెండ్లిసేయ
నెంచ విద్యాధికత నొప్ప కింతిగోరు, నన్యకులు వేషభాషల నరసి యొకట. ౧౭౭

గీ. నూటయిరువదియెనిమి దందు రిటువంటి, వెట్టి బీదను దెచ్చి తా విద్యనేర్పి
బిడ్డ నీఁజూచుమగనికి నడ్డువచ్చి, యతివ తనకట్టియల్లుఁ డనర్హుఁడనిన. ౧౭౮

గీ. నూటయిరువదితొమ్మి దౌను సుతకిపు, పెండ్లియేటికి విద్యనేర్పింత మనుచు
బాల్యమునఁ బెండ్లిచేసిన భంగమనుచు. నిల్పియుంతురు విధి నాఁపనేర్తు రెవరు.

గీ. నూటడెబ్బదియవవెట్టి బోటి విధవ, కాకయుండునటంచుఁ జక్కంగ నెదుగు
వఱకు నిలుపుదు రేని నాపైని గాదొ, బ్రహ్మగీఁతను దప్పింపవలఁతు లెవరు. ౧౮౦

గీ. నూటడెబ్బదియొకఁ డనందొఁచి పట్టు, బాలికల నమ్మఁజూపిన వర్తకులను
బిడ్డలను సొమ్మునకుఁ గొను బేరగాండ్ర, మాఱుబేరము చేయుసమర్థులనిల. ౧౮౧

గీ. నూటడెబ్బదిరెండవ పోటువెట్టి, వత్సరమునకు నూఱుకూపాయ లనుచు
నరువు లేదంచు భార్యకం దర్ధమిచ్చి, తాను సగపాలుగొనునట్టి మానవునిది. ౧౮౨

గీ. నూటడెబ్బదిమూఁడగును దనభార్య, గర్భవతియైన బాలికఁ గనుమటంచు
నాదుభాగ్యంపుముల్లె యీనీదుగర్భ, మనుచు గర్భము ముద్దాడు నతనివెట్టి. ౧౮౩

గీ. నూటడెబ్బదినాల్గగును బెఱవెట్టి, వరుఁడు చదివెడునన్నాళ్లు వలసినంత
ధనమునిం [illegible] నేమి, యనుచు వ్రేలెత్తుబెల్లము నడుగుచోట. ౧౮౪

గీ. నూటడెబ్బదియైదు నెన్నుదురు వెట్టి, నర్థవంతులు శుల్కంబు నడుగ కాత్మ
జులకుఁ బెండిలిసేయఁగాఁ జులుకఁదనము, తనకుఁ దాఁజేసికొనియెనం చనిహసింప.

గీ. నూటడెబ్బదియాఱగును విశదంబు, వెట్టి నాబిడ్డనిచ్చెదఁ గుఱ్ఱవాని
సీమకుంబంపి చదివింప సిద్ధపడుదె, యనుచు ననుముట్టుకొనకు మన్నతనియుక్తి. ౧౭౬

గీ. నూటడెబ్బదియేడగును గన వెట్టి, శుల్కమునుఁగొన్న నమ్మెడుచొప్పుగాఁగ
నొరులనగి; యర్థవంతుఁడ నొక్కకొడుక, టనుచుఁ గట్నంబులడుగుటయందులోన

గీ. నూటడెబ్బదియెన్మిదై నూలుకొనును, దమ్ము లన్నలు లేకుండ ధనము గలిగి
చదువుచున్నట్టివరుఁడు తా నొదవెనేని, కూఁతురు సుఖించు ననువారికోర్కి వెట్టి.

గీ. నూటడెబ్బదితొమ్మిదై నూల్కొనునది, వెట్టి ధనవంతుఁ డడుగుచు విత్తహీనుఁ
డడుగ, నవ్వుల, తనకేల యర్థ మొరుల, కేలవలదొ విచారింపుఁ డోలిదీని. ౧౭౯

గీ. నూటయెనుబదియవవెట్టి నుసలనీయ, దత్త లేకుండవలయును నాఁడుఁబడుచ
లుండఁగూడదు చదువొండె నొండెయర్థ, మున్నవరుఁ దెమ్మనెడు తల్లియూహయేచి.

గీ. నూటయెనుబదియొక్కటై నొడువఁదగిన, వెట్టియిది పెండ్లియైనంతఁ బెండ్లికొడుకుఁ
జదువుమిష నిల్లటము దెచ్చి జనకులంను, భేదభావంబుఁ బుట్టించుపెద్దలందు. ౧౮౧

గీ. నూటయెనుబది పిదప రెండుగ నెఱుంగుఁ, డాత్మజకు భూషణమ్ములు నమ్మకైదు
నాళ్లలాంఛనములు రెండునడలబండ్ల, యద్దె ఖండించుకొనువారి యగడువెట్టి. ౧౮౨

గీ. నూటయెనుబదిమూఁడగును మహినొక్క, వెట్టి మేళము పల్లకి వీణపాట
హరికథలు గాక పెండ్లివా రందఱకును, వెండిపువ్వులపీఁటలం దెం డటన్న. ౧౮౩

గీ. నూటయెనుబదినాల్గగును మఱియొండు, వెట్టి యల్లుఁడు ఫలహారవేళ రాఁడు
పంపెదరె బావగారు నా బాగుగాదు, నేను బంపుట రం డెవరేని యనిన. ౧౮౪

గీ. నూటయెనుబదియైదగును గనుఁ డొక్క, వెట్టి విడిదెకు రా రొకవేళనైనఁ
జాకలియు మంగలియు నిన్నుఁ జూఁపనేన, వైచికొంటి నటం చాడువానియందు.

గీ. నూటయెనుబదియాఱగును దెలియుండు, వెట్టినొకదాని విడిదెలో వేఁడినీళ్లు
లేవు చాకలి బట్టలరేవు లేదు, కట్నములవేళఁ జూడుఁ డింక ననునప్డు. ౧౮౬

గీ. నూటయెనుబదియేడగును బరికింప, వెట్టి వేఱొండు చాకలీ విసరవేర
మంగలీ కాళ్లుపిసుకు మం చంగలార్చు, తిండిపోతులమేళంబు తెండుచోట. ౧౮౭

గీ. నూటయెనుబదియెన్మిదౌను వివరింప, వెట్టి బోగముచానపై వెట్టిచూపు
పఱపి పరుఁ డని యదియెంచి వందనంబు, చేయమిని గిన్కఁబోయెడు చెడుగునందు.

గీ. నూటయెనుబదితొమ్మిది నుతికినెక్కు, వెట్టి యల్లుఁడు మేళము విడిచి యిపుడె
వెళ్లె మడిగట్టుకొన వానిఁ బిలువ రంచు, వరునిజనకుండు కసరు నవసరమునను.

సీ. నూటతొంబదియయ్యెను వినుం డొకానొక వెఱ్ఱిని భుజియింపఁ బిలువవచ్చి
వంటలైనవి లెండు పొరుగింటలు వచ్చి రనిచెప్ప మీరేగుఁ డందఱ నిదె
కొనివత్తు నని పెండ్లికొడుకు తండ్రియన నీ కేల యాఘని వారి నేల పిలువ
నీరు మర్యాదపోయెను రేపు కాకిచే వార్తపంపర మెత్తవడఁగరాదు
పెండ్లిబిగువులు నడకలుఁ బ్రిదులరాదు, చెంబులును బట్టుసంచెలు జేతఁబట్టు
కొనియెపోదుము బ్రాహ్మణు ననుపలేదు, చూచితిరె యని జామాత శోకపడఁప,

మత్త. నూటతొంబదియొక్క టయ్యెను నూతనంబగు వెఱ్ఱియే
చోటలే దిటు లక్కపానుపు చోద్య ముంగర మీయరా
మాటలాడక లేచివచ్చును మంచిపెండ్లికుమారుఁడే
సాటివచ్చెను మామ కల్లుఁడు చాలునంచని పల్కినన్. ౧౯౧

మత్త. నూటతొంబది రెండు గాఁగ జనుల్వచింతురు వెఱ్ఱి నీ
వీటఁగాని మఱొక్కచో నిదివింత పానుపుమీఁది దే
పాటిదేనియు నాఁడుబిడ్డకు వచ్చుదుప్పటి చాకిదా
మూటఁగట్టెను పెండ్లిలాంఛనముల్ త్యజింతు రె యంచనన్. ౧౯౨

మత్త. నూటతొంబదిమూఁడుగాఁగ మనుష్యు లెంచెడువెఱ్ఱి చెం
డ్లాట జూదము లాడ రేకద యత్తపై మఱఁదండ్రపైఁ
బాటపాడరు పెండ్లికూఁతురు పాట లెంతవినోదమే
వాటమే భుజియించి మిన్నక పండుకొందురొ యందు రేన్. ౧౯౩

మత్త. నూటతొంబదినాలుగౌను వినుండు వెఱ్ఱి నిదేమిటో
పాటపాడినఁ దిట్టు వెంకను భర్త స్త్రీలకుఁ బెండ్లిలో
నాటవిడ్పు విలాసమౌను గురమ్మ పాటలపుస్తకం
చేటికే నరసమ్మ పాడవె యేమి సిగ్గని పల్కుచోన్. ౧౯౪

మత్త. నూటతొంబదియైదు గాఁగ మను న్వినోదపువెఱ్ఱి యి
ప్పాట నెప్పుడు నాఁడువారల ప్రక్కప్రక్కల నుందురే
పాటిగా మగవారు బోగమువాండ్రమేళము చూడరా
దోటు జంకక చెప్పవే మఱియొక్కపాటని పల్కుచోన్. ౧౯౫

మత్త. నూటతొంబది యాఱటంద్రు వినుండు వెఱ్ఱిని చెల్లరే
మాటలాడకుఁ డమ్మ చెప్పును మామ్మ చెప్పవె బావతో
పాటువచ్చితినం చదేమిటి బావపే రెవరంచు స
య్యాటలాడుచుఁ బెల్లిపదగ్గఱ నమ్మలక్కలు నిల్చుటన్. ౧౯౬

మత్త. నూటతొంబదియేడుగాఁగఁ గొనుం జగం బొకపెళ్లి సం
డాట గందవొడుల్ వసంతము లాడి కేరుచు నంతలో
నాటుకొన్న నిచారముల్ నయనంబులం దడిపెట్టుచుం
బాటపాడుచు నప్పగించెడు వారిమోముల దైన్యముల్. ౧౯౭

మత్త. నూటతొంబదియెన్మిదైనది నూత్నమౌ నొకపెళ్లి యా
ర్భాటమై యిరువంక వేడ్కలు వైభవంబులు చెల్లియుం
బాటకుల్ రజకుండు మంగలి బానిసల్ దనయింటిలో
దీటుకోఁ బనిచేయుసంగతిఁ దెల్పినం జెవికెక్కదేల్. ౧౯౮

మత్త. నూటతొంబదితొమ్మిదైతగు నూత్నబంధుజనంబు లీ
పాటలాధరభర్త యెవ్వఁడు వానిమానిని యెవ్వరో
పేటయౌ నిపుడంచుఁ బ్రక్కలఁ దీర్చి చూచిన దంపతీ
వీటికాగ్రహణంబువేళను పెట్టి యిద్ధముగా మహిన్. ౧౯౯

సీ. ఇన్నూఱవదిపెళ్లి యిబ్బంగిఁ బెండిలి పరఁగిన పెక్క సంబంధు లొకటఁ
జేరి బావా యొద్దుఁ జేరితి మీరైదు నాళ్లు నేఁ దలవంచినాఁడ నిపుడె
యెత్తితినఁ జూడు మింతచేసితి దొంగవేలెముగిన్నెకు పెండిపూఁత
మనకును మన కరమరకలే దాఁడువారలపెట్టెఁ దీర్పఁ దరంబుగాదు
మీపురోహితునకు మేమిచ్చితిమి మాడ, దానిరెట్టి మీరు తప్పకుండ
మాపురోహితునకు మఱవకయిండు నా, కబలినిష్ఠురంబు గాదటన్న. ౨౦౦

ఇది ద్వితీయశతకము.

---

## తృతీయశతకము.

సీ. ఇన్నూటయొక్కటి యెసఁగును పెళ్లి మంచిపనిఁ జేసితి విప్డు చెల్లలేను
కట్నంబు లనుమాటఁ గట్టిపెట్టితివి కాలముగాదు బంధుజాలంబురాదు
చేత లే దని యిది శ్రేష్ఠమైనదియు నిర్బాధకమైనది ప్రశస్తమన్న
మిడిలివి హాయిగా నేగెద రండ అంచనఁ గొన్నికట్నము లందునంచు
రావలయు నింక నాయింట రాదుకార్య, మెట్లువచ్చును బ్రాఁతవారీయవచ్చుఁ
గాదె రాత్రైరి నేఁ గష్టకాలమంచు, వానలోఁ బోయి చదివించివచ్చితి నన. ౨౦౧

క. ఇన్నూటరెండుగాఁ జను, వెన్నందగుపెళ్లి కోడ లింటికిరాఁ గాఁ
జన్నవినోదము లెల్లను, సమ్ముఖమున లత్తలందు సాజములగుటల్. ౨౦౨

క. ఇన్నూటమూఁడుగాఁదగుఁ, గన్నియఁ గొడుకునకుఁ దెచ్చి కాముకుఁడై తాఁ
గొన్నటులు మామనాడుట, యెన్నఁడొ చెప్పఁదగుమాట యిపుడనుచుంటిక్.

క. ఇన్నూటనాలుఁగవ వె, ట్టిన్నమ్మఁగవచ్చుఁ గొంచటికి ననుభవమం
దున్నకతంబునఁ జూపిన, కన్నియ మఱపించి యొండుకన్నియ నిడుటల్. ౨౦౪

క. ఇన్నూఱైదవవెట్టి చ, నున్నూతనవధువు గొత్తనులియించుట యుం
గొన్నాళ్లుచనిన మిషలం, బన్నుచు నిందించుటయును బ్రకటంబగుచున్. ౨౦౫

క. ఇన్నూటాఱవవెట్టియు, సన్నుతమగుఁ గోడలు తొలిసారెను దేఁజూ
డన్నెలవుకొనినసంతస, మెన్నుచు నింటింటికత్త యేగి వచింపన్. ౨౦౬

క. ఇన్నూటేడవవెట్టి య, నన్నెగడును సారెలోఁదనకు మొల్లముగా
సన్ననిచీరలు నగలు, న్నన్నవ్వుచు నత్తవధువునకుఁ జూపుదయన్. ౨౦౭

క. ఇన్నూటెనిమిదియవ వె, ట్టిన్నెలకొనియుండు స్నుషగుఱిచి నలువురతో
డన్నుడువు నత్తమాటల, నున్నగుణాగుణవిచార మూహింపంగన్. ౨౦౮

క. ఇన్నూటతొమ్మిదై తగుఁ, గన్నియ తనయాత్మజకు సగల్నాణెంబుల్
మిన్నగఁ దెచ్చినఁ బొగడుట, నున్నూన్యనతఁ దెగడుటను గనుం డత్తకృతిన్. ౨౦౯

క. ఇన్నూటపదవవెట్టిని, జిన్నది గొనివచ్చినట్టి చిల్లరసరకుల్
చిన్నవని ఛిల్లివని తన, కన్నెఱ చూపించు నత్తఁగనుఁగొనుఁ డార్యుల్. ౨౧౦

క. ఇన్నూటపదునొకండుగ, నెన్నందగువెట్టి కోడ లేమియుఁ బనిచే
యన్నేర దెట్లుపెంచెనొ, కన్నమ్మ యిదొక్కముద్దుగా యనునత్తన్. ౨౧౧

క. ఇన్నూటపదియు రెండగుఁ, జిన్నతనంబునను బనులుచెప్పక పనుపం
గన్నెకు నేర్పఁగ బడి నా, కున్నదొ యనునత్తగారి హుంకారములన్. ౨౧౨

క. ఇన్నూటపదునమూఁడగు, చన్నెఱయును వెట్టి తల్లి చూలాలైయు
న్నన్నేను బెండ్లికానపు, డన్నియుఁ జేసితి నటనుచు నత్తపలికినన్. ౨౧౩

క. ఇన్నూటపదియునాలుఁగ, నన్నెగడును వెట్టి నాల్గునాళ్లకుఁ గొఱువ
ట్టైనన్నకోడలు దెచ్చిన, సన్ననిచీర యని యత్త సణుగుట యిలలోన్. ౨౧౪

క. ఇన్నూఱుం బదియేనగు, మొన్నఁటినాబిడ్డ సర్వము న్నేర్చెను నే
నెన్నఁడు నేర్పను పనిపైఁ, గన్నంప దటంచు స్నుషను గసరెడు చోటన్. ౨౧౫

క. ఇన్నూటపదాఱగు నిది, యెన్నఁడు గదిలోననుండు నెన్నిపిలిచిన
న్వినట్టు లుండ దేమని, నన్నానోరి యని యత్త నసుకునయేనిన్. ౨౧౬

క. ఇన్నూటపదే డగు వె, ట్టి న్నేర్పరు లెప్పుడే నెటఁగికొందురు దాఁ
గన్నకొడుకుఁ గోడలు చెఱి, చెన్నామాట విన డని వచించెడుచోటన్. ౨౧౭

క. ఇన్నూఱుఁ బదియునెన్మిది, యన్నది తగు వెఱ్ఱి కోడలన్నను గుక్కం
గన్నాళ్లు నీరసంబుగఁ, గొన్నను దనకూఁతునకును గూర్చునయేనిన్. ౨౧౮

క. ఇన్నూఱుం బందొమ్మిది, మన్ననకగు వెఱ్ఱి కొడుకు మాటాడఁగనీ
కన్నముపెట్టక కోడలి, బన్నములకు నత్త పాలుపఱిచిన యేనిన్. ౨౧౯

క. ఇన్నూటయిరువదగు నొక, తిన్ననిపనికైనఁ దప్పుదిద్దుచు నేవో
కొన్నిట లోపము లెంచుచుఁ, గన్నెపయిం జూపు నత్తగర్వంబెల్లన్ ౨౨౦

క. ఇన్నూటిరువదియొకటగు, నన్నము దినవేల నీకు నైవండితి నే
నిన్నటిరాతిరి యని చలి, దిన్నిత్యముఁ గోడలికిని దిన నత్తయిడన్. ౨౨౧

క. ఇన్నూటిరువది రెండగు, నిన్నటి నీకంచ మోదు నేఁదొలిసారెం
గొన్నది చూడవె యిది నా, గిన్నెయనుచు నత్త కన్నెఁ గేలియొనర్పన్. ౨౨౨

క. ఇన్నూటిరువదిమూఁడగు, నిన్నను గొన్నట్టికుండ నేఁడవిసెను నీ
కెన్న సరివనిత గలదే, యెన్నఁడుఁ గనమనెడు నత్తహేళన మవనిన్. ౨౨౩

క. ఇన్నూటిరువదినాలుగ, గు న్నందనుతోడ నేర కూరిను గారం
బున్నదె తప్పెన్నవు నే, నన్నను నల్లేఱుబండి వను నత్త యెడన్. ౨౨౪

క. ఇన్నూటిరువదియైదగుఁ, జిన్నప్పుడు చూడ రామచిలుక ట్లుండెం
గన్నమ్మ సారమో నా, కన్నులసారమ్మొ స్నుషవికారము లనినన్. ౨౨౫

క. ఇన్నూటిరువదియాఱగుఁ, దిన్నది యేమగునో యేపుదేరదు పనులె
ల్లన్నెనె చేసికొందును, సన్నగిలుం గోడలని దిసంతులుగొట్టన్. ౨౨౬

క. ఇన్నూటిరువదియేడగు, మొన్నటియిరుగింటిసీతి ముప్పిరికడ్డీ
యన్నిషను ల్తాఁకేయుం, జిన్నది తనయత్తయంటచెయి గడుగుననన్. ౨౨౭

క. ఇన్నూటిరువదియెనిమిది, కన్నదరెడునంతయొాలిఁగైకొని యరిపే
దన్నిట్టత్రాడు నంపిరి, తన్నులగొడ్డమ్మ్యొ నదియు దైవము యనినన్. ౨౨౮

క. ఇన్నూటిరువదితొమ్మిది, కన్నను మది దనియకున్న కన్నియఁ గొడుకే
మన్ననఁ జూచునొ లోకుల, కునొన్నిగులుటగాక యనుచు గోడొనరింపన్. ౨౨౯

క. ఇన్నూటముప్పదగు నిది, చిన్నద చితుకద యెవేళఁ జిఱుతిండికినూ
నెన్నేతిఁ బాడుచేయును, దిన్నను రివట యని యత్త తిట్టునయేనిన్. ౨౩౦

క. ఇన్నూటముప్పదియు నొక, టన్నది దినదినము దాని నంగడికనుచుం
దిన్నదిచాలక యని పెరి, మెన్నరు లెల్లవిన నత్త మిడికిన చోటన్. ౨౩౧

క. ఇన్నూటముప్పదియు రెం, డున్నయవిదులెఱుఁగుదురు గడుం దిండికి వాఁ
చున్నది తినని పిసన్నై, [illegible] ౨౩౨

క. ఇన్నూటముప్పదియుమూఁ, డు న్నేర్వఁగవచ్చు నెఱుఁగఁడు కుమారుం డెం
తున్నదొ యెంతైఁదొ దీ, నిన్నమ్మును డెల్వ బెట్లని విచారింపక౯. ౨౩౩

క. ఇన్నూటముప్పదియునిూఁ, దన్నాలుగుగాదె వెఱ్ఱి తమ్మునిబిడ్డం
గొన్నను గోడలుఁశబ్దము, విన్నపు డత్తలకుఁ బుట్టు వికృతిం దెలియక౯. ౨౩౪

క. ఇన్నూటముప్పదేనగు, చన్నెగడును బుత్త్రుఁ డింటఁ జూచుచునుండక౯
పొన్నమ్మ తినవె యన్నము, తిన్నంత నొకింత సేదదేఱు మటన్న౯. ౨౩౫

క. ఇన్నూటముప్పదాఱగుఁ, బున్నమనాఁ డింటనున్న పుత్త్రునితో నా
పిన్నది పలుకఁగ నొల్లక, మ న్నని పేఁడ యని చెప్పి మఱపించినచో౯. ౨౩౬

క. ఇన్నూటముప్పదేడగు, నెన్నివిధంబులను నత్త యిడుబాధలకో
ర్వన్నేరక కోడలు మగ, నిన్నూల్కొల్పినను దల్లి నేరములెన్న౯. ౨౩౭

క. ఇన్నూటముప్పదెనిమిద, గున్నొగిలినకతన మాటకును మాట యన
న్నన్నగఁజుచేయుఁ గోడలు, మన్నన లేదనుచు నత్త మఱిఁగిననేని౯. ౨౩౮

క. ఇన్నూటముప్పదియు మిూఁ, దన్నవసంఖ్యయొకవెఱ్ఱి తల్లిని గొడుకే
మన్నను బెండ్లమువశమై, నన్నవమానించుఁ గొడుకునా వహియించు౯. ౨౩౯

క. ఇన్నూటనలువదయ్యెడు, నన్నమునకుఁ బిలువఁ గోడ లాఁకలిలేనం
చు న్నందనుపడుకింటఁ బ, రున్నదురుద్దేశ మత్తయుఁడు కెఱుఁగంగ౯. ౨౪౦

క. ఇన్నూటనలువదొక్కటి, విన్నమవగుఁ దొల్లితాను వివిధవిధముల౯
బన్నము లత్తవలనఁబడి, యున్నది యిట మఱువువచ్చు టూహింపంగ౯. ౨౪౧

క. ఇన్నూటనలువదియురెం, డన్నది నీరాటరేవులం దత్తలపైఁ
గన్నెలు చెప్పుకొనినకత, లన్నియుఁ దమ రత్తలైనయప్పుడు మఱవ౯. ౨౪౨

క. ఇన్నూటనలువదియు మూఁ, డన్నడిఁ వెఱ్ఱియగుఁ గోడలన్నను గోపం
బున్నను బియ్యము చేటను, చున్నను బుట్టింటి కేగ నొప్పనిమతికి౯. ౨౪౩

క. ఇన్నూటనలువదియునా, ల్గున్నతియించెదరు వెఱ్ఱిఁ గోడలుపగయుం
జిన్నినునుమఁడు ప్రియుఁడై, పన్నగ మరి పడగ యాత్మబంధువు లైన౯. ౨౪౪

క. ఇన్నూటనలువదేనగు, మన్ననచెడుఁ దల్లి నెట్టిమాటన్నను నే
మన్నను భార్యకుఁ గోపం, బన్నితిని మతిని బాధ నలసెడునరులో౯. ౨౪౫

క. ఇన్నూటనలువదాఱగు, న న్నింటికిఁ బంపు మొండె నాచెప్పినరీ
తిన్నివు మెలఁగుమొండె య, నన్నడఁకుచు నాలిమాట నడచినయేని౯. ౨౪౬

క. ఇన్నూటనలువదేడగుఁ, గన్నెవినోదముగ నోమగఁడ దాఁచితి వే
ఱున్నను లెస్సన ధనమును, నెన్నిక వేర్పడ్డ నరునియేమఱుపాటు౯. ౨౪౭

క. ఇన్నూటనలువదెనిమిది, కన్నియలం దత్తలిపుడు కనఁబతిచెడునా
చిన్నెలు తమ్మత్తలుమును, పిన్నవిధంబులను బఱవు చేకరువిడుచే. ౨౪౮

క. ఇన్నూటనలువదియుమిఁ, దన్నవసంఖ్యఁ జనువెట్టి తనయునితో నీ
చిన్నదిచెడ్డది విడువుము, ప్రన్ననివేట్లోకతెఁ గొనుమురా యనుచేనిక్. ౨౪౯

క. ఇన్నూటేఁబది యగు నీ, వెన్నఁడు నొకదెబ్బవేయ విదిహేతువుగా
నన్నెదిరించును గోడల, టన్నను దలిమాట గొడుకు తానవిన్నక్. ౨౫౦

క. ఇన్నూటేఁబదియొక్కటి, కన్నెలుచదువుటను వచ్చుకష్టం బిది యే
నెన్నఁడు నాకోడంట్రము, కన్నమ్మకు వ్రాయఁజాండు కమ్మల ననినక్. ౨౫౧

క. ఇన్నూటేఁబదిరెండగు, నెన్నఁడు మే మత్తమాట కెదురాడము మే
మెన్నియకార్యము లొనరిచి, నన్నోనాడ రని వృద్ధనారులు పలుకక్. ౨౫౨

క. ఇన్నూటేఁబదిమూఁడగు, నన్నము వెట్టునపు డంతె యవ్వల దినమం
దెన్నాఁడు మగలయెదుటం, దిన్నగ నిలువ మని యత్త దీర్ఘముదీయక్. ౨౫౩

క. ఇన్నూటేఁబదినాల్గగుఁ, బున్నెమొ పురుషార్థమో యెపుడు నాటకములన్
వన్నెలపాటలపొత్తము, లున్నారుల కనుచు నత్తలు కుములుచోటక్. ౨౫౪

క. ఇన్నూటేఁబదియైదగుఁ, గన్నకొమారితెలు చదువఁగాఁ బొగడుచు దా
నిన్నెమ్మి స్నపపఠించినఁ, గిన్నరకంఠమని యత్త గేలి యొనర్పక్. ౨౫౫

క. ఇన్నూటేఁబదియాఱగుఁ, జిన్నప్పుడు నాకుఁ దల్లి చిలుకసమర్తన్
మున్నూఱుచెప్పెఁ బుస్తక, మెన్నఁడు ముట్టనని యత్త యొచ్చిలియార్వక్. ౨౫౬

క. ఇన్నూటేఁబదియేడగు, చున్నది యొకవెట్టి సుతకు నూరకపాటల్
మిన్నగఁజెప్పుచుఁ గోడలి, కిన్నేర్పక పనులుచెప్పి కెడపినయేనిక్. ౨౫౭

శా. ఇన్నూటేఁబదియెన్మి దింట సుత నేకృత్యంబునం బిల్వ కిం
కెన్నాళ్లుందువె నేఁడొ రేపొ కొనిపోఁడే యింటెఁడు నీ్నతల
న్మన్నెపడ్డది యత్తచచ్చె ననునీమోదంబులేదమ్మ యీ
రెన్నాళ్లూరక యుండవే యనెడు మాతృప్రేమ వాటిల్లెడుక్. ౨౫౮

శా. ఇన్నూటేఁబదితొమ్మిదై నెగడు వెట్టియన్న నోయంచు ముం
తన్నిండారఁగ నిప్పులు న్నిరెపగుండం బోసి తాను న్సతుం
డున్నిర్బంధము చేసి కోడలికిఁ గట్టు న్మాతఁ గోడంట్ర మీ
తెన్నక్ లోకమునందు ధాత విధియింతే జాలిలేకుండఁగక్. ౨౫౯

శా. ఇన్నూటర్వదియైనవెట్టి విపలిప్తేప్టాన్నముం బెట్టి చ
చ్చె న్నిన్నెన్నల్లను [illegible] కనిపెంచి న్నిత్యముం [illegible]

తిన్నా ళ్లుండుట గొప్ప కోడలని యాదృత్యన్నలింబోలె నూ
ర్చు న్నాపుత్త్రినిఁ బోలెఁ బెంచితి దరిద్రుం డాత్మజుం డం చసున్. ౨౬౦
శా. ఇన్నాటర్వ్యదియొక్కటైవటలు పేయింటం జగావెఱ్ఱి పే
మన్నాఁ డక్కఱకై కుమారి మెడలో హారంబు నీకిచ్చినం
గొన్నాఁ డబ్బ మరల్పఁ డెప్పటికి మాకుం దెచ్చి యీకున్న నీ
కన్నం బిక్కడ సున్న పొమ్మనుచు నిత్యం బత్త వేధించినన్. ౨౬౧
శా. ఇన్నాటర్వ్యదిరెం డగుం గఱవుచే నిల్లెల్ల గుల్లయ్యె నీ
కు న్నీనాథునకున్ సరాసరిగ నాకుల్పోఁకలే నంపరే
యిన్నాళ్లట్టులుగాదు నీకుఁ బడి హెచ్చే నెందుఁ దెత్తు న్నరే
యున్నం దిందువు లేదటంచు స్నుషఁ బస్తుంపించు నాయత్తచేన్. ౨౬౨
శా. ఇన్నాటర్వ్యదిమూఁడగుం జడియ కేదీ యింట లేనప్డు మా
య న్నేమైనను బంపునట్లు గలదా యాధారమా వ్రాఁత యం
చన్న న్మాటకు మాట యోపలుప నీ కట్లున్నదా చూడుమం
చు న్నానాగతిఁ దిట్టు నత్త మగువన్ సోల్లుంఠవాక్యంబులన్. ౨౬౩
శా. ఇన్నాటర్వ్యదినాలుగుం దరుణమం దేమానితిం; దల్లికిం
గన్నం దే మన సయ్యకుం బడుచు సైఁగ న్నిట్టు లాయిద్దఱుం
గన్నన్ గారిని బెండ్లిచేసి సుతు నిక్కట్లంబడం ద్రోతు రిం
కెన్నో భేదము లాలకింపుఁ డొగి నేనిం దెల్ల వాక్రుచ్చెదన్. ౨౬౪
శా. ఇన్నాటర్వ్యదియేనగు న్సతకు మాతృప్రేరణంజన్న పెం
డ్లి న్నేనొల్లనటంచుఁ బుస్తెలను బల్మిం ద్రెంపి వేఱొక్కచో
సన్నాహంబునఁ బెండ్లిసేయు జనకు న్శంసింతురో యజ్ఞులై
కన్నం గైకొనువారి మెచ్చెదరొ యుక్తం బెట్లొ యోజింపుఁడా. ౨౬౫
శా. ఇన్నాటర్వ్యదియాఱులో జనకుచే నేర్పడ్డయల్లుండు దాఁ
జన్నం దైవవశంబు కన్య యిదియే శాస్త్రీయమా పెండ్లి నా
కున్నీవే పతి వంచుఁ దొల్తటివిభుం గోరున్ ద్వితీయంబు స్త్రీ
కున్నే యీకలిలో వివాహ మనుచున్ యుక్తు ల్విడంబింపఁగన్. ౨౬౬
శా. ఇన్నాటర్వ్యదియేడగు న్సతిని దా నిష్టంబులే కేలఁడే
ని న్నాబి డ్డని కాంత, సంతుఁ గొనిపో నేనీయ నీబిడ్డనం
చున్నాథుం డెదురాడి చేకొనును విజ్ఞుల్ తీర్పరు, ల్టీన ని
గ్గున్న నీరీటు రచ్చ కెక్కు ౨౬౭

శా. ఇన్నూటర్వదియెన్మిదౌ నిటులు వా రీసంచుఁ బోనంచు నె
న్నెన్నో వాదములాడ రచ్చలను జేయిం త్రంగనాయత్త మా
చిన్న ల్తీరువుచెప్పులోపుననె యీ సిగ్గోర్వలేనట్లు గాఁ
జన్నన్ శాస్త్రులు పూర్ణవాదమును జర్చ ల్మానకున్నందునన్. ౨౬౮

శా. ఇన్నూటర్వదిలొమ్మిదౌ నువిదతా నిచ్ఛింప కాత్మేశు నే
గు న్నానాగతులన్ వసించు నితరక్రోడంబుల న్నాథుఁడు
న్విన్నంబౌ టొకయింతలేక మసలు న్వేర్వేఱుమార్గంబులం
గొన్నాళ్లేగఁగ నజ్ఞత న్నిజసతిం గూడుం బ్రమాదంబునన్. ౨౬౯

క. ఇన్నూటడెబ్బదగుఁ బతి, యు న్నాతియు విడఁగ బిడ్డ కొకవారైనం
బిన్నలుఁ బెద్దలుఁ దీరుతు, రన్నిసు వెవ్వరినిగోరు నవ్వారు గొనన్ ౨౭౦

క. ఇన్నూటడెబ్బదియునొం, టన్నందను నేను నేను నందన నని యీ
కన్నియ పెండ్లివ్యయం ఖటు, లన్నటు లని వాదగింతు రాలు న్మగఁడున్. ౨౭౧

క. ఇన్నూటడెబ్బదిపయి, న్నిన్నగ రెండగును వెట్టి మిథ్యావాదం
బున్నెఱిపి యత్త జనకులఁ, జిన్నంబుచ్చుటను స్నుష కృశించెడునచటన్. ౨౭౨

క. ఇన్నూటడెబ్బదియుమూఁ, డు న్నమ్మఁగవచ్చు బిడ్డఁడును బతిలేరే
నిన్నీట మునిఁగి చత్తున, టన్నంతటి దుఃఖ మాత్మ నత్త యిడినరేన్. ౨౭౩

క. ఇన్నూటడెబ్బదియునా, ల్గు న్నరు లెఱుఁగుమరు తల్లి కొడుకును వడి గొం
తున్నలిమి స్నుషను నూతను, సన్నకసన్నగను విడుచుసమయంబులలోన్. ౨౭౪

క. ఇన్నూటడెబ్బదేనగు, నెన్నిక నధికారులెత్తిఁగి యిది యేమనినం
గన్నియపు మూర్ఛయున్నది, నిన్నను జేఁదునవు డట్టె సెలకొనియె ననన్. ౨౭౫

క. ఇన్నూట డెబ్బదాఱగు, నన్నెతి వధియించు టెటిఁగి యందఱు ధనమం
దున్నట్టితీపిఁ బత్నము, చన్నంత నె బిడ్డ నిచ్చుసందర్భమునన్. ౨౭౬

క. ఇన్నూటడెబ్బదేడగు, చున్నెగడును బతిని సుతునిఁ జూడక యిడుమల్
చన్నన్మేలని సతి నూ, తన్నీట మ్మనిఁగి ప్రాణలతిఁ గోల్పోవన్. ౨౭౭

క. ఇన్నూటడెబ్బదెనిమిద, గు న్నూనెను ముంచినట్టి కోకను ధరియిం
చు న్నిప్పువెట్టుకొను స్నుష, యొన్నివిధంబులను నత్త నీఁగుటకొఱకై. ౨౭౮

క. ఇన్నూటడెబ్బదియునం, తన్నపకంబగును వెట్టి తనకష్టంబుల్
తన్నత్తవెట్టుపాటులుఁ, జిన్నపురోణి నిడి నూతిచేరువ నిడిపోన్. ౨౭౯

క. ఇన్నూ టెనుబదియగు వినుఁ, డెన్నివిధంబులును గలవు పృథ్విని గన్యం
బన్నమ్ము లత్తవెట్టుట, కన్నెలు నెట్ట లని స్నుష స్వగణము నుతింపన్. ౨౮౦

క. ఇన్నూటెనుబదియొక్కటి, చిన్నది మంచి దీకవచ్చు చాన విధము తా
మన్నుట యెట్లని యత్తల, మిన్న విచారంబుగదుర మి న్నరసినచోన్. ౨౮౧

క. ఇన్నూటెనుబదిరెండగుఁ, గన్నెల కత్త లౌకయప్డు కలవైనను మే
మున్నామని యీడుబడుచు, లన్నిద్రలు వెట్టుపాటు లౌకళతకంబై. ౨౮౨

శా. ఇన్నూటెన్బదిమూడగు న్సతికిఁ బ్రాఘేయక్రియన్ వృద్ధయై
మూన్నాళ్లట్టుడికించినట్టు స్నుష శా షుల్వెట్టి పోనత్త దాఁ
జిన్నష్టే విధవాత్వమంది సహజాం జేరు న్సదాకాలముం
బన్నంబు ల్వాటప న్ననాంద యువతిత్వప్రాభవం బొప్పఁగన్. ౨౮౩

క. ఇన్నూటెన్బదినాలుగ, గున్నానాగతుల వీరు గొలిపెడిబాధల్
దిన్నన్నము నీరగు నొడు, వ న్నేనని నడుముగట్టి వచ్చితి నేనిన్. ౨౮౪

క. ఇన్నూటెన్బదియైదగుఁ, గన్నియలం దెచ్చి యమ్మఁగా బేరము చే
యు న్నాకిమ్మని కొను నే, తెన్నున వచ్చినది యంచుఁ దెలిసికొనకయే. ౨౮౫

క. ఇన్నూటెన్బదియాఱగుఁ, గన్నియ త్రుచ్చిమిని దెచ్చి కైకొనుఁ డేఁబెం
ప న్నేరఁ దల్లిలేదయి, యున్న దటం చంటఁగట్టి యొకకొంత గొనన్. ౨౮౬

క. ఇన్నూటెనుబదియేడగుఁ, గొన్నంతఁ గ్రమక్రమముగ గుణములఁ గనిన
న్విన్నను మాటల మోసము, చెన్నగుఁ బితయేఁడి యేమిచేయుదు రవలన్. ౨౮౭

క. ఇన్నూటెనుబదియెనిమిది, కన్నపుదొంగలు గ్రహించి కన్నియలను నె
ప్డన్నను దలిసంద్రుల కెఱుఁ, గన్నేరకయుండ నొసటఁ గాల్తురదయతన్. ౨౮౮

క. ఇన్నూటెనుబదితొమ్మిద, గు న్నందనులందు నాసగొని యత్నమునం
బ్రన్ననిసద్ధం డెందే, సున్నను బల్మినిహరించు నుదుటులు గలుగన్. ౨౮౯

సీ. ఇన్నూటతొంబది యొసఁగుఁ బ్రయత్నించి కొన్నబిడ్డని చెవుల్గుట్టి నూది
పువ్వులు నడ్డకాల్పులు చిన్నెమచ్చలు నమరించి పెంచుచు నాత్మజనకు
లెతెఁగి యేడ్చుచువచ్చి యిమ్మని బలిమాల నున్నాఁడు మీకింక నొకఁడు వీని
నిందు మా కింబున్న శేమిలోపము సర్వమును మీఁద మామోహమును గనుండు
వచ్చుచును బోవుచుండుఁడు వలసెనేని, గొనుఁడుమీకేమి నేఁగల్గఁ గుఱ్ఱ కిరవు
రైతి మయ్యల మతనికి హాయిగాదె, యనుచు బుజ్జవమునఁ బంపునాతఁ డున్న. ౨౯౦

క. ఇన్నూటతొంబదొక్కటి, చిన్నకుమారులను దెచ్చి స్వీకృతిఁ బెనుపన్
మన్నిగొనుమారి వారిని, దిన్నఁగఁ గూర్చుండ కలఁతఁ దెచ్చికొనుటయా. ౨౯౧

క. ఇన్నూటతొంబదిరెం, డన్నలఁ దమ్ములను జేరు స్వార్జిత మని యొం
డున్నతనినో పరార్థకుఁ, గొన్నను స్వార్జితము పరులకును బోవు నవన్. ౨౯౨

క. ఇన్నూటతొంబదియు మూఁ, డు న్నిజశిశువులకుఁ బెల్లిదుటలో జనకుల్
గొన్నక్రమం బరయుటచే, విన్నువుగఁ జెప్పవచ్చు వెఱ్ఱి యటంచున్. ౨౯౩

క. ఇన్నూటతొంబదియునా, ల్గు న్నాపితపేరు నాదుసురుపే రని వా
దు న్నెరయఁ జేసి తుదకే. తెన్నునఁ బో కబ్బి యనుచుఁ దేల్ప నరయుఁడా. ౨౯౪

సీ. ఇన్నూటతొంబది యేనగు నొక్కఁగా నొకబిడ్డ యింక నేనొప్పుకొనను
దేవునిపే రనుతెలివ నింకొకసారి గానిమ్మ యిప్పుడు గాదునాదు
తలిదండ్రులిద్దఱుఁ గలసినపే ర్వెట్టుదు నటన్న తనపతితో వధూటి
యింకవట్టిది లెండు హీననామములేల యనఁగ హీనులె నాదు జనకు లిప్సి
పొమ్ము నీయతండ్రిపో హీనుఁ డనుఁతల్లి, హీనురా లటంచు నీరసమునఁ
గొట్టుకొనుచుఁ దిట్టుకొనుచును దంపతుల్, పేరు పెండ్లిదాఁకఁ బెట్టరేని. ౨౯౫

సీ. ఇన్నూటతొంబదా ఱేర్పడుఁ బుట్టిన బుడుతలు నిలువకపోయిరేని
నాసారిపుట్టిన యదియైన బ్రదుకునన్ బ్రముఁ బెంటపైఁ బొఱవైచి తెచ్చి
పెంటయ్య యని పుల్లెవిస్తరిలోఁ బెట్టి పుల్లయ్య పుల్లాకు పుల్లి యనుచు
సీదిరపుంబనుల్ చేసి చింపిరి యని వెఱ్ఱియ్య యని బల్మి విఱ్ఱఁజంపి
కాఁపనయ్య యటంచును బాముఁజంపి, పాముమంత్రంబునేర్చి సుబ్బయ్య యనుచు
రాజునయ లిబ్బులొంది స్వరాట్సమాఖ్య, నాత్మజన్ముల నామధేయములు సేయ. ౨౯౬

క. ఇన్నూటతొంబదేడగు, మన్నామము వెట్టుఁ డేను మనిచెద నీబి
డ్డ న్నాథన మిచ్చెద నిట, నన్నిలుపుఁ డటన్న వృద్ధనారుల మమతల్. ౨౯౭

క. ఇన్నూట తొంబదెనిమిది, చెన్నగుఁ దనమనుమరాలిఁ జెంతమెలపుకొం
చు న్నీవు తల్లిఁ జేరక, యున్నం బన్నసరమిత్తు నూ యని నేర్పన్. ౨౯౮

క. ఇన్నూటతొంబదియునై, దు న్నాల్గగు నత్తపేరిచుహితకరము కా
ల న్నిప్పవాలల్లోఁ బొరపిన, యన్నేరని ముద్దరాలియాశయ మెన్నన్. ౨౯౯

గీ. మూఁడువందలులెక్కను మొనయు మతము. వెఱ్ఱి యందలి భేదము ల్వివిధముల వ
చింపఁ దోఁచినయట్లు దూషించువారి, నోటవాసముచేయుచుండును సతంబు. ౩౦౦

ఇది తృతీయశతకము.

---

## చతుర్థశతకము.

గీ. మూఁడువందలుయొక్కఁపై మరియు వెఱ్ఱి, మతమనఁగ నాత్మసమ్మతమార్గమందు
నడచుటయె [illegible] యందుమాద్యమున నిలుచు

గీ. మూఁడువందలరెండగు మలుచ వెఱ్ఱి, ద్వైత మెక్కుడు తక్క వద్వైత మనుచు మాధ్వులను స్మార్తులనతి ప్రమాదముగను, వాదులాడెడుచోట నివాసముండు. ౩౦౨
గీ. మూఁడువందలమూఁడగు మూర్ఖలేల, వాదుసేయంగ నెందు మా ప్రపన్నగలియ కున్న దే చూడుఁడని వైష్ణవోత్తములు వి, శిష్ట మద్వైతమును గొనిచెప్పు వెఱ్ఱి. ౩౦౩
గీ. మూఁడువందలనాల్గగు మున్ను ఋషుల, నిర్ణితిం గొన్న ఋగ్యజుర్నియమ మెడలి శాంకరంబని రామానుజం బటంచు, మాధ్వమని గ్రుద్దులాడెడు మనుజులభ్రమ.
క. మున్నూ రైదగు వెఱ్ఱియ, గన్నెరసిన త్రిమతములను గొట్టుచు శైవం బన్నది వైష్ణవ మన్నది, మున్నొక వీరపదయుతి సముద్భవమైనన్. ౩౦౫
క. మున్నూటాఱగు వెఱ్ఱియ, గన్నాగము పాశుపతము గాణాపత్యం బున్నైశాచరశాక్తే, యోన్నతమతము లవి లేచి యూఁగాడెడుచోన్. ౩౦౬
గీ. మూఁడువందలయేడుగా మొనయు వెఱ్ఱి, షాపణికమను గాపాలికంబు శైత్ర దీక్షకంబనఁ దన్మతధ్యేయ దైవ, తములు శాస్త్రము లున్నట్టి స్థలములందు. ౩౦౭
గీ. మూఁడువందలయెన్మిదౌ మనుపటివియుఁ, గా కమానుషికంబులు గాఁగబౌద్ధ మనుచు మహమ్మదీయమంచును నడుమను, గ్రైస్తవంబంచుఁ దన్మతకర్త లలర. ౩౦౮
గీ. మూఁడువందలతొమ్మిదౌ ముఖ్యమతము, ప్రబలి ప్రాచుర్యమునకురాఁ బ్రభులు ప్రజల నియతిచేయించుటకుఁ బ్రయత్నించునవస, రంబునం దోఁచు కష్టఘోరకృతులందు.
గీ. మూఁడువందలపది మురుపయ్యెనీవల, పీఠిఁజూచి కొంత వెఱ్ఱిపుట్టి రొట్టెలనుచు రాజరాజులంచును స్వాము, లనుచు వెలసియుండి రందునందు. ౩౧౦
క. మున్నూటపదునొకండగు, నున్నతిగను షణ్మనకు నుపవర్ణంబు ల్పన్నంబై వాదడుముచుఁ, నన్నే చూడుమని వింతనాటక మాడన్. ౩౧౧
సీ. మూఁడువందలమీఁద మూఁడునాల్గులవెఱ్ఱి ప్రభవించెఁ జిలవలుపలవ లేచి బ్రాహ్మణాదులు స్వగౌరవము వెల్లడికాఁగ విప్రవినోదులఁ బెట్టికొనిరి రాజులు బట్టులఁ బ్రబలంబుచేసిరి సాలిపెద్దీలు మాసటులు దాస రులు పిచ్చుకుంట్లును రుంజలు పొడపిచ్చుకలు నిట్లు ప్రతివర్గగౌరవంబు గూర్చిముచ్చటింపఁ గోరి యాచకవృత్తి, వారికమరఁ జేసి స్వధనపుష్టి నెవరివారి వారు వృద్ధిసేయఁగ నవి, కొన్నిజాతు లగుచుఁ గూడె నిందు. ౩౧౩
గీ. మూఁడువందలపదుమూఁడు ముచ్చటగును, మతము వెఱ్ఱిని రాజులు మానుకొనిరి పాలనమ్మును బ్రాణము ల్గోలుపోయి, రెండవో యని యాలించినందుకతన. ౩౧౩
సీ. మూఁడువందలపదుమూఁడు పైనొక్కటౌ వెఱ్ఱిని జదువుఁడీ విబుధులార యున్నూటతొంబదా ... త్రి ... జాత్రప్రథమము లిప్డు

పీ. సుబ్బరావని కే. సూర్యరావని యెల్. రామచంద్రుఁడం చీ. యు. పంతు
లని టీ. కె. చార్యులం చని సీ. పి. రావని డబ్లియు వెంకన్న డాటరు మున
లమ్మయుంచు యం. వి. హాలంచు నీరీతిఁ, బేరులందు వింత వెడలు చుండె
నిల్లుఁ బేరుఁ బోయి యింగ్లీషుహాడియాత్ర, రములు నిల్చునేమొ క్రమముగాను.

క. మున్నూటపదేనయి నిలు, చున్నత్యముగాఁగను పరిశుద్ధుఁడు దేవుం
డున్నాఁడన లేఁడన లే, కున్నం గల్గినను నిష్ప్రయోజన మనినన్. ౩౧౫

క. మున్నూటపదాఱగు లేఁ, డన్నను దోషంబు గలఁడు ప్రారబ్ధంబుం
గన్నంత దేవుఁడున్నాఁ, డన్నది నిశ్చయము తెలియ ననవసర మనన్. ౩౧౬

క. మున్నూటపదేడగు మును, పున్నంతటి శక్తి యిప్పు డుండదు కష్టిం
చె న్నిలిపె మంచిదారిని, మన్నిక బ్రదుకుటయె మనకు మంచిది యనినన్. ౩౧౭

క. మున్నూటపదియునెన్మిది, నెన్నఁడు దేవునకు శక్తి హీనంబగునే
చిన్నతనం బటులనకుము, తిన్నని మార్గమ్ము నీకుఁ దెలియదనియనన్. ౩౧౮

క. మున్నూఱుంబందొమ్మిది, యన్నని మనశక్తి యుడిగె నాదేవుని జూ
డన్నేరము మున్నిటివా, రన్నం గన్గొనఁగఁజాలి రని వాదింపన్. ౩౧౯

శా. మున్నూటిర్వదియైనట్టి స్వశక్తియుడుగం బోదెందు నానాఁటికిన్
మున్నెవ్వారును జూడనట్టి విషయంబు ల్గాంచుచున్నార మం
చున్నీల్గుం గలవానిఁ గానఁ డితఁడా నూత్నాంశము ల్చూచుఁ జా
లు న్నవ్వంగలరంచుఁ జెవిసుకుపల్కు ల్పల్కువానిం గనన్. ౩౨౦

క. మున్నూటిర్వదియొక్కట, గు న్నాదేవుఁ డధికుండు గొలు నీదేవుం
డన్నతనిబుద్ధిలేమికిఁ, జిన్నినగవుగాక ప్రతిగఁ జెప్పఁడు రేనిన్. ౩౨౧

క. మున్నూటిర్వదిరెండగు, నన్నింట నపారుపేయ మనుమావేదం
బన్నను నమ్మఁడు తనతను, వు న్నరులొనరించినారు పో యని నిక్కన్. ౩౨౨

సీ. మున్నూటయిర్వదిమూఁడగు వెట్టిలో వేదంబులును సత్యవేదములును
దానిలోఁ గ్రొత్తప్రాఁతలభేదములు నన్ని వేదంబులను దొల్లి వింతగాను
గ్రుడ్డికిఁ గనులొసంగుటకు గొడ్రాలికి బిడ్డనొసంగను చేదరాలి
కర్థంబులీయఁ బ్రత్యక్షమా దేవుఁ డీ యత్యర్థనాగరకాగ్రగణ్య
కాలమున నొక్కరికి నెందుఁ గానరాని, కారణముఁ జెప్పఁజాలరు కాలశక్తి
యుడిగె నన నొప్పకొనరు పూర్వోక్తమ్ము, లనెగ్రహించుచు నీతుల ననువదింత్రు.

క. మున్నూటిర్వదినాల్గగు, చున్నది మావేదమెల్లఁ జూపించు ననుం
బెన్నునెఱుంగదు సల్లె, జ్జన్నను మిన్నరయము నించు నరయఁగరాదే. ౩౨౪

క. మున్నూటిరువదిరైదగు, మున్నిటిబోధకులు నిష్ఫలమట్టిరి తినిరం
చున్నడువు నిపుడు బోధకుఁ, డెన్నఁడు తానేమిచేసె నిహీహీ యనఁగన్. ౩౨౫

క. మున్నూటిర్వదియాఱగు, దున్నది యావసు లను మాట పలాణు లనెడుమా
టున్నది మా గ్రంథంబుల, నున్నదె మీదాన నమ్ము నుడికింప ననన్. ౩౨౬

శా. మున్నూటిర్వదియేడగు న్మనువు మీ భూగోళశాస్త్రంబులోఁ
గన్నారే మిము నేలుదేవుఁ డెపుడుం గాఁపుంచునామంచుకొం
డ న్నేమాఱొవరెస్టు గాంచితిమి మింట న్నీరుశాస్త్రంబులోఁ
గన్నారా శనిలోనిపట్నముల నాఁగా విన్నవాదంబులన్. ౩౨౮

శా. మున్నూటిర్వదిరెన్మి దాబుధునిలో భూభృత్తులు న్రాజ్యముల్
గన్నా మచ్చట మాదొరల్ దురకలున్ గండెక్కియున్నారు మీ
చిన్నెల్లగ్గినవారు భేరసుటచే సిద్ధంబు మేమెల్ల మీ
కన్నన్మించు జనించినార మని వాగ్వైచిత్రిఁ జూపించుటన్. ౩౨౯

శా. మున్నూటిర్వదితొమ్మిదయ్యె శివు నమ్ముం డిచ్చుభాగ్యమ్ముల
న్న న్నమ్మన్ స్వమతంబుగావునను విజ్ఞానంబు మెండై ననున్
నన్నుంబోయి సుఖింపనిండు పరమానందంబున న్భార్యతో
డన్నాబిడ్డలతోడ నంచని దవిష్ఠంబైన తావంగినన్. ౩౩౦

గీ. మూఁడువందలముప్పది మూర్తులకేను, బూజరేమని తెగడి తామః సటు మ్రొక్కు
ప్రాస్వన్మష్టులమాటల కట్టెమోస, పోయి కడగంట్లఁబడువారిపొంత నిలుచు. ౩౩౧

క. మున్నూటముప్పదియు నొక, టిన్నవ్వాఁడు తావశము కటినిజుట్టును జే
తన్నిమురుఁ గంతమునఁగల, నన్నున్నిందించు నతనినాట్యానుస్మృతిన్. ౩౩౨

క. మున్నూటముప్పదియు రెం, డు న్నేవిన్నఁజాల దేవుఁడు గుడినిలుచునే
యన్నతఁడుఁ గట్టు నొకగుడి, నన్నని తానచట నలుచు నగరేల బుధుల్. ౩౩౩

గీ. మూఁడువందలముప్పదిమూఁడు వలిలు, జీవహింసయొనర్చి యజింప నవ్వి
నిత్యయజ్ఞము సేయు నన్నేరుపతిని, మిన్నకుండిన బుధులసమీపమునందు. ౩౩౪

క. మున్నూటముప్పదియునా, ల్గు న్నేర వచింప మతముఁలోఁ గలవెట్టి
స్వైన్నునిభక్తులు శివభ, క్తున్నేత్రము లెత్తిచూడ దోష మటన్నన్. ౩౩౫

క. మున్నూటముప్పదేనగు, నన్నిటికిని ముందు తిరుపదాంకము లేదే
విన్నెరసం బనుచుఁ దియు, వన్నెలపులి తియకట్టుకని భాషించెదుచోన్. ౩౩౬

క. మున్నూటముప్పదాఱగు, నన్నింటికిఁ జివర లింగమని చేర్పవనం
గన్నియు యాత్రయులింగము [illegible] విద్యానసవినుచుటన్. ౩౩౭

క. మున్నూటముప్పదేడగు, నన్నిట హరిపేరు లేనియది దోషం బం
చున్నారాయణ నాకున్, వెన్నుఁడ విభుఁడవని భక్తిపెట్టిని బలుకన్. ౩౩౭

క. మున్నూటముప్పదెన్మిది, యెన్నిక రామానుజా వృషేంద్రా బసవా
తిన్నఁడ తిమ్మఁడ యనుచు, న్వెన్నుని దగకంటెఁ దలఁప విడిచిరయేనిన్. ౩౩౮

గీ. మూఁడువందలముప్పది మూఁడునాలు, స్మార్తసానన మెప్డు వైష్ణవుఁడు చూడ
రాదు వైష్ణవుతోఁ బల్కరాదు శైవుఁ, డనెడుబి ట్టుభయముఁజెలుచునపు డెన్న.

గీ. మూఁడువందలనలువది మరియు పెట్టి, వాడుక సుమామహేశ్వరపట్టనమ్ము
ననిరి లక్ష్మీనృసింహపట్టన మటంచుఁ, జెప్పుకొనుమాటలనుబట్టి గొప్పగాదు. ౩౪౦

క. మున్నూటనలువదియునొక, టిన్నవలియనంతరమున డెక్కను మదమా
నన్నముఁ దినియుండినక య, మున్ను విడెంబుగొనఁ దానమొనయఁ గనినన్.

క. మున్నూటనలువదియు రెం, టన్నరులను పెట్టిపట్టు నవమన్నము పాల్
వెన్నలు కదలీఫలములుఁ, దిన్నయనంతరము విడెము దినఁ గొందఱలోకన్. ౩౪౨

గీ. మూఁడువందలనలువదిమూఁడు మాలి, మీఁద మీసమున నియోగి మెఱయు శక్తి
లేనివైదికి గొఱిగించుఁ గానరాదె, తారతమ్య మటంచు సంతసముగొన్న. ౩౪౩

గీ. మూఁడువందలనలువది మొనసినాల్గి, టిని వహించినపెట్టి యెట్టిపన విసుఁడు
తనపితామహుఁడో ప్రపితామహుండో, మంత్రి యని బీద నేఁడు దంభములుగొట్ట

క. మున్నూటనలువదైదగు, న న్నీతఁడు చూచినపుడు సమయమును మున నేఁ
గొన్నాళ్లు చదువుచెప్పితిఁ, జిన్నప్పుడు పేద యిపుడు స్థితిమంతుఁ డనన్. ౩౪౫

క. మున్నూటనలువదాఱగు, నున్నతపదవులను గొన్నయుద్యోగులకె
ల్ల న్నేన గురుఁడ ననునొకఁ, డు న్నయవిధిఁ జూడఁడుఁ బలుకఁడుం బుడుకఁ డనన్

క. మున్నూటనలువదేడునఁ, జెన్నప్పా! వీఁడు నాదుశిష్యుఁడు నాచేఁ
దిన్నాఁడు మొట్టికాయ ల, న న్నగరాధీశు నెదుటనుం బడవెలచున్. ౩౪౭

క. మున్నూటనలువదెనిమిది, మున్నీతఁడు నాజనకుప్రభుత్వమునం దె
ప్డు న్నన్నెత్తుకొనెడువాఁ, డిన్నాఁటికిఁ బెద్దయయ్యె నే యన నిలుచున్. ౩౪౮

గీ. మూఁడువందనలువది మోయితొమ్మి, దిని వచింతురు నన్నిప్డు లేతిచూడఁ
డోనమాల్ నేన నేర్పితి నున్నతంపు, బదవి యీతనికబ్బె నం చుదుటు నేని. ౩౪౯

గీ. మూఁడువందలయేఁబది నీఁడొ నేను, జదువుబడిలోనె చదివెను జట్టుబండ
యిప్పు డధికారియయ్యె నేదేని పదవి, నిమ్మనిన వ్రాఁతరాదని యెగురు సనిన. ౩౫౦

క. మున్నూటేఁబదియొక్కటి, విన్నఁదనం బింతలేక వీఁడొకప్రభువా
చిన్నది బెదరదు మును మా, పిన్నాయన [illegible]న్. ౩౫౧

శా. మున్నూఱేఁబదిరెండగుం గొలువులో ముజ్జిడ్డుగా వైదికుల్
గొన్నారన్నిపదంబు లన్నిటను నియోగుల్ నేఁడు చేకొన్నవా
రున్నారేకద మంత్రి శేఖరు లటం చుద్వేజితు ల్పల్కఁగా
విన్నంత న్నగియూరకుండ కదియే విస్రంభ మాత్మంగొనన్. ౩౫౨

గీ. మూఁడువందలయేఁబదిమూఁడు గొరలు, వెట్టి వైదికపట్టు లోనెడఁగ బ్రస్వ
ముందుగలిపెదనా యని పుత్త్రుఁడిట్టు, సమ్మలక్కల యాత్మమర్యాద నరయు. ౩౫౩

శా. మున్నూఱేఁబదినాల్గునా జగములో మూర్ఖుల్ విశేషించి పే
రౌన్నత్యంబున మీఱుటం గులముమర్యాదల్ విసర్జించి రా
జున్నట్లార్యుఁడు నార్యపోలికిని వైశ్యుం డంత్యజుం డర్యున
ట్లున్నా నాగతులం జరించుటది చెల్లుం బండితాసహ్యమై. ౩౫౪

శా. మున్నూఱేఁబదియైదగున్ స్థితికినిమ్ముం డేని వేషంబుఁగై
కొన్నన్ గుడ్డల కేమిలోప మవినాకుం జిక్కవో యక్షరం
బు న్నేరం డలిగర్వియై తిరుగుచో మోసంబు వాటిల్లు నే
నన్నన్నచ్చెదు చెప్పువారెవరో యంచల్లాడు నా వెట్టికిన్. ౩౫౫

శా. మున్నూఱేఁబదియాఱుగా మనుజు మోముం జూడఁగా నే యిటం
డిన్నాఁట న్వసియించువాఁడు కుల మి ద్దీవృత్తిలో వాఁడు నాఁ
జెన్నారంగను వేష ముండవయినన్ శ్రేష్ఠత్వముం బాసి పో
వున్నవ్వం దలవంపులంద నది యొప్పు న్వెట్టియై మొట్టియై. ౩౫౬

శా. మున్నూఱేఁబదియేడగుం బలువు రల్పుల్ గొప్పవేషంబుతో
డ న్నిల్వంగఁ బ్రమాదబుద్ధి నిటుగం డా యంచుఁ బీఠంబు చూ
ప న్నెనర్పుఁడఁగా నటం చవుడు దాఁపన్లేక సిగ్గొంది ప
ల్కన్నాఁడం దవమానమూఁగద వివేకుల్దాని శ్లాఘింతురే. ౩౫౭

శా. మున్నూఱేఁబదియెన్మిదౌ నధికుఁ డున్మత్తాత్మవేషుండుగా
నున్నం గాంచు నగౌరవం బొకట నెయ్యుర్బాంధవుల్ మెచ్చ ర
చ్ఛన్నంబైన స్వకాంతి దెల్పు ననుటన్ సాధారణాకారతం
గొన్నం గొందురుగా కగర్వు లది లోకువ్వెట్టిగా నెన్నరే. ౩౫౮

శా. మున్నూఱేఁబదితొమ్మిదౌ నధికుఁడేమో దానుగొన్నట్టి యౌ
న్నత్యస్థితి కల్పు నెత్తఁ గడ డాయం జూడఁ దానల్పతం
గన్నం గాంచునుగాని యల్పు నధికుం గావింపఁగా నేర్చునే
యెన్నం డెవ్వ రొసంగి రీయధికృతిన్ హీ యంచు వెట్టిచ్చెదన్. ౩౫౯

శా. మున్నూటర్వదియై తలిర్చు వృషభంబుం బోనివేషంబుతో
ద న్నక్కాలువు లిస్సి నోరుమెదపం డబ్బెత్తు శక్తుండు గాఁ
డన్నా యేటికి నీని కీ పొగరు వే యన్లేకియా వేష మి
ట్లున్నా మీరాయెడ మేనునొప్పి యని తా నూర్పుచ్చు నావెట్టియున్. ౩౧౦

శా. మున్నూటర్వదియొక్కటౌ పలుపనే ధ్వల్మీలు వేషంబులం
జిన్న ల్పెద్దలుఁ బోవుపోకడలనేఁ జిత్రంబులన్ వ్రాసి క్రిం
ద న్నిర్మాణచమత్క్రియా ద్దెలిపి హస్తం బొండు చేయం దలం
పున్న స్థానిలి నిండుఁ జెప్ప నని యేమో వెట్టి వాక్రుచ్చినన్. ౩౧౧

క. మున్నూటర్వదిరెండవుఁ; దన్నుం బలపలుచుకొనఁగఁ దక్కిన ప్రాణిం
దిన్నం దిననూహించిన, నన్నరునజ్ఞాన మధికహాస్యాస్పద మై. ౩౧౨

గీ. మూఁడువందలయిరువదిమూఁడు తప్పు, గాదు. జీవికి జీవిగాక మఱియొండు
గలదె బ్రాహ్మణులు దినుశాకములు ప్రాణు, లనఁదగదొ యంచు వాదించు నతనివెట్టి.

క. మున్నూటయిరువదినాలుగ, గు న్నాకాహారమునకొకోపుప్లైను భూ
మిన్నిఖిలజంతువులు నే, నున్నది యేటికని యొక్కఁ డూహింపఁడయేన్. ౩౧౪

క. మున్నూటయిరువదియైదగు, చున్నది మున్నిన బ్రాహ్మణోత్తము లొకయేఁ
ట న్నమలరె గజమస్తక, సన్నిభ మనుమాంస మనుచు సరిపుచ్చుకొనన్. ౩౧౫

క. మున్నూటయిరువదియాఱగు, నెన్నెతి భగవంతుఁ డఖిలమృగముల సృజియిం
చె న్నరుఁ డన్నెటి దానెఱుఁ, గన్నెరక చంపి తిని యఘం బొడఁగూర్పన్. ౩౧౬

క. మున్నూటర్వదియేడిటఁ, బన్నగమంత్రమ్ము నేర్చి పాముపగిదినుం
ట న్నరుఁడుపొట్లకాయఁ ది, నన్నడకిన నవ్వు వెట్టి నానాగతులన్. ౩౧౭

క. మున్నూటయిరువదియెనిమిది, యెన్నఁడు హింసయని మదిని నెంచనివాఁడుం
బున్నమ నమహనఁ బెండిలిఁ, దిన్నది తప్పెఱచి యని విధిం గొనియాడన్. ౩౧౮

క. మున్నూటయిరువదితొమ్మిది, దున్నలు నెద్దులును జావఁ దోలాలిచికొనం
దిన్నం బాపముగా దగు, నన్నది విడనాడి చంపి యటుచేయ నగున్. ౩౧౯

క. మున్నూటడెబ్బదియగుం, జిన్నప్పటినుండి పెంచి చివికినపసి మేఁ
పన్నెరక కటికకు విలు, చున్నరుఁ డని యొకట వెట్టి శోకించునయేన్. ౩౨౦

క. మున్నూటడెబ్బదొక్కటి, యెన్నఁడు చచ్చునిది కాఁపు లిచ్చుట యొన్నం
డిన్నాఁడె కొంచ మని విష, మున్నఅలపుఁ బెట్టు దుష్టపురుషులకేడ్పున్. ౩౨౧

క. మున్నూటడెబ్బదియురెం, డు న్నేర్పున నెఱిఁగి యట్టికొంగల గృహము ల
మ్మన్నేర్చిరి పడుగొడ్డుల, నన్నా యని వెట్టినవ్వ [illegible] ౩౨౨

గీ. మూఁడువందలడెబ్బదిమూఁడు నలిక, నెత్తు రంతయుఁ బోవునం చొత్తి మొత్తి
యుడుములను గోతిలోనింపి యూరఁబందు, లను వధించెను సమయములను బొసఁగ

క. మున్నూటడెబ్బదియునా, ల్గున్నెత్తురు నిజ్జలెలుఁగఁ గుక్కలు శునచే
నన్నపుటీలుసొచ్చినఁ డోఁ, కన్నఱకిన హింస యసనికిష్టాని దూఱన్. ౩౬౪

క. మున్నూటడెబ్బదేనగుఁ, జిన్నంతటినుండి జోడుచెలిచి శుకంబున్
సన్ననిగూఁడునఁ బెంచిన, యన్నరులవినోదమునకు వ్యాఖ్యానముగన్. ౩౬౫

క. మున్నూటడెబ్బదాఱగు, నన్నము ముట్టెనని కాకియుఱుతం గుదెగ
ట్టన్నాటఁగట్టె నదిపడు, ఛిన్నత గలకాల మళనిఁ గిల్బిషఁ జేయన్. ౩౬౬

క. మున్నూటడెబ్బదేడగుఁ, గన్నపుఁగుక్కలను బట్టి కాఁగెడుగంజిన్
వెన్నునఁబోసిన దుర్మతి, కెన్నాళ్లను ముక్తియందు నెంచెడువెట్టిన్. ౩౬౭

క. మున్నూటడెబ్బదెనిమిది, యున్నది సర్వజనసమ్మతోద్యత్కృతి హిం
సన్నం దోషము గట్టఁగ, నెన్నెమ్మల కిచ్చుబలు లనేకార్భటిగన్. ౩౬౮

క. మున్నూటయెనుబదకె నొక, టిన్నూనము న్యూనముగ ఘటించెడు సదియా
నెన్నికల జంతువులఁగొనఁ, బన్ని నయురులాది బోనుపర్యంతంబున్. ౩౬౯

క. మున్నూటయెనుబదియగున్, దున్నల కెద్దులకు ముక్కుదుస్సిన నని తా
మున్నన్ని నాళ్లు దుఃఖము, నన్నరులను గొట్టునను నలఁగెడు వెట్టిన్. ౩౭౦

శా. మున్నూటెన్బదియొక్కటౌ విసముపై ము న్నీఁగ కాల్మోపి యా
సన్నాన్నాదుల వ్రాల దోసమసునాచార్యుల్ సదా యంగడుల్
పన్నం గుష్ఠరుగార్తు లర్భకుల నార్పం గాంచుచుం బల్కకే
యున్నం దీనికి నర్థ మే మనుచు నా యున్మాద మాశించినన్. ౩౭౧

క. మున్నూటెనుబదిరెండగుఁ, బన్నుగ సారస్వతమునఁ బండితులు కవుల్
మున్నిటివారలు మొదలుగ, నెన్నికఁగనఁ జేసినట్టివెల్లను వెట్టుల్. ౩౭౨

శా. మున్నూటెన్బదిమూఁడగు న్బుధుఁడు సంపూర్ణాఖిలామ్నాయముత్
హ్మానీశిరజమునందు నిల్పి పలునావృత్తు ల్వచోనైఖరిం
బన్నంబు ల్తడఁబాటులేక నుడువున్ వ్రాలేయముచోఁ బట్టి వె
క్కన్నన్నం గనలేద తొల్లియనఁ జే కౌటిల్యుఁడం చాడినన్. ౩౭౩

క. మున్నూటెన్బదినాలుగ, గున్నందికులోద్భవుండు గొనకొని యలతి
మ్మన్న తనచక్రబంధము, నన్నిలుపఁడె తిమ్మనమున నడకెడువెట్టిన్. ౩౭౪

క. మున్నూటెనుబదియైదగు, సన్నుతకావ్యముల యజ్వ స్వప్నములోనం
గన్నవి నుడివిన నందఱు, నున్నను తేనవ్వ [illegible] ౩౭౫

క. మున్నూఱెనుబదియాఱగు, నెన్నఁడొ పెద్దన్న వేంటపృత్త మశేషం
బున్నొడువఁ గర్త యెదుటికి, నిన్నాఁడును సైంధవంబు నెటుకలఁ దేఁబెన్. ౩౮౬

క. మున్నూఱెనుబదియేడగు, నెన్నాఁడును గావ్యములను నింతులు చదువ
న్వెన్నంజవేయ నవయవ, సన్నుతి యొనరింప వెట్టి సహియింపదయేన్. ౩౮౭

క. మున్నూఱెనుబదియెనిమిద, గన్నారులు చదువుకొనఁగఁ గూడినకృతి యొం
దున్నదని యన్నియును బుస, కొన్నలినే చెప్పననుచు నొగి వెట్టి యనన్. ౩౮౮

క. మున్నూఱెనుబదితొమ్మిది, యన్నియుఁ బురుషాంకికంబు లైనను స్త్రీలన్
మన్ననఁ "స్త్రారుఁజసయ్యా", నన్నేలు మటంచుఁ గీర్తనము సేయ ననున్. ౩౮౯

గీ. మూఁడువందలతొంబదిం బురుషుఁ దలివ, వర్ణనముసేయ నలివ దాత్రాయుఃవిత
నలివ వర్ణించునే వింతయనుసరణపు, వెట్టిరా యని యొక వెట్టి పరిహసియింప. ౩౯౦

క. మున్నూటతొంబదియునొక, టన్నిలుమను వెట్టి కవి తడంబడ నదియే
మిన్నయని తప్పు త్రోవల, కు న్నెలవగునట్టి నేర్పు కూర్చినయెడలన్. ౩౯౧

క. మున్నూటతొంబదియురెం, ట న్నొగులును వెట్టి యర్పణముదాఁక పటూ
క్తి న్నొఱపి పిపసఁ దేలవ, ము న్నీరసరచనఁ గథను మొదలిడి చెలుపన్. ౩౯౨

గీ. మూఁడువందలతొంబదిమూఁడు మూడు, నెందు పద్యాంతములు వీడ విడియుఁ బదునె
నిమిదివర్ణనలందున నిమిడినవియొ, యనుచుఁ బరిహాసమున వెట్టి యాడెనేని. ౩౯౩

క. మున్నూటతొంబదియునా, ల్గు న్నొక్కి వచింపవచ్చుఁ గుఱ్ఱఁడును గవి
తోన్నతికి నడుముగట్టి ధ, ర న్నేలను భువి వసుంధరను నవని ననన్. ౩౯౪

క. మున్నూటతొంబదేను గ, వి న్నేనని కుకవి విఱ్ఱవీఁగుచు భాషా
భ్యున్నతికిఁ గృషియొనర్పక, యున్నది చెడఁగొట్టుకొను నోహో యనువెట్టిన్.

క. మున్నూటతొంబదాఱగు, నన్నిలోకంబు బుధగణనకుం దెచ్చెన్
వన్నెకు నెక్కితి నని యొరు, ల న్నిరసించెడు మహాత్మలాఘవముఁ గనన్. ౩౯౬

క. మున్నూటతొంబదేడగు, నన్నందఱు గౌరవించి నాయొద్దికి రా
కున్నను వారికి బిచ్చము, సున్న యటంచుబ్బు భావశూన్యుని వెట్టిన్. ౩౯౭

క. మున్నూటతొంబదెనిమిదిఁ, గొన్నాఁడను బట్టి మింకఁ గొదవే యనుచు
న్నన్నును మిన్నును వెదకి క, ను న్నీచపుసేవఁ జదువును విడుచు నహహా. ౩౯౮

గీ. ఒకటితక్కువ నన్నూఱు నొరయువెట్టి, నల్పమేధావి పరిశోధకాగ్రగణ్యుఁ
డై రచించెడు రచనలయందుఁ గలుగు, లోపములఁ బండితులు చూడనోపనపుడు.

శా. నన్నూటొక్కను బురాతనాంధ్రకృతుల న్నద్దేలు వర్ణించుటం
గన్న న్వారి కజ్ఞలోకముల నక్కాలంబునం

డు న్నాఁ డెవ్వఁడు నావకావఁ గొనిరాఁడుం దీన నానాఁడు తే
కున్నా నివ్వపదార్థము ల్దినుట తప్పో యంచు శోధించినన్. ౪౦౦

ఇది చతుర్థశతకము.

---

## పంచమశతకము.

శా. నన్నాటొక్కటియా మహాత్ముఁడు మదీనాలోన విశ్వస్తుఁ జే
సొన్నాఁ డావిసమాది నేఁటికిని సాగుం గొంచెకొంచెంబుగాఁ
జన్నాఁ డాకవి కాలిదాసు మును విశ్వస్తాభసేత్యాదిగా
నున్న ట్లింతుక చెప్పె నందు సభలోనూహ ల్వెలార్పంగడుఁక్. ౪౦౧
గీ. నాల్గువందలరెండు సెన్నంగవచ్చు, వెఱ్ఱిగాఁ దాను సకవియై పెటకవులను
గుకవులనకున్నఁ గృతికి లోకువ యటంచు, వెనుక ముం దేమి గన కన్న వేళయందు.
గీ. నాల్గువందలమూఁడు వింతయగు వెఱ్ఱి, పండితుఁడు తనజ్ఞానంబు వ్యర్థముగను
"బూజుపుర్ష్యాం"బనుచుఁ "ద్రోసిరా" జటంచుఁ, బ్రొద్దుపుచ్చుటఁగనినవ్వఁ బోవు నెప్డు
గీ. నాల్గువందలనాల్గు ప్రజ్ఞాని ననుచు, విజ్ఞుఁడను దానేమి విశ్వమునకు
నుపకరించెను దాను నేను నొకరూపు, గాదె యని యొక్కపండితుఁ గని హసించు
గీ. నాల్గువందలయైదగు నాల్గుముక్క, లడ్డదిడ్డంబుగా నేర్చి యాలుబిడ్డ
లను విసర్జించి సన్న్యాస మనుసరించి, బంధువులపంచలిన్నేలు పట్టితిరుగ. ౪౦౫
క. నాలుగువందలయాఱగు, నేలుఁడు గాపాయములను జెప్పాలు ముక్క
ద్దాలును గ్రాలఁగ యతినని, వాలాయము ధనికుబండ్లపయి నడయాడన్. ౪౦౬
క. నాలుగువందలయేడగుఁ, గాలముఁ గర్మంబు సంఖ్య కాలముఁ దెలుపం
జాలుదు నని ధనిఁ జేరును, జాలికుఁ డాక్షేగతి యెఱుఁగఁజాలఁ డని నగన్. ౪౦౭
క. నాలుగువందలయెనిమిది, కాలుం జెయి విదిర్చి మేఘగంభీరముగాఁ
జాలఁగఁ జెప్పును నీతుల, నాలాగునఁ దాను జేయఁ డనుశాస్త్రియగున్. ౪౦౮
క. నాలుగువందలతొమ్మిది, జాలక్ దుర్గర్వమునను భూప్రజలను బ
ద్యాలిని దూషించెడుకవి, నాలము గావించువెఱ్ఱి యజ్ఞుఁ డటంచున్. ౪౦౯
క. నాలుగువందలపది యగుఁ, జాలం డొకపనికిఁ జేయఁజాలెడువారిం
జేలిక నిందించును గలి, కాలమురా యనుచు మూర్ఖుఁగని విహసింపన్. ౪౧౦
క. నాలుగువందలపదునొకఁ, డాలికి కల్పించుగాథ లన్నియు నమ్మున్
బాలిశుఁడు దైవమా విన, జేలా నామాట లని పఠించును మిథ్యన్. ౪౧౧

గీ. నాల్గువందలపంద్రెండు నాఁడు కాళి, దాసునకు భోజునకు వారతరుణి యొకతె
యుండెనని దానిఁగూర్చివ్రాయుదురు గ్రంథ, ముల నహో యని దుఃఖించి ముడుఁగు పెట్టి.

గీ. నాల్గువందలపదుమూఁడు నన్నపార్యుఁ, డిల్లు గాల్పించె భీమువ్యాకృతి నడంచెఁ
దనకు గౌరవహానియౌఁ చని వచింత్రు, పొత్తముల వ్రాయుదురటంచుఁ బొగులు నేని

గీ. నాల్గువందలపదునాల్గు నగుచు బెద్ది, భట్టు వ్యాఖ్యానమొనరించి ప్రతిభ తండ్రి
కిచ్చెనని చూచినట్లె యిసీ జగంబు, మూర్ఖవాక్యంబులకు మోసమును భజింప. ౪౧౪

గీ. నాల్గువందలపదునైదు న్యాయమాడుఁ, గవుల మాటలు మోసినఁ గవు లగుదురు
బహుకవీంద్రుల భరియించువారు కవు ల, గుటకు నాలోచనం బేలొకో యటంచు.

గీ. నాల్గువందలపదునారు నాకవిత్వ, మిందుఁ దప్పులు వట్టుఁడం చిచ్చి చెత్త
పొత్త మందిది తప్పన్న బుస్సుమనుచుఁ, బడుచుఁ దనమును జూపునవ్వాని దగును.

గీ. నాల్గువందలపదునేడు నలుగురైదు, గురు యథామతి బాగని జరపిపుచ్చ
వారు మెచ్చిరి యోగ్యతాపత్త్ర మిచ్చి, రనుచుఁ బొంగెడు దుష్కవి నావహించు.

శా. నన్నూఱుం బదునెన్మిదౌ గవులలో నంగల్గుసన్మార్గముల్
కన్నం డెంచఁగలేక మిన్నకయ తాఁగూర్చుండఁ దన్నింటికిం
దన్నేచూడు మటంచుఁ దప్పుకవితల్ తండోపతండంబు లు
త్పన్నం బొందఁగఁ జేయుఁ బెద్దలకుఁ జూపం డాత్మగర్వంబునన్. ౪౧౭

క. నన్నూఱుం బదియుఁ దొమ్మిది, పిన్నలు కవులమని తేచి పెద్దలపోలెం
దిన్నగ నెఱుఁగక నేరక, చిన్నతన మ్మెఱుఁగలేక చిందులు ద్రొక్కన్. ౪౧౯

గీ. నాల్గువందలయిరువది నయవిహీనుఁ, డుచితమెఱుఁగక లక్ష్మిశుఁ డుర్విజాము
నోహరుండని నందసూనుండు రాఘు, వుండనుచు వ్రాయుఁ గృతుల దుర్బుద్ధికలన.

క. నన్నూటిరువదియొక్కటిఁ, దన్నెఱుఁగని గర్వగరిమ దర్పకబాధల్
వెన్నునకు లక్ష్మికిని గలుఁ, గన్నిర్మింతురు ప్రబంధగతులం గుకవుల్. ౪౨౧

క. నన్నూటిరువదిరెండను, సున్నిత మెఱుఁగని కుకవి వచోవైరస్యం
బౌన్నత్యమంద నసమయ, సన్నిహితము సేయుఁ గవితఁ జప్పనిగాథల్. ౪౨౨

సీ. నన్నూలయిరువదినాల్గింటి కొక్కటి తక్కువయా వెట్టి తనరుచుండుఁ
గోకిలపైఁ గూసి కుముదమిత్త్రునిఁ దిట్టి గాలికి నెగఁబడి కంతుఁ గందఁ
బలికి చిలుకపయిఁ బండులుగొఱికి యుపాలంభ మని పరవశతఁ బ్రేలఁ
జేసి తనవికారచేష్టలు విరహుల పైఁ బెట్టి కుకవి విద్వద్వరేణ్య
గర్హితముగఁ బల్లుగాథలలోఁ గూడ, విరసవిరచనంబు విశదపఱచి
నవ్వఁబడును మూఢు నామాటవినఁ డని, మాననీయవిచారము మానసమున. ౪౨౩

గీ. నాల్గువందలయిరువదినాల్గు చెల్లఁ, దపణమునఁ బట్టినాదుల తలఁపులేక
మొట్టమొదట నష్టాదశమును బురాది, పఠనము సేయ మిగత చప్ప నయి యున్న.

శా. నన్నూటిర్వదిరైదగుం గుకవి దానంబందు రాధేయు వి
ద్యన్నన్యయ్యను గాంతిఁ జంద్రుముని సత్యంబందుఁ గౌంతేయుఁగా
వన్నెల్చి నెలపద్య మొక్కటిని జెప్పన్ దాత యుపొంగి వీఁ
డన్నట్లంతటివాఁడనౌదు నని వీడ్యంబిచ్చి లాలించినన్. ౪౨౫

శా. నన్నూటిర్వదియాఱగుం గుకవి హీన ప్రాభవున్ సర్వభూ
భృన్నాథుండ వశేషరాజమకుట శ్రేణీమణీమండలో
ద్యన్నీరాజితపాదపద్ముఁడవు నాఁ దబ్బిబ్బుగా నిక్కయి
చ్చు న్నూటు ల్గవి కాశఁ జేమిగని యంచు న్నవ్వ నావెట్టికిన్. ౪౨౬

శా. నన్నూటర్వదియేడగుం గుధని చెంతం దుష్కవుల్ నిచ్చలుం
జిన్నంబో చిదురో గ్రహించుచును నిచ్చెం గంధమాతంగసం
పన్నంబౌ నమితార్థముంచుఁ బొగడన్ వాయెట్టురా వచ్చు నిం
ట న్నారీమణిఁ జూడఁ దేటపడు బండారంబు సర్వంబు నాన్. ౪౨౭

శా. నన్నూటిర్వదియెన్మిదింటఁ గవి కాంతావర్ణనాసంగతిం
గన్నుం గాలును గేలు మోము కచముం గంఠంబు నొండేమి యె
ల్ల న్నీచంబుగ వస్త్రహీననటు లల్పంబైన శంకింప క
న్నెన్నో రీతుల వ్రాయు సాహసము గాదే యంచు ఖేదించినన్. ౪౨౮

శా. నన్నూటిర్వదితొమ్మిదౌ కవి సతింగన్నెత్తి వీక్షింప కి
ట్లున్న న్భావ మదెట్టులైన రుచిగా తన్నంచు నూహింప కుం
డు న్నీలాభ్రము కొండపై గగనముండుం గ్రింద ద్వీపంబు మీఁ
ద న్నాగం బెగఁబ్రాఁకునంచు నతివింతల్ వ్రాయున ట్లెంచినన్. ౪౨౯

క. నాలుగువందలముప్పది, శాలురకుం జదువుచెప్ప బడియొజ్జలకున్
నాలుగుబడులున్ గుణితము, చాలఁగ రావనుచు వెట్టి సంతాపింపన్. ౪౩౦

క. నన్నూటముప్పదియునొక, టన్నది నెగడును గురుఁడు పదార్థ మెఱుఁగకే
చిన్నలఁ జదివించునురా. యెన్నఁడుఁ బుస్తకము ముట్టఁడే యనిపలుకన్. ౪౩౧

క. నన్నూటముప్పదియురెం, డన్నది యొకవెట్టి యొజ్జ యమరము చెప్పం
దినెల బడులం బాలుర, కు నొన్నెరెటుతిరుగు ననుచుఁ గుందెడుచక్కన్. ౪౩౨

క. నన్నూటముప్పదయిమూ, ట న్నిసువుల కర్థమెడపడన్ గీర్వాణో
క్తి న్నేర్పుదు రయవారికి, తిన్నగ [illegible] పలుంచుఁ దికమకనొందున్. ౪౩౩

గీ. నాల్గువందలముప్పదినాల్గు బోధ, నమ్ము సరిలేక బాలుఁ డజ్ఞానమునను
బడికిఁ బోకున్న గంజిగాపడులు వేసి, మోసికొని పోదురని దుఃఖమును వహించు.

క. నన్నూటముప్పదేనది, గున్నఁడు చదువఁడని గోడకుర్చీ వేయిం
పన్నవ్వుచుఁ దలకెక్కని, తెన్నున నేర్పఁదగదంచుఁ దివురుం దిట్టన్. ౪౩౫

క. నన్నూటముప్పదాఱగు, చున్నది చెప్పనదిలేక యూరక కొట్టం
జిన్నలు పంతులుఁ గొమ్మకుఁ, దిన్నఁగ ప్రేలాడఁదీయుటిపుటం గనినన్. ౪౩౬

క. నన్నూటముప్పదేడగు, నెన్నాళ్లు పఠింప మెదటికెక్కక విసుగం
గన్నాలికోపమున గురుఁ, డన్నా కోదండమెత్తురా యనివగవన్. ౪౩౭

క. నన్నూటముప్పదెనిమిది, టన్నిలువ దె యాటవిడుపుదబ్బులకై యే
పున్నమ యమవసయును గా, కున్నను సెలవిచ్చు నొజ్జయూహల నెన్నన్. ౪౩౮

గీ. నాల్గువందలముప్పదినాల్గు మీఁద, నైదవది వెట్టి యక్షరాభ్యాస మనుచు
గిలుకలంచును సొమ్ములు గిలుబులాడు, కొంచు రిసుమంత చెప్పరు కొండొకలసు.

క. నన్నూటనలువదింటను, జిన్నంబోవుచును నిల్చి సీకంటం బం
చున్నడిపె మణుఁగునాలిక, యున్నాఁడని చదువురీతి యూరయుపోటన్. ౪౪౦

క. నన్నూటనలువదొక్కటి, యన్నది బడిపంతులగుట యతిసులభం బం
చున్నిసుఁగులతో నఱచుచు, నున్నంగని యొజ్జనవ్వ నొక వెట్టియగున్. ౪౪౧

క. నన్నూటనలువదిరెండం, టన్నరు లవ్వాని కేమిటం గొదవగు నే
తిన్నెనొ బడిపెట్టు నటం, చున్నిరసన నొజ్జతనముఁ జూచిన నిలుచున్. ౪౪౨

క. నన్నూటనలువదియుమూఁ, డన్నది నాఁటికని నేఁటి కావిధమున నే
యున్నదిరా పంతులుఁతన, మన్న మనోవ్యాధి విబుధునంటినఁ దోఁచున్. ౪౪౩

గీ. నాల్గువందలనలువదినాల్గు గుంట, యోనమాల్ వ్రాయురా యని యొక్కకేక
వెట్టి తగవర్లతో నూరిపెత్తనంబు, నడపుగురువులఁ గని పెద్దనవ్వ వెట్టి. ౪౪౪

క. నన్నూటనలువదేనగు, నన్నిగురుదిక్కృతికి జనంబులు నిందిం
పన్నెలవుచేసి విడిచిన, యన్నీరసగర్వవిహ్వృతి యనియరయుండా. ౪౪౫

క. నన్నూటనలువదాఱగు, తిన్నెలపై బడుల యొజ్జ లేరి హరికథా
భ్యున్నతిఁ బాటలుఁ బద్దెము, లన్నిలుకడ మాలి బిడ్డలను విడునేనిన్. ౪౪౬

క. నన్నూటనలువదేడగు, చున్నది హరికథలు చెప్ప చొగి గంతులిడన్
మిన్నందు నాట్యశాస్త్రము, నున్నవకవనంబు దనకునుం దొరకెననన్. ౪౪౭

క. నన్నూటనలువదెనిమిద, గున్నాటకసంఘములను గొన్నాళ్లున్నం
తన్నేన నాటకము వ్రా, యన్నిపుణుఁడ ననుభవమున నున్నాఁడిటన్. ౪౪౮

గీ. నాల్గువందలనలువదినాల్గునైదు, వెఱ్ఱి యొసలారు దేవకీవిభుఁడు దశర
థుండు రాధామనోభిరాముండు రాముఁ, డనెడు వెఱ్ఱిలు పండితు లైనకడల. ౪౪౯
క. నన్నూఱేఁబదిలో వ్రా, యన్నేరఁడు కసల ధథల నరయంగజాలం
డెన్నక రాఁ బ్రెండేటికి, సున్నలు రెండేల యనుచు శూన్యహృదయతన్. ౪౫౦
శా. నన్నూఱేఁబదియొక్కటిం జదుఁడు మానం బెట్ట నేమయ్యె నీ
సున్నల్ రేఖలు చేతగావొ పనిమాల్చున్ వ్యర్థవాదం బటం
చున్నే వీడి లిఖింతు నంచిడు విసంఘుల్ దుష్పదగ్రాహముల్
చిన్నంబోఁ డిది చేతనైన పనియో సీయుంచుఁ దానవ్వెదున్. ౪౫౧
క. నన్నూఱేఁబది రెండగు, చున్నది యెవ్వనికి నెట్టు లూహాపథముం
దున్న నదియెల్ల లోకుల, కు న్నేర్పెడునట్లు సభల గోడొనరింపన్. ౪౫౨
శా. నన్నూఱేఁబదిమూఁడగుం గుకవి గంటం బాకుఁ జేఁబూని చే
రు న్నీవింద్రుఁడ వెందు నన్నిటఁ గుబేరున్మింతు వం చర్థి పో
నిన్నేవ్వారిటు పిల్చి రంచుఁ బలుకన్నీమీఁద నేనిప్పుడే
సున్నఁజ్మాఁడిడి పట్టెచుల్లెద నటంచున్నించి వాయాడినన్. ౪౫౩
శా. నన్నూఱేఁబదినాల్గు లోభి కవికిం దమ్మంబు ధర్మంబు చే
యన్నేరం డది దోషమం చనఁగు పద్యంబొక్కటిం జెప్పినన్
నన్నేరా విషమాక్షరంబు లిడి మన్నంబాషవం చీసడిం
చు న్నేర్పాఁ గద తప్పకోలుఁదనమంచున్నవ్వు నావెఱ్ఱియా. ౪౫౪
శా. నన్నూఱేఁబదియైదు తొల్లినృపులం బాండిత్యవైదగ్ధ్యసం
పన్నుండే చని కోరువాఁ డతనికిన్ మన్నించి కావ్యంబు లీ
యన్నిర్వాహకమాచుసుండె నిపు డోయన్ సర్వలుం గోరుచుం
బన్నంబు ల్వడుప స్మగించుకొని రావ్యాపాగమం చెన్నినన్. ౪౫౫
శా. నన్నూఱేఁబదియాఱగున్ ధని కవి న్నారీతినే కష్టివై
న న్నీకీగతి పట్టదంచుఁ గవివైన స్మష్టియా పొమ్మనన్
విన్నంబాటునఁ బోవుచున్ హరిహరీ విద్వాంసు నీకాలమం
దున్నిర్మించితి వేల యాచకులు చోఁ దోతెంచు వెఱ్ఱింగనన్. ౪౫౬
శా. నన్నూఱేఁబదియేడగుం జగతిలోన స్వామ నల్లుండు నా
కెన్నండున్ బహుమానమీయ వని దౌహిత్రు న్విచారింప వం
చున్నీకూఁతున కంగదంబు లిడవంచుం బెట్టు కష్టంబు ల
ల్కన్నానాఁటికి బెట్టు పట్టుగలుగం గావ్యంబులై మంచునన్. ౪౫౭

శా. నన్నూనేఁబడియెన్నిదో సతతము న్నాకేమి యు న్నాను యీఁ
డున్నన్ లాంఛనముల్ త్యజింపఁ దగవె ట్లోహో జనుల్ నవ్వరా
నన్నుం బిల్వఁడు రాక కోక యనఁ డన్యాయ్యం బటంచు న్సదా
యెన్నోరీతు నల్లుఁ డెప్పుడును గర్హింపం గనుంగొన్నచోన్. ౪౧౮

శా. నన్నూనేఁబదిలో న్మిహో జగతిలోనం గల్గునాచారముల్
సన్నంబో నిఁక నల్లుఁడన్న పదమే స్వారస్యహీనం బగున్
వన్నుం బట్టి యకీర్తి నాకగునె పూనం బొమ్మటన్నట్లు పె
ట్టు న్నానావిధబాధ లల్లుఁడని యెవ్వ స్వెట్టి చింతించినన్. ౪౧౯

శా. నన్నూటర్వది నేను గాశికరుగం గా నుంటి శీఘ్రంబుగా
నిన్నూ అంపుఁడు మంచితోడుగల దీరేని స్సరే నేఁటితో
నన్నున్ విస్మృతినొందుఁ డాత్మజను మీనారాయణం బంపి మీ
రెన్నండేఁ గొనిపొందు మానుఁ డని యేమేమేని రజ్జించినన్. ౪౨౦

క. నన్నూటర్వదియొక్కట, గుస్నేనిదివఱకు నల్లుగుణము లవెల్లం
జిన్న యొకపొత్త మమరిచి, యు న్నేఁడిటుఁ బల్క దాని యుచ్ఛ్రాయ మడఁగన్.

శా. నన్నూటర్వదిరెండగు న్నరులలో నానావిధంబై వచిం
ప న్నల్వు ర్వనిలేనిపాటు యుడికింపం గింకచేఁ దిట్టుబల్
సున్నం బంచన నూదినా కల మనల్ సోలన్న నందేమి యో
తన్నన్నట్లు స్వనీచకార్యస్మృతిచేతం గొంద ఱల్లాడినన్. ౪౨౧

శా. నన్నూటర్వదిమూఁడగుం బలుకుచో నానావిధాభ్యాసముల్
విన్నావా మఱియేమి కావునను గోవిందా కుడా నేను జె
ప్పన్నీకర్థముగాదె చూడు మిదిగో బాగున్నదా యోయి వ
చ్చిన్నీ దైవముమేలుచేయు నగునా చెప్పుండు నా నెల్లెడన్. ౪౨౩

సీ. నన్నూటయిరువదినాలుగగును దురభ్యాసముల్ నరులు జిహ్వాతుదగఱచి
కొనుట మీసంబులు గొఱుకుట యెడమచేవాసనచూచుట వాతెఱ యుగి
లించుట గోరులు లీలగాఁ బంటనొక్కుట గోళ్లు మీఁటుట కూరుచుండి
పాదమాడించుట పలుమాఱుచంకలోఁ దొడలోనఁ జేపెట్టి పుడికికొనుట
బుజమెగురవేఁత కన్నుగిర్పుటయు మిటక, గించుటయు గొంతుకను సవరించుకొనుట
ముక్కునొక్కులు చిటికెలు ముక్కుటయును, గలము చెవినిడి త్రిప్పుట గఱచుటయును

శా. నన్నూటర్వదియైదగుం దెలివి భగ్నం బయ్యె వాక్శుద్ధి యు
త్సన్నం బయ్యె మనస్సు నిల్వకయ మంత్రంబుల

సన్న్యాసము చేయ నార్తులకు రక్షగట్టి నుప్పించు నూ
ప న్నేత్రాంజనంబు లిడ నేత ద్రీతిఁ దాఁ జెడ్డవాఁడా. ౪౧౫

శా. నన్నూటర్వదియాఱగు స్వనములోనం గల్గు వేర్వేల్లతుల్
చొన్సు స్వాండిని తాగి భస్మముగ నేర్పు ల్మీరఁ గావింపఁగా
మన్నుం బంగరు సేయనచ్చు నని కొంపల్గుల్లగా సర్వముల్
సన్న్యాసు ల్గొన సేన్పువారి ముఖవాసన్నూర్తి యావెఱ్ఱికిన్. ౪౧౬

శా. నన్నూటర్వదియేడుగా పఱలు బంగారం బ్రకల్పింపవా
రున్నారా సుగరాము నమ్మకు మనకా హుం లేకపోలేదు వా
రున్నారంచును విశ్వసించు నెపుడే నొక్కండు తద్రీతి సా
ధ్యాసన్నత్యమ్మును గన్నవానిఁ గన కాకాంక్షించుచు న్వెఱ్ఱిగాన్. ౪౧౭

శా. నన్నూటర్వదియెన్మిదై చను సువర్ణప్రక్రియ ల్గల్లుచో
సన్న్యాసు ల్మిముఁ జేరనేల యెపుడే సంసారిసావాస మే
లన్నం బాములవాఁడు రూప్యములఁ జేయన్లేనొ వాఁ డట్టివిం
గొన్నం జేతను నిల్వ వట్లగుట లో కుల్పాంపఁ గాంక్షింత్రనన్. ౪౧౮

క. నన్నూటర్వదితొమ్మిద, గున్నీ యోగంబు రాళ్లకున్మొక్కినఁ బో
వన్నేరదు దరగాకడ, కున్నదుపుమటంచుఁ జెప్ప గురునమ్మినవాఁడా. ౪౧౯

క. నన్నూటడెబ్బదగుఁ దా, నున్నది యని నమ్మి చేయు నొకయుప్పుం జే
కొన్నదిలే దని తెలియక, యున్నది ముందనుచు వెఱ్ఱి నూఁగాడంగన్. ౪౨౦

క. నన్నూటడెబ్బదొకటగుఁ, బన్నగములు గఱవ నరుల బ్రదికింతు ననం
గొన్నారె వారిమాటల, నున్న న్సత్యంబు విడుతురో బుధులనఁ డేన్. ౪౨౧

క. నన్నూటడెబ్బదియాఱిం, డన్నది జ్ఞానోపదేశ మని యజ్ఞానుల్
కన్నియల మోసపుచ్చుటఁ, గన్న న్నిన్నకయ యుండుఘను నలమితొనన్. ౪౨౨

క. నన్నూటడెబ్బదియుమూఁ, డున్నది వంచనపుపేర నుద్రిక్తముగా
నెన్నివిధంబులఁ జెప్పిన, నున్నానని తోఁచు ముగియకుండఁగ నెందున్. ౪౨౩

గీ. నాల్గువందలడెబ్బదినాల్గువర్త, కమునఁ గ్రయవిక్రయంబులఁ గలుగుతూని
కలను గొల్తలమోసము ల్గలగలపులు, మాటమెలఁకువలును నిందు మాటుకొనును.

క. నన్నూటడెబ్బదేనుగ, మన్నుం బెడ్డలును గలిపి మంచి వటంచుం
గన్నులుగట్టు బెహారుల, సన్నిధి నెల్లపుడు నిలుచు సాధారణమై. ౪౨౫

క. నన్నూటడెబ్బదాఱగు, చున్నది యొకదానిఁ జూపి యొక టిచ్చుటలో
నన్నదుల కెఱుకపడకుం, డన్నేర్పున మోసగించువాఁ డల[illegible] ౪౨౬

క. నన్నూటడెబ్బదేనగుఁ, గొన్నప్పుడు మంచిదిగను గొనిపోయినయం
తన్నీచుకంపుగొట్టెడు, విన్ననువున సరకులమ్మ వేరుల నేర్పన్. ౪౭౭

క. నన్నూటడెబ్బదెనిమిది. యన్నది మన మమ్మఁబోవ నడవియుఁ గొనఁబో
వన్నీరసంపుఁ గొఱవియు, నన్నట్టులు చేయు పెట్టి వ్యాపృతి యయ్యెన్. ౪౭౮

క. నన్నూటడెబ్బదికిఁ బయి, నన్నవపరిమితము వెళ్లె నష్టము నష్టం
బున్నను మీకిత్తు నటం, చు న్నిజభావమున కెచ్చుచొప్పన నమ్మన్. ౪౭౯

క. నాలుగువందలయెనుబది, కోలం గొను నమ్ము దాని సుంకెత్తునకున్
వ్రాలఁగఁ ద్రప్పకోలం గొను, గోలును మసకమ్మ బోడకొలచేరంబున్. ౪౮౦

క. నన్నూటెనుబదియొక్కటి, సన్నసె వచ్చినది సరకు నీకొఱకై వేఁ
డిన్నాళ్లు చూచెద వాడుక, యున్నప్పుడు పరుల కమ్మనోప నటన్నన్. ౪౮౧

క. నన్నూటెనుబదిరెండగుఁ, గొన్నవెలకె యమ్ముచుంటిఁ గ్రొత్తసరకు రా
నున్నది స్థలసంకోచం, బన్న భయంబనుచు కట్టినుస్సున నొసఁగన్. ౪౮౨

క. నన్నూటెనుబదిమూఁడగు, చున్నది పెస లడుగ మంచియూలువలు గలవం
చున్నూసె యడుగ నామున, మున్న చటంచును వచించు యుక్తులయందున్. ౪౮౩

క. నన్నూటెనుబదినాలుగు, సొన్నారియు ముచ్చె సాలె సొరిది స్వకృతులం
దున్నె బపు మోసకృత్యము, లన్నానాగతులఁ జూడ లక్ష్యం బబ్బున్. ౪౮౪

క. నన్నూటెనుబదియైదునఁ, బొన్ననఁ బిత్తళియు రాగి పొదగుబలో నా
విన్నాణంబులు విశదము. గు న్నరులకు లక్కగేదెగొడవలు విన్నన్. ౪౮౫

క. నన్నూటెనుబదియాఱగు, చున్నది మనమిచ్చినట్టి సుస్నిగ్ధపుఁదో
లు న్నాఁచికొనుట యెట్టులు, మన్నను మాదిగలు పెట్టి మాటుటగనినన్. ౪౮౬

క. నన్నూటెనుబదియేడగు, సన్నివపత్రములు నేయ సంచకరం బీ
యన్నేసి తెచ్చి దుప్పటి, కన్నులు సాలీఁడు పులుముకాలంబునకున్. ౪౮౭

క. నన్నూటెనుబదియెనిమిది, మున్నే యెఱిఁగియును మోసపోయిన జనమీ
యన్నివిధంబుల పనివాం. డ్ర న్నేరిచినట్టివారు ప్రహసింపఁగన్. ౪౮౮

క. నన్నూటెనుబదితొమ్మిది, పన్నగఁ బైగతులఁ బరుల వంచించుటగా
కెన్నితెఱంగులో యిలలో, నున్నవి తముదామె మోస మొనరించుకొనన్. ౪౮౯

క. నన్నూటతొంబదియగుం, గన్నులు గలిగియును నంఘుగతి నటియింపం
గన్నడవఁగలిగి యవిటి న, టన్నన్ ధనకాంక్షఁ బొట్టకై లోకమునన్. ౪౯౦

క. నన్నూటతొంబదియునొక్క, టన్నది కాసునకుఁ బాము నటుతం దాల్పన్

మన్నెత్తి నోటఁగొట్టుకొ, నన్నెత్తిని గోతు లిడికొన న్నిగ్గిఁడియై. ౪౯౧

క. నన్నూటతొంబదియుమూఁడు, పన్నది మండ్లపయిఁబండి యాడలఁ గుంప
ట్లన్నిలిపికొనుచు డబ్బున, కన్నరులాడఁబడుట తెలిసికొనఁబడు నెందున్. ౪౯౩

క. నన్నూటతొంబదియు మూఁ, డన్నది తల యిసుకలోన నడఁచికొనుట మీఁ
దన్నిపస్తుల ప్రాయివెట్టుట, యెన్నియు లాడితెండు కడుపు హేతువున నగున్. ౪౯౩

గీ. నాల్గువందలతొంబదినాల్గు వెఱ్ఱి, తిండిలేకున్న నొకమూలఁ దెండి చావ
కంగనయుఁ దాను వెలువడి యంగడులకు, సూత్రపాషాణబంధనాపాత్రు నొందు. ౪౯౪

క. నన్నూటతొంబదైదిటఁ, దిన్నని యంగములు విఱిచి తికమకగా ని
ల్చి న్నాలుక శూలముగ్రు. చ్చి న్నిడుపగు కత్తిఁ గుక్షిఁ జొనుపుకొను శివా. ౪౯౫

క. నన్నూటతొంబదాఱిట, నెన్నన్నియు తాళ్లు క్రిందు నేడుశిలంబుల్
ది న్నేత్రంబుల నూదులి, డు న్నాసామార్గమునఁ నిడుకొను న్నేకుల్. ౪౯౬

క. నన్నూటతొంబదేడగు, దన్నది యాచనకు నాశ కొకయం తనిలే
కున్నను దరిద్రు స్థితి సం, పన్నున కెఱుకపడకున్నపట్టున జగతిన్. ౪౯౭

క. నన్నూటతొంబదెనిమిది, యి న్నెటి యాచనకుఁగాక యేసిద్ధుఁడ నం
చున్నిఖిలవస్తువులుఁ దిను, చు న్నగరములందు సభలఁ జొచ్చునరులదొ. ౪౯౮

క. ఏకోనపంచశతమగు, నేకారుట ధనికుఁగాంచి యీరస మెత్త
న్నాకింత యీయఁ డడిగిన, నేకృతి కడుగక యొసంగు నీతం డనినన్. ౪౯౯

క. ఏనూఱుభాలుచు లబ్ధుం, డీనేరం డరుదెవులున నెత్తి నవరుచుల్
దానైఁ దినం జాలఁడు, వీనికి నర్థికిని గలద భేద మ్మనుచున్. ౫౦౦

ఇది పంచమశతకము.

---

షష్ఠశతకము.

గీ. అయిదువందలయొక్కటి యఖిలరోగ, ములకు నొక్కటియేమందు మూలికాన్వి
తంబు సిద్ధోపదిష్టంబు తమయు మించు, వేగిరింపుఁ డటంచనునెజ్జువెఱ్ఱి. ౫౦౧

గీ. అయిదువందలరెండు దివ్యౌషధంబు, రాజ్యమును నిల్పె నిది యొకరాజునకును
బుత్త్రుఁ డుద్భవమయ్యె నపుంసకులకు, వంధ్యలకు సేవ్యమను వెఱ్ఱివైద్యునందు. ౫౦౨

గీ. అయిదువందలమూఁడు మాయౌషధంబు, వెల సరస మొక్క నెలదిని ఫలములేక
పోయినను మందుఁబంపించవేయుఁ డిచ్చి, పంపెదము మీధనం బనువైద్యువెఱ్ఱి. ౫౦౩

గీ. అయిదువందలనాలు గీయమృతతుల్య, సిద్ధసంకల్ప మేమియుఁ జేయు దెంత
దిన్న రుచ్యము [illegible] నరయడు గూఢార్థ ఘనుడు. ౫౦౪

సీ. అయిదువందలరైయగు వంటౌషధంబు. నూఱువత్సరములకిందనూజీవీడు
ప్రభువుచేయించె నేనుసంగ్రహముచేసి, నాఁడనని నల్లనుట్టియుండల నొసంగ. ౫౦౫
సీ. అయిదువందలయాఱు మాయయ్యతాత, చేతఁ జేయించినారు మాజేటివారు
డబ్బుకక్కుతిని మీకడకును దెచ్చి, నాఁడ నన నెత్తుకొయి మందమతి గొనిన.
సీ. అయిదువందలయే డిది యష్టమూర్తి, యొక్కమూలను గోసిన నొక్కరోగ
మునకు మందని యెనిమిదిమూల లున్న, రంగుజాతిని జూపునాగ్భటము నమ్మ. ౫౦౭
సీ. అయిదువందలయెనిమిది యడుగడుగున, కొక్కశ్లోకంబు చదువుచు నూబిలోనఁ
జానకము గల్పి యమ్మి కుపాకిప్రేటు, నతను దొరకని వైద్యువంచనకుఁ బట్టు. ౫౦౮
సీ. అయిదువందలతొమ్మిది యధికునాశ్ర, యించి నీమూలమునను జీవించునాఁడఁ
గాగితము వ్రాసియిమ్మనఁ గాలఁదన్న, కగుఁగదా యని యట్లిచ్చు నతనిఁబట్టు. ౫౦౯
సీ. అయిదువందలపదియగు నస్మదీయ, మాతులులు వాగ్భటుని మేనమామకొడుకు
లకును మిత్రులు నాఁటిలోలంబరాజు, నాకు సాక్షాత్తు తాత యన్రజ్జులాడ. ౫౧౦
సీ. అయిదువందలపదునొకం డగును వైద్య, నిరుగుపొరుగుల వసియించు హేతువున నె
వేత్త నని విఱ్ఱవీఁగుచుఁ బేరులమ్మి, పొట్టపోసికొనంజూచు పురుషునంటి. ౫౧౧
సీ. అయిదువందలపండ్రెంట వ్యాధిసుర్తు, పట్టఁజాలఁడు మాత్రకుఁ బాళి మెఱుఁగఁ
డెఱుఁగఁడు విఱుగుడులు దీని కెంతసేప, టంచు బలురోగముఁ గుదుర్ప నడ్డువచ్చు
సీ. అయిదువందపదుమూఁడు హానికరము, లైన నాభిని ఖర్జూరమనుచుఁ బసుపు
కొమ్ము రీతిని బాషాణము మ్మదించి, యొకరనిద్దఱఁ జంపి వైద్యుఁ డగు నేని. ౫౧౩
సీ. అయిదువందలపదునాలు గగును శిష్యు, గొట్టముం దెమ్మనెడు వైద్యకోవిదుండు
మసల శతమారియు సహస్రమారి యగుచు, శమనునకుఁ గొంత చేయూఁత సల్పెనేని
సీ. అయిదువందలపదునైదునందు వైద్యు, నార్త లడిగెద రేరోగ మనుచుఁ గాక
దారుణము తగ్గుటకుఁ గాను దరుణభాస్క, రమ్ముఁ గేర్పఁడటంచుఁ జిత్రమ్ముగాఁగ.
సీ. అయిదువందలపదునాఱునందు రోగి, నిన్నఁ గాఁకరకాయలు దిన్నకతన
శ్లేష్మకారకమయ్యెను శీతభేది, నల్లపొట్లమ్ము లిమ్మను నాటువైద్య. ౫౧౬
సీ. అయిదువందలపదునేడునందు వ్యాధి, దొరకువఱకు కోహటించు సందుగ నపథ్య
ములను జేయుదు రెవరి నేఁ బిలిచికొందు, తీయమందులుఁ లేవని తిరుగఁబడిన. ౫౧౭
సీ. అయిదువందలపదునెన్మి దందువేసి, కొన్ని చేతులు చాలించికొన్న పిదప
నేను జేపట్టి యొకమాత్రలోనె లేవఁ, దీసినాఁడ నటంచును దెల్పుచోట. ౫౧౮
సీ. అయిదువందలపందొమ్మి దల్పరోగ, మైనఁ బెద్దగఁ జెప్పి నే నౌషధంబు
చేయువలయును దెమ్మని చిల్లరగను, దినదినంబును గడియించు తెరువునందు. ౫౧౯

గీ. అయిదువందలయిరువది యగును దీని, కెంతసే పింతలోనఁ దగ్గింతు దోష
పంచితంబును దచ్చెదఁ బట్టి రాక, లిండనుచు గుంజుకొనిన వైద్యుండుధనము. ౫౨౦
క. ఏనూటిర్వదియొక్కటి, దీనికి భయపడకుఁ డేను దెలిసితిఁ గిటు కి
ద్దానికిని మందుఁ జేసెద, మానినపిద పిండు రండు మాపటి కనినన్. ౫౨౧
శా. ఏనూటిర్వదిరెండగుం బెరటిచెట్టెన్నండు మందౌనె నే
న్లేనా ప్రక్కనె పెద్దపేరుగలవానిం బిల్చినా రారయం
చానాఁడే యనుకొంటిఁ జూచితిర నాహస్తంబు మందెంత యే
గానింజేయుదు చేతినాడె మది ముఖ్యంబంచు బేరంబిడన్. ౫౨౨
శా. ఏనూటిర్వదిమూఁడు దాంభికులు మీ మ్మేమార్చి రీవ్యాధికై
యేనాఁడో యొనరించి దాఁచినవి దా మింతైనఁ జేయంగలే
వానాఁ డప్పుడె నూతి వేయఁదగు వైద్యంబన్న సామాన్యమా
నేనీమాడకె మేడగట్టెదనె పోనిం డంచు వంచించినన్. ౫౨౩
శా. ఏనూటిర్వదినాలుగౌ వలదు నేనీచోటికి న్రాను పొం
డె నాబోఁటియె నాకుఁ జిక్కఁగలఁ డేనిన్నాళ్లుగా నుండినన్
నేనెట్టిండనొ కొంత చూచినను దానేరాఁడె మిమ్మంపుటల్
నేనేదో పనిమీఁద బోయితి ననుండీ యంచు భాషించినన్ ౫౨౪
గీ. అయిదువందలయిరువదియైదు సంచి, కట్టునకు శాపమున్నది గడియగడియ
కెల్లచోటికిఁ బోఁగూడ దెల్లివత్తు, నవసరంబైన రాత్రిరం డనుచుఁ బలుక. ౫౨౫
గీ. అయిదువందలయిరువదియాఱు రేపు, సంతలోన గ్రంథ్యాణపుసరకులు గొన
వలయు నేమైననిండు మీజ్వరమునకును, మందు కలువానవైచితి నందు రేని. ౫౨౬
క. ఏనూటిర్వదియేడగు, మానాయన యాజ్ఞ, బేరమాడను బియ్యం
బీనాఁటి కుండు రాత్రిరి, నేనూరికిఁబోదు నింట నీవలయు ననన్. ౫౨౭
క. ఏనూటిరువదియెనిమిది, యౌ నాచేనూత్ర-యమృత-మగునది నిన్నన్
వేనూటి చేసి యుంచితిఁ, గానీ యది యొకరికొఱకుఁగా నని బొంకన్. ౫౨౮
క. ఏనూటిరువదితొమ్మిది, నేనందును గోపపడకు నీరసపడినా
వీనాలేహము దినరా, దా నీవే మీయఁగలవు-ధర్మమున కనుచ్. ౫౨౯
గీ. అయిదువందలముప్పది యన్నిరోగ, ములకు దీని నె లోనికిఁ బుచ్చుకొనిన
వజ్రదేహంబు గాదొకో వట్టినోటఁ, దినిన నిర్బాధకం బని తెలుపు నపుడు. ౫౩౦
శ. ఏనూటముప్పదొకటగుఁ, దానొక్కరి కీయవలయు దానిం దీర్పం
డీనేరఁదు [illegible] మ్మను, పూని యొరునిదిట్టు నతనిపోఁడిమి యొందున్. ౫౩౧

గీ. అయిదునందలముప్పది యవల రెండు, వెలయు నొకవెట్టి తనతప్పు వెలికిఁదోఁప
కుండఁ గప్పుచు నొరుతప్పు లుబ్బక యెన్ను, తీర్పరులఁ బట్టుకొని యతితీవ్రముగను

క. ఏనూటముప్పదియుమూఁ, డౌను గురుండనఁగ లేక యభ్యాసముచేఁ
జానే తనంతవాఁ డగు, నానిపుణుం డైన చోరునం దగుధృతికిన్. ౫౩౩

క. ఏనూటముప్పదియునా, ల్గౌ నెవ్వరిఁ జూడకుండ నతని కతండే
పో నేర్పు నంధకారము, లో నొక్కరుఁ డెఱుకలేని లోయలనడువన్. ౫౩౪

క. ఏనూటముప్పదేనగు, నేనాఁటను బడులు లేవు హితగురువులు తే
రేనోట వినునొ నేర్పులు, స్తేనుం డతినిపుణుఁ డగుట తిలకించినచోన్. ౫౩౫

క. ఏనూటముప్పదాఱగు, నేనని యొరులకును జెప్పకే దొంగయుఁ దా
మానవుని పగిది మెలఁగును, నానావిధచౌర్యములజనము వంచింపన్. ౫౩౬

క. ఏనూటముప్పదేడగు, నేనిమిషమునందు దొంగ యేయింటికిఁ గ
న్నానం బోదును మఱిగు, మ్మాన న్వచ్చెద నటంచు మతియించు కొనన్. ౫౩౭

క. ఏనూటముప్పదెన్మిది, యౌ నొక్కనిమించి యొక్కహర్త వినోద
శ్రీ నెఱపి పట్టపగలే, గానంబడ కిల్లవస్తుగణము హరింపన్. ౫౩౮

గీ. అయిదువందలముప్పది యైనవెనుక, తొమ్మిదగుఁ గన్నపుంగత్తి దొరకువడక
యుండుకతమునఁ గన్నగాఁ డొక్కనాఁడు, గత్తి మఱవఁడటం చనుగాథ పుట్టె.

గీ. అయిదువందలనలువది యన్నియెడల, వెలయును బ్రదర్శనంబు లెవ్వాలనఁ జూప
రద్భుతంబుగ సంధిసేయంగ నొదుగు, కత్తి యిట్టిదటంచుఁ జిక్కకయ యేము.

క. ఏనూటనలువదొక్కటి, గా నేఁజూచితిని మద్దికాయవలెనె ము
క్కోనములు చేరుఁ జివరను, జేనెఁడు బెత్తెఁ డగుఁగత్తి చిత్రంబన నా. ౫౪౧

క. ఏనూటనలువదియురెం, డౌ నొక్కఁడుఁ గత్తిఁజూడ కాలోచనపై
నానాగగనాపసథము, లానైపుణిఁ గట్టఁ జూచి తంచు వచింపన్. ౫౪౨

క. ఏనూటనలువదియుమూఁ, డౌ నూతనచోరుఁ డాయుధావాప్తికినై
మానెఁడుబొగ్గులు డబ్బుల, తో నిశఁ గొలిమినిడిచనుఁ జతురత మెఱయనాన్.

క. ఏనూటనలువదియునా, ల్గౌ నలకమ్మరియు నుదయమైనం గని యె
వ్వానికిఁ దెలియకయుండం, గా నొనరిచి యిడును రాత్రి కమటమున ననన్. ౫౪౪

క. ఏనూటనలువదైదగు, నే నెటి నొరులెఱుఁగకుండ నీపనిచేయుం
దా నలకమ్మరి యని యెవ, రేనిం దలఁతురొకో యనుచు నేడ్చెడు వెట్టిన్. ౫౪౫

గీ. అయిదువందలనలువదాఱగును బెద్ద, పులియదిగొ నన్ను నిదిగొ నీవలది లొంక
యు సెడువారలెగాని యీయవని వాస్త, వంబు నరయ రటంచని వసదువెట్టి. ౫౪౬

గీ. అయిదువందలనలువదే డగుసుదొంగ, తనకు నలరాత్రి కడుఁ బ్రేమఁ దల్లిపోలె
దఱిని రక్షించు దొంగలతల్లి కేద్వ, భయ మటంచన వీడ నపాయమునను. ౫౪౭

క. ఏనూటనలువదెనిమిది, యా నిసి నొకపిథికేఁగి యరసెడుచోఁ దే
లూనంగుట్టిన నేడ్చుట, మాని కృశింపంగ వెఱ్ఱి నుఱికేఁగినయేనిన్. ౫౪౮

క. ఏనూబదియేఁబదికినొక, టూనంబగు వెఱ్ఱి యెన్నియున్నను ధనమే
గాని స్పృశింపనిదొంగను, మానుగ సమయమది యొక్కమాటు భజింపన్. ౫౪౯

గీ. అయిదువందలయేఁబది యగును జేఁక, టిని బరులయిండ్ల వెనకి పెట్టినది తీయు
చాడ్పునను సర్వమును గొని చప్పుడేమి, చేయకయ చనుచోరుని చిత్రచర్య. ౫౫౦

క. ఏనూటేఁబదియొక్కటి, యా నుద్యోగములు లేవొ యధికారము లే
దో నమలరాదొ పుల్లెలు, చీ నిసియం దర్థహరణచింతలు తెగడన్. ౫౫౧

క. ఏనూటేఁబదిరెండగు, నానో కావో యటన్న యర్థంబునకై
నానాబాధలు చీఁకటి, లోనంబడి యేడ్చునే ప్రలోభము కలిమిన్. ౫౫౨

క. ఏనూటేఁబదిమూఁడగు, నానుం గనుదృష్టి యంజనాదికమున నం
ద్రైనను భటులకు దొరకక, పోనుండవె మందులనుచు బోధించెడువోన్. ౫౫౩

క. ఏనూటేఁబదినాల్గుం, గానెన్నుదు రుల్కవడెడు కాలంబునఁ గా
లూనినచోఁ గలయిసుమును, బొనుపుపైఁ జల్లి స్వపితు వంచింతురనన్. ౫౫౪

క. ఏనూటేఁబదియైదగు, గానంబడినట్టి వస్తుకాండం బెల్లం
దానుగొని యెట్లుదాఁచునో, యేనెరి సొమ్ముగనొ యంచు నెంచెడునేనిన్. ౫౫౫

క. ఏనూటేఁబదియాఱగు, మానిసి చడివట్టి గోడమాటున డాఁగం
బో నూతఁబడిన చోరుని, కానాఁడును బుద్ధిరామి కార్పణ్యముగాన్. ౫౫౬

క. ఏనూటేఁబదియేడు ని, శానాథుఁడు గ్రుంక సర్వసాహసముల మా
ర్గానఁబడి "బడితివాద్యవి, ధానమున" న్నగులదోఁచు తస్కరుచర్యల్. ౫౫౭

క. ఏనూటేఁబదియెన్మిది, యానొకరిద్దఱను గ్రామమంతయు దు
ర్మానమాననిందవడు లో, కానం గ్రహచారమనుచుఁ గలఁగెడునేనిన్. ౫౫౮

క. ఏనూటేఁబదితొమ్మిది, యా నుత్సవములను బగటియందే ముచ్చున్
మానుగఁ దిరుగుటఁ జూచియు, మానమి నిశ నట్టివని ప్రమాదం బనుచున్. ౫౫౯

క. ఏనూటఱువదియాబరి, కానిం గొని బ్రదుకు నానగండల బ్రదు కి
స్సీ నిందకు నిలయమ్మగుఁ, దానును దత్సలముకతనఁ దామసి యగుటన్. ౫౬౦

క. ఏనూటఱువదియొక్కటి, యా నొక్కొక నెలఁత యత్త పెట్టిననగల
స్థానమున నపహ... ...స్మ... ...సవచినన్. ౫౬౧

క. ఏనూటయుపదిరెండగు, జ్ఞానాపేతమగు శిశువు కాయంబున వి
జ్ఞానులు నగలందొడిగి య, ధీనము గావించిరేని తెక్కలిగమికిన్. ౫౭౨

క. ఏనూటయుపదిమూఁడగుఁ, బూనిక నొరుబిడ్డ ముద్దుముచ్చట లని దు
ర్జ్ఞానులు గొని యొడలంగల, వానిని హరియింప నర్థవాంఛానిరతిన్. ౫౭౩

క. ఏనూటర్వదినాల్గగు, మానిను లొకకొంద ఱరవుమార్గము గాఁగన్
నానాభరణంబులు గొని, స్తేనులు హరియించి రనుచుఁ దెల్పిరయేనిన్. ౫౭౪

క. ఏనూటయువదియైదగు, నేనాఁడును నెరవుదెచ్చి యిడికొను టది లే
దేని న్మర్యాదకు వెలి, తానో యొరవులవి బరువులన నెఱుఁగరొకో. ౫౭౫

గీ. అయిదువందలయిరువదియాఱు పగటి, చుక్క లేచుక్కలను బోలుచోరు లవని
మాటలనె మోసపుచ్చు కైలాటకాండ్రు, వర్తకులు వారిప్రక్కఁ బోవఁ గడువాని.

గీ. అయిదువందలయిరువదే డగుచు సూత్ర, ములును సంధులు నర్థసముచ్చయములు
బహుళపక్షాగమంబులు స్వార్థపరత, లెన్న మ్రుచ్చిమి వ్యాకరణోన్నతిఁ గను.

క. ఏనూ ర్వదియెనిమిది, తానొక్కనియొద్ద నేర్చి తనకంటె గురున్
హీనునిగాఁ జెప్పుచుఁ బ్ర, జ్ఞానష్టిం దిరుగు మోసగానిం గలఁచున్. ౫౭౮

క. ఏనూటయువదితొమ్మిది, గా నొక్కనిప్రక్క హంసకాకీయోపా
ఖ్యానముగ మెలఁగి కన్నులు, గానక భుక్తాలయంబు గర్హింపనగున్. ౫౭౯

గీ. అయిదువందలడెబ్బది యగును గురువు, గారు మర్మముచేసిరి కాంచి వెలికిఁ
దెల్పుచున్నాఁడ రండని తెలివిలేని, పనుల ధనమార్జనముచేయు పలుగువెట్టి. ౫౮౦

క. ఏనూటడెబ్బదొక్కటి, యా నొక్కనిఁగూడి వృద్ధినంది యనిశమున్
వేనోళ్ల నతనిఁ బొగడుచు, నేనూహలు మార్చికొంటి నిపుడని తెగడన్. ౫౮౧

క. ఏనూటడెబ్బదియురెం, డొ ననవసరమని విడువ నాచార్యుఁడు నే
నేనిపుణతఁ గనిపట్టితిఁ, గానియెడం జగతి లోటుగాదే యనినన్. ౫౮౨

గీ. అయిదువందలడెబ్బదినంటి మూఁడు, పాలుచుఁ గనువెట్టి నరు వెనుపోటుగాఁగ
దృష్టిదోషాఖ్య మది యెన్ని యేని తెలుఁగు, లగుచు గొన్నింటి వివరింప నవసరంబు.

క. ఏనూటడెబ్బదియునా, ల్గౌను సదాపరగృహముల నట్టాడుచుఁ ద
ద్దేనువులనొ మానవులనొ, పూనికఁ గన్నెత్తిచూచి పోఁదలఁచు నెడన్. ౫౮౪

*గీ. అయిదువందలడెబ్బదియైదు కంటి, దెబ్బ తప్పిననుం గంటిదెబ్బ తప్ప
దనెడుసామెతగా విషచూత్కు లరసి, లేని జెడుఁ గొన్నివస్తువుల్ వృద్ధిలేక. ౫౮౫

---

* కంటిదెబ్బ=ఉాతిదెబ్బ-కంటిదెబ్బ—కన్నుదెబ్బ.

గీ. అయిదువందలడెబ్బదియాఱు కంటి, కంటెఁ జేలాఁకు చెడ్డది గలదు పాదు
కాయ యొక్కండుగోసినఁ గాయ దింకఁ, జీడపట్టును మిగులఁ బ్రసిద్ధ మిదియు.

గీ. అయిదువందలడెబ్బదే డగును చాఁలు, పితుకుచుండంగఁ జూడఁ జేఁపినది మనలఁ
జేయు నెగఁజేఁపు క్రిందను చెడును గొడ్డు, చిట్టెఁడీయదు గంపెఁడుచిట్టు దిన్న.

క. ఏనూటడెబ్బదెనిమిది, యూ నొక్కనిదృష్టిపడిన నావుపాదుగులో
మానెఁడుపాలకు నడ్డెఁడు, గానంబడు రక్త మిదిప్రకాశము జగతిక్. ౫౬౮

క. ఏనూటెనుబదియొక్కటి, యూను గొఱంతగఁ బచించు నవసరముల నె
వ్వానిదొ కన్నుపడంగను, బోనది నీరుగనొ పెద్దపుర్వులుగానో. ౫౬౯

గీ. అయిదువందలయెనిమిది యగును జిత్ర, దృష్టి తాఁబెట్టు నన్నంబుఁ దృప్తిగా న
మృతసమానముగా నేరికేని నొరులు, పెట్టునది చూడ నోపదు వెఱ్ఱితల్లి. ౫౭౦

క. ఏనూటెనుబదియొక్కటి, యూ నేత్రముకంటె మిగుల హస్తముకంటెన్
మానవుఁడదర్శనంబున, జానొక దోషంబు సర్వసామాన్యముగాన్. ౫౭౧

క. ఏనూటెనుబదిరెండగు, నేనూరికిఁ బోవునపుడు నీవెదురైనం
గానేరదు కార్యం బని, మానసమునఁ బుట్టుశంక మఱే యట్లయగున్. ౫౭౨

క. ఏనూటెనుబదిమూఁడగు, నేనీదినమునను లేచి యెవ్వారిమొగముం
గానంగానో యి ట్టవ, మానం బయ్యెనని చెప్పుమాటలు వినినన్. ౫౭౩

క. ఏనూటెనుబదినాలుగు, మానవదర్శనముకంటె మాటలదోషం
బౌను బ్రయాణముపట్టునఁ, గానంబడు దానిఫలము కడువేగమునన్. ౫౭౪

గీ. అయిదువందలయెనుబదియైదు మీర, లెక్కడికి వెళ్లుచున్నార లెపుడువత్తు
రనిన విఘ్నంబు గావుట నన్యులేగు, నప్పుడెదురుగ రారు మాటాడ రరసి. ౫౭౫

గీ. అయిదువందలయెనుబదియాఱు పిదప, నెవ్వరేమందురో యని యింతిముందు
వచ్చి బిడ్డకుఁ దెండు పావడకుఁబట్టు, పసుపుఁ గొమ్ములు దెమ్మని పలుకుఁ బతిని.

గీ. అయిదువందలయెనుబదే డగును నరులు, పరులఁ గనుఁగొని చేయునప్రలాప
మునకు నాక్షేపమను పేర ముఖ్యవిషయ, ములను గొన్నింటిఁ దెల్పుట మోసగాదు

క. ఏనూటెనుబదియెనిమిది, యూనష్టావక్రుఁ డంగజాకృతులను హా
స్యానుకృతిం డొంగాడుచుట, దీనం బలుదెఱఁగులుండుఁ దెలియవలసినన్. ౫౭౮

క. ఏనూటెనుబదితొమ్మిది, యూ నెంతప్రమాణముంటి నని తన్నెఱుఁగం
డైనను బొడుగరిఁ ద్రాడని, జానొజీ యనుచుఁ బొట్టిఁ జక్కటులడువన్. ౫౭౯

గీ. అయిదువందలతొంబది యాలయముల, దేధనమును మ్రుచ్చిలు దిట్ట దొంగ
తనముచేసినఁ బుట్టు [illegible] ధర్మము ల్వలికెనని. ౫౮౦

క. ఏనూటతొంబదియునొక, టౌ నొక్కని కెంతవానికైనను గొంచెం
బూనముగఁ బల్కకుండిన, చో నిర్దురపట్టకుండుచో పురసికనర్. ౫౯౧
క. ఏనూటతొంబదియుం రెం, డౌ నుదరంభరుఁడు నవ్వు నాయతజఘనుం
గానంగ వెనుకబరువని, లా నెక్కిన బండి కఱకఁ దలఁపండైనర్. ౫౯౨
క. ఏనూటతొంబదియుమూఁ, డౌ నూనెమెఱుంగుకొప్పు టార్యను జొల్లం
బూనినమందాకిని నగు, నేని నొసగుసులకుఁ గాలమిదియా యనుచుర్. ౫౯౩
క. ఏనూటతొంబదియునా, ల్గౌ నుబ్బినబుగ్గలతివ యావటీటను ఘూ
ణానూన దీర్ఘకంధర, న్యానతఁ బొడగన్నపట్ల నులుకుచు నుండుర్. ౫౯౪
క. ఏనూటతొంబదే ల్గౌ, పీనుఁడు గొల్లాయఁగట్టుఁ బిఱుఁదులు దిగవం
చానఁగ నవ్వినఁ బౌరుఁడు, జానపదుం గేలిసేయ సంసిద్ధముగార్. ౫౯౫
క. ఏనూటతొంబదా ఱవ, ధానింగని యాశుకవి వితాయని నవ్వర్
ధీనిధిని యక్షగాని మ, హానాటకకర్త నట్టహాసముసేయర్. ౫౯౬
క. ఏనూటతొంబదేడగుఁ, జీనాంబరధారిఁ గాంచి చిఱునవ్వనఁ బ్రా
చీనావిలిత్స్వదేశవ, సానుఁడు సఖుఁ జూచుచుర్ దిసంతులుగొట్టర్. ౫౯౭
క. ఏనూటతొంబదెనిమిది, యా నలగూర్జనిఁ గేరళాంగన ద్రవిడ
స్త్రీని యవని రద్దేహిం, దూ నయమార్గనిధి నలరునుస్మృతిని నగర్. ౫౯౮
క. ఏనూటతొంబదింటికిఁ, జైనొకతొమ్మిది వహించు బావమఱఁదుల
స్థానావమానపద్ధతి, మానింపక చేయుహాస్యమార్గము లెల్లర్. ౫౯౯
గీ. ఆఱువందలుచెల్లు బాల్యమున ముద్దు, కొఱకుఁ దండ్రులఁ దాతలఁ గోరితిట్టు
మనుచు నేర్పదు రేని గ్రమాభివృద్ధి, నదియ యగుఁ గూసువిద్యగా నర్భకులకు.

ఇది షష్ఠశతకము.

---

సప్తమశతకము.

గీ. ఆఱువందలయొకటి విద్యార్థు లన్య, బలపములు లేఖనులును జాఁపలును దొంగి
లించి పట్టువడక నాకులేవె బలప, ములును గంటము లనుచును బూకరింప. ౬౦౧
గీ. ఆఱువందలరెంటిలో నన్యపుస్త, కంబు హరియించి నెమలియీఁకలను నాఁచి
దొరకువడి సిగ్గువడి చెడుదురు దురభ్య, సనములను బాలురని వెట్టి చాటిచెప్ప.
గీ. ఆఱువందలమూఁ డుపాధ్యాయు చదర, యెత్తుకొనిపోయి మాయమ్మ యిచ్చె ననుచు
బొంకి పేరున్న దొఱుఁగక బుద్ధిహీను, లపహాసనదుర్వ్యసనములపా లగుదురేని. ౬౦౩

గీ. ఆఱువందలనాలుగౌ సరసు కొకరి, వస్తువుల బాలకుండు దే వానినింటి
పెద్ద లర్థార్థులై వెఱవీథి నమ్మఁ, జూపినను చాలు వారింపఁజూడ కున్న. ౬౦౪
గీ. ఆఱువందలరైదు బిలరార్థములను, జూడ నవి తానుహరియింపఁజూచుజాడ
లాదవఁజేసెదు తలఁపను నొజ్జగాక, శిక్షకులు లేరు నేర్పంగఁ జేయివట్టి. ౬౦౫
గీ. ఆఱువందలయాఱు కన్నట్టిదెల్లఁ, దనదు రావలయునటంచుఁ దలఁచి దాని
కొఱకు బహుకష్టములఁ బడి కొనలుసాసు, నోర్వలేమిని గుందుచో నొప్పవెట్టి.
గీ. అఱువందలయేడగు నల్లవాని, కున్న దని లేదు తనకని యోర్వచాల
కిరుదెఱంగుల వగచెడు హీనుమనసు, వట్టిపాలార్చు వెట్టి సుస్పష్టముగను. ౬౦౭
గీ. ఆఱువందలయెనిమిది యఱుగనొక్కొ, పరులవిత్త మటంచును బరిగణింప
కెదురుచూచుటచే బుద్ధిహీన మనసు, దానిచేఁ బుట్టువెట్టి కొందఱకు జగతి. ౬౦౮
గీ. ఆఱువందలతొమ్మిది యగుచు వెట్టి, యెద్దియో లోపముండిన యెడను బట్టు
వసతిలే కూడనింబాడు ప్రజ్ఞ యదియ, కారణం బగుచుండు సాధారణముగ. ౬౦౯
గీ. ఆఱువందలపది చూడనగును దావు, మెదడునకు లేకపోయిన మిక్కిలియును
జిన్నతలతోడఁ బుట్టిన చిన్నవాండ్ర, చేష్టలను వారితండ్రులచేష్ట లరసి. ౬౧౦
గీ. ఆఱువందలపదునొకం డగునుదైన, మననుకూలముగా నుండుటరయ కల్ల
వారివలె నాకు వలయు నైశ్వర్యమనుచుఁ, బాటుపడి వ్యర్థుఁ డగువానిభ్రాంతి వెట్టి
గీ. ఆఱువందలపండ్రెండు వ్యర్థశూన్య, వాదముల నాఁకించి యపప్రలాప
మాచరించుచు సద్బుద్ధి యాదరింప, నారటంపడ బుద్ధివికాగ మగును. ౬౧౨
గీ. ఆఱువందలపదుమూఁ డగును ధనికుఁ, డయ్యు సామర్థ్యముండియు నడుగుడాఁట
కాలరుల మాట దుష్కార్యజాలకృతి స్వ, మాన మెఱుఁగక చెడు పరాధీనువెట్టి.
గీ. ఆఱువందలపదునాలు గగును హంస, లేదు కలిలోన సింహంబు లేదు కాకి
కాదిదియు వేఱుపక్షి నిక్క మగునవిగ, తించె ననుచును దలతిక్క దిరుగకున్న.
గీ. ఆఱువందలపదునైదె వసంత మొడమె, గలదు తఱుగ దటంచు దుష్కార్యపరతఁ
గన్నుఁగానక వాఖినంగడము లెఱుఁగ, కయును విహరించు దుర్బుద్ధి కయిపుగాడె.
గీ. ఆఱువందలపదుసాఱు వ్యవహరింపఁ, బడు ధనాద్యాశ లేవడివలనఁ దనకు
నదివలయు నిద్దివలయు నం చందరాని, కోరుకుల గోరుమనుజుని వెఱ్ఱియుండి ౬౧౬
గీ. ఆఱువందలపదునేడు వ్యర్థ లన్య, విత్తముపతీప్రలోభంబు వెలఁదు లన్య
విత్తముపకప్రలోభంబుఁ జిత్తమందుఁ, గలిగియుండుట యాశనాఁ గాంచుఁ వెఱ.
గీ. అఱువందలపదునెన్మి దగు నహర్ని, శంబులు దరిద్రులు మనోరథంబులఁ గడ
పఁగను వారిచ్చి రేఁ యనాథలు నత్త దలఁచెదను వివిధ వ్యర్థ చింతసేయ.

గీ. అఱువందలపందొమ్మి దగును దలఁచు, కొన్నవన్నియు వచ్చునా యెన్నఁడైన
వచ్చు రాకుండు వానితోఁ పాటు విద్య, కై ప్రయత్నింపకుంట నిరాశయనఁగ.

గీ. అఱువందలయిరువది యగుఁ బరార్థ, మందుఁ గాంక్ష యొనర్చుట యాసలేని
వాఁడుగలఁడొక్క సన్యాసివంటివాఁడుఁ, గాంక్షసేయుఁ బరార్థసంగ్రహము పొంటె

గీ. అఱువందలయిరువదొం డగును బరుల, వలనఁ దాఁ గోరుసర్వంబు వచ్చినట్టి
వస్తువులసైని బెఱయిఁగ వ్రాలనీక, కాచుకొని యుండువానికాంక్ష కసునింద.

గీ. అఱువందలయిరువది యవలరెండు, చనును నాకంటెఁ గలఁడె యైశ్వర్యవంతు
డంచఱును నన్ను దర్శింప కర్ధఘటిక, యుంపలే రను చిత్తసమున్నతికిని. ౭౨౨

గీ. అఱువందలయిరువది యందుమీఁద, మూఁడు నాకంటెఁ జదివినవాఁడు లేఁడు
డొక్క శుద్ధి యయినను వాఁడు విధిలేదు, నన్నుఁ జూడక యని గర్వనటన దెలుప.

గీ. అఱువందలయిరువది నంటి నాల్గు, విస్తరిల్లును వాఁడెంత వీనిధనము
వీని విద్యయు నెంత నావెనుక నిలువ, నర్హుఁడేయని యెల్లర నవమతింప. ౭౨౪

గీ. అఱువందలయిరువదిరైదు నీవు, చేయునది యేమి-చెప్పుకో-చేతనైన
నేను రేపేగి సభలోన నిమ్మకాయ, వాట మొనరింతని తిరుగఁబాటు సేయ. ౭౨౫

గీ. అఱువందలయిరువదియాఱు బీద, వాఁడు ధనకాంక్షసేయు స్వాభావికముగ
నర్థవంతుఁడు నీచమార్గానుసృతిని, గాంక్షసేయుట తగదని కానకున్న. ౭౨౬

గీ. అఱువందలయిరువదే డగునుస్వల్ప, వేతనంబులచే ధనస్పృహ యొనర్ప
న్యాయదీక్షితులైనపకార్థ్య లధికు, లర్థమాశించి లంచంబు లందుకొనిన. ౭౨౭

గీ. అఱునూటిర్వదెన్మిది యగును దమకు, లంచములు మాటలాడఁగా నుంచుకొందు
రాంతరంగికు నొక్కని నధిపు లంచు, లోన గుటకలు మ్రింగు నలోభిపెట్టి. ౭౨౮

గీ. అఱునూటిర్వదియుఁ దొమ్మి దగును నీదు, పక్ష మొనరింపఁ జెప్పుదు వారికిచ్చు
నది యటుంచుము నాకెంత యనుచు సంగ, డిని సమారాధనము సేయు ఘనునిబ్రదుకు

గీ. అఱువందలముప్పది యధిపు వనిత, జగతిఁ బాలింపఁ జను భర్తసన్నిధాన
వర్తులకుఁ గోళ్లఁ గొనిరండు వచ్చునపుడు, నేయిదెం డూళ్లలోన దండియని చెప్ప.

గీ. అఱువందలముప్పదొం డధిపుఁ డింటఁ, గుడువఁ బిల్చినచేలుల చెంగులనుగల్గు
ముడియ విప్పెడునట్టి యప్పుడఁతి ముడియ, విప్పునా సుప్రసిద్ధికి వెలయఁ బేరు.

గీ. అఱువందలముప్పది కవలరెండు, మాధవుం డడిగింప శ్యామంతకంబు
వేసిరొకనింద నన్నయ భీమకవిని, విన్నదియులేదు నిందలువేసి రెట్లు. ౭౩౨

గీ. అఱువందలముప్పది కవల మూఁటఁ, బాముసకు నంతభయమందఁ డాముగొన్న
రాజునకుఁ దెల్పుటెటు గవిరాఁగ నాత్మ, పదవిచెడకుండ నని మంత్రి భయమునందు.

గీ. ఆఱువందలముప్పది యవలనాల్గు, పండితుఁడు వచ్చెనేని భూభర్త తెలుఁగఁ
జెప్ప కాస్థానపండితుఁ డిప్పు డసడు, యనుని పిలికితనమ్మున నంచెనేని. ౭౩౪

గీ. అఱువందలముప్పదియై దగస్త్యుఁ, డద్రియభివృద్ధి నడఁచు పేయద్భుతంబు
వృద్ధికిని రాఁదగినశిష్యు నేపునొజ్జ, యడఁగఁ ద్రొక్కుట కాక మహాద్భుతంబు.

గీ. ఆఱువందలముప్పదా ఱధికునొద్దఁ, దనకుఁ గలచనవునఁ జేసి తగినవాని
గుణము లవగుణములుగఁ జేర్కొని యవండి, తుం డనూయను దరిఁ జేర్పకుండెనేని

గీ. ఆఱువందలముప్పదే డధిపునొద్దఁ, దనకు వచ్చెడునది నొల్లుకొనుచు నొరులఁ
గూర్చిచెప్పుటకుఁ గుధి జంకు నొకవేళఁ, గినిసి తన కిచ్చుదానఁ దగ్గించు నేమొ.

గీ. అఱువందలముప్పది యవ్వలనెని, మిదిఱుగు నధికారంబుచే మిట్టిపడుచు
బిచ్చగాండ్రన విజ్ఞుల నెడఁగుఁదనము, తెలియ రవ్వారియుద్యోగబలము వీరు. ౭౩౮

గీ. అఱువందలముప్పది యవలఁదొమ్మి, దధికృతులు తమ్ముఁ బండితులాశ్రయించు
టాత్మగౌరవహేతువం చరయ కర్థి, విధమునం జుల్కఁజూచుట వెకిలితనము. ౭౩౯

గీ. ఆఱువందలనలువది యర్థపుండు, పండితుని దీవనల గ్రహింపం దలంప
కాసవడుఁ బొగడించుకో నాత్మయందుఁ, దద్జ్ఞు లద్దాని వెంగలితన మనారె. ౭౪౦

గీ. ఆఱువందలనలువది యాలనొకటి, యఖిలవిద్యల మఱపులేనట్టి శాస్త్రి
వచ్చినపుడెల్ల నెవరని ప్రశ్నచేయు, ద్రవ్యవంతునిఁ బట్టు పరాకువెట్టి. ౭౪౧

గీ. ఆఱువందలనలువది యవలరెండు, బ్రహ్మరాక్షసిపట్టినవానియింట
దండమున నున్నగుడ్డలు తగులఁబడువి, ధమునఁ దోఁచుట చిత్తవిభ్రమ మటండ్రు.

గీ. ఆఱువందలనలువది నంటిమూఁట, నర్థికిచ్చిన నిచ్చి యీయకయ పుచ్చి
యూరకుండక కూలిచేయు మని బండి, లాగుమని బుద్ధిచెప్పఁ బ్రలాపమగును.

గీ. అఱువందలనలువది నైనపిదప, నాల్గు పరులకు బోధించునయపథంబు
తాను దిగనాడుటొరుల కింతయును దెలియ, దనుకొనుటయజ్ఞతాగుణమం డ్రు బుధులు.

గీ. ఆఱువందలనలువదియైదు తాను, జౌర్యమొనరింపఁగడఁగు నజ్ఞానమునను
దాని నన్యులెఱుంగుచో హానియనిత, లంచు టగును మఱపు తెఱ పంచువెట్టి. ౭౪౫

గీ. ఆఱువందలనలువదియాఱు నశ్వ, రంబగు ధనమ్ము చేకొని రాత్రి పవలు
శాశ్వతంబగు నయశము సంగ్రహించు, కొనఁగఁ దివురుట లాహిరి యనెడువెట్టి.

గీ. ఆఱువందలనలువదే డగును మాన, మెడలి తలిదండ్రులను వీడి యెవరుచెప్ప
వెనుకముం దెంచ కొరులను వెంబడించి, గుణధనము గోలుపోవఁ జొక్కనకుగుఱుతు

గీ. ఆఱువందలనలువది యవలనెన్మి, దగును విఱిగినమూదియు నంతమందు
వెంటరాదని యెఱుంగక విత్త మ్మిడి తడక రాదన ద్రవ్యలకటకటపెత్తు. ౭౪౮

గీ. ఆఱువందలనలువది యవలఁబొమ్మి, పదుగులంబట్టి పడిన యర్థి దన్ని
కోడిమలం దొంగ తలవట్టి గుంజి యన్న, రాత్రమునఁ గొన్న మ్రొక్కునర్థపలిసిగ్గు.

గీ. ఆఱువందలయేఁబది యూసను ధనికుఁ, డర్థులా మీరు మాకంటె నధిక లంద
ఱును నోసంగుడు రెల్లరకును నోసంగి, చదికిలంబడుదు మనిహాస్యంబు నెరప. ౭౧౦

గీ. ఆఱువందలయేఁబదియఱుత నొకటి, శైవులకుఁ బెట్టరాదని జైనులకును
బుడుకరాదని శ్రీవైష్ణవులకు మాత్ర, ము పిడికెఁడుపెట్టు నెఱదాత మొఱకుఁడనము.

గీ. ఆఱువందలయేఁబదియుండ రెండు, ధనికుఁడన నెవ్వరైన యాచనకు వత్తు
రధిపులు కరగ్రహాయత్తు లగుదు రనుచు, బెదరుచూపులఁ జింతించు టదరిపాటు.

గీ. ఆఱువందలయేఁబదినంటిమూఁడు, పిసినిగొట్టని తిట్టినఁ బెడచెవి నిడి
పోయెఁ బ్రాణంబులనఁ బీడవోయె ననుచు, మిన్నకుండుట నౌర్వని యెన్ను జగము.

గీ. ఆఱువందలయేఁబది ననుసరించు, నాల్గు లోనికి నర్థిరా నయము చూపి
మాడ యిడి పంపి ద్వారస్థు మాసపేత, నమునఁ జెగఁగోయు దానశౌణ్డగరిమంబు.

గీ. ఆఱువందలయేఁబదే నాభరణము, గుత్తవైఁ తాల్వరాకున్నఁ గుడుపుమాని
యంగములు చిక్క నవ్వాలనవధరించు, నట్టిముసలాగ్రబుద్ధులఁ బట్టుమెట్టి. ౭౧౫

గీ. ఆఱువందలయేఁబదా ఱధిక యాచ, కులని పండితులని పండువులని యుత్స
వములని వివాహములని యు వదుగ లనియు, విన్న!వ్యయభీతి మైకమ నెవ్వజ్ఞిపట్టు.

గీ. ఆఱువందలయేఁబదే డవళి మనెడు, వెట్టి వ్యసనంబులం జిక్కి విత్తనాశ
మరయ కాప్తులబోఁగల నాలకింప, కెప్పుడుఁ దదేకనిష్ఠితుం జేనిఁబొందు. ౭౧౭

గీ. ఆఱువందలయేఁబది ననుగమించు, నెనిమిది గృహాంతరావస్థవినక పణ్య
యువతియే ప్రాణ మద్దానిరొుడలె జగమ, టంచు విహరింప మైమఱ పనఁగఁబడును.

గీ. ఆఱువందలయేఁబది నానుతొమ్మి, దష్టకష్టములంబడి యార్జనంబు
చేసినట్టి ధనంబు డించి చనలేక, తలకడను మాటఁబెట్టుకో దైన్యమగును. ౭౧౯

గీ. ఆఱువందలయఱువది యంతమందు, భూశయనమునఁగూడ డబ్బువిడఁ బ్రాణ
మెడలకుండిన రూప్యము ల్గడిగి నోట, బోసినం బోవు నతనిది మోహ మగును. ౭౨౦

గీ. ఆఱువందలయఱువది నాశ్రయించు, నొక్క టీలోకమెల్లఁ దానొక్కరుండ
సృష్టిచేసినయట్ల నాయిది యు నాది, యనుచు మమకారమందుట కగును పేరు. ౭౨౧

గీ. ఆఱునూఱులమీఁదట నఱువదియును, రెండు నెలలోప లగును బూర్తి శత మొక్క
రోఁడుబ్రదికిన రెండు గావే యటంచు, నెవరికోసమొ గడియింప నెంచుచింత. ౭౨౨

గీ. ఆఱునూఱఱువదియుమూఁ డగును మించె, మాట యడుగంగ వచ్చిన మార్చుబెట్టు
లంపుమే కాని యొరుల[illegible]గన్న, [illegible] వేడు మూర్ఛయనఁగ

గీ. ఆఱునూటిఱువదియునా ల్గగును దైవ, మా యొసంగఁగరాదె నీవందఱకును
మాపయిని బడ రీదిక్కుమాలినట్టి, ప్రజయనుచు దైవమును బల్కఁ బ్రార్థనంబు. ౭౩౪

గీ. ఆఱువందలయఱువదిరైదు చావ, రాద యాచకు లందఱుఁ బ్రాణభీతి
యేల వారికి నట్లేని నేడిపింప, రనుచుఁ జింతించు టగుసు గృపాతిశయము. ౭౩౫

గీ. ఆఱువందలయఱువదాఱగును నిన్ను, నెవరు కొందురో యొకషఱకేని నర్థి
కొసఁగక గడించి చత్తు మొట్ట్రో ధనంబ, యేమికానుంటి వన దుఃఖ మిలను వెలసి.

గీ. అఱువందలయఱువదే డడుగలేదు, పెట్టలే దేల దైవమా వెంటఁదిరుగ
చుంటి ననుఁజంపఁ దిని పడియుండఁ గన్ను, కష్టైనా యను ధనియనాకలల యొప్ప

గీ. అఱువందలయఱువదినంది యెనిమి, దాధిపత్యంబొ చదువో నాయార్జనమున
కేల ననుజీమల ట్లలయింత్రు చదువ, రులును నధికారు లనిన విరోధ మగును. ౭౩౮

గీ. ఆఱువందలయఱువదియవలఁ దొమ్మి, దగును బాల్యము లేకున్న నంతకుంటె
ముందుఁ బుట్టిన నెంతసొమ్ము గడియించి, యుందునో యనఁ బరితాప మొప్పధనికి.

గీ. ఆఱువందలడెబ్బది యాలుబిడ్డ, లకును బెట్టితి నేఁడింటి నాయమునకుఁ
బాఱుదలపుట్టదా వృథా పడితిఁగష్ట, మార యనఁగఁ బశ్చాత్తాప మనెడివెఱ్ఱి. ౭౪౦

గీ. ఆఱునూటడెబ్బదియొక్క టగును గడ్డి, లింటి నార్జనకై పడియుంటి నొకరి
జోలి నాకేల యనుచు నాజోలికేల, వచ్చె నెఱుఁగదె మిత్రి యన్వానిదిటవు. ౭౪౧

గీ. ఆఱునూటడెబ్బయురెం డన్నియెన్ని, కలకుఁ బానుండకున్న లోకము నిలువదు
తానె మూలము లోకమంతకును దన్నుఁ, బిలువకుండినఁ జెడునను వెఱ్ఱితలఁపు. ౭౪౨

గీ. ఆఱునూటడెబ్బదియుమూఁ డాదిభిక్షు, మీఁది మీపేరు ముందుండ మే లటన్నఁ
బొంగి పెద్దంకెఁ బద్దులోఁ బొందుపఱుచు, నలసి దార్ఢ్యంబు గాదె సాహసమనంగ.

గీ. ఆఱునూటడెబ్బదియునా ల్గధికదుర్వి, నీతు లెవ్వరో వారి కిన్వేం దటన్న
, నేను చేనని యెల్లరు నెగువుపీఁట, కాసపడి వచ్చునారిధైర్యము వహించు. ౭౪౪

గీ.. ఆఱువందలడెబ్బది రైదు శిష్టు, లకును విందన్న నవినీతులకడ నిల్చు
సాహసులె సిద్ధమగుదు రీసవ్యసాచు, లన్యుఁ జేపెడివాక్షేప మగు నలజ్జ. ౭౪౫

గీ. ఆఱువందలడెబ్బదియాఱు నేన, మన్యపాయిని విటశిఖామణిని వంచ
కాగ్రసరుఁడఁ గులభ్రష్ట ననుచు నెందు, కైన సిద్ధపడంజాలు నదియ యశము. ౭౪౬

గీ. ఆఱువందలడెబ్బదే డగతికుండు, కులముతక్కువపనిచేసి క్రుంగియుండ
కదియ ఘనకార్య మని మీర లంగలు నిటు; లాచరింపుఁ డనంగ ధైర్యాతిశయము.

గీ. ఆఱునూటడెబ్బదియెన్మి దాపదఁ దరి, యింప దుష్టాన్నము భుజించి యేన కార్య
కూరుఁడ నటంచు లేమను మమురిలో, రచ్చలం దెక్కుటగును జారవ యనంగ.

గీ. ఆఱునూటడెబ్బదిలొమ్మి దగు నకార్య, కరణమున నిర్ధయశునిఁ గా గణనసేసి
కొనుచుఁ ద్రొక్కెద వనఁగను దిసెప నేమి, పంచె మను వెట్టి దుర్గతియందు నెందు.

గీ. ఆఱువందలయెనుబది యనుచితంబు, చేసి శిక్షితుఁడై యది చింతసేయ
కొక్కదోసెఁడ కాదె యం చూర్చి తుడిచి, వేసికొనుటకుఁ ద్రిభువనవిజయ మంద్రు.

గీ. ఆఱునూట నెనుబదియొం డార్యసభకు, నేవచాపత్యమును దెచ్చి యిట్టిసురుచి
రాంగ నే లోకమునకు సమర్పణంబు, చేసితి నటంచుఁ జూపుట వాసి యగును.

గీ. ఆఱునూటయెనుబదిరెం డాలుబిడ్డ, లెవ్వరును లేనినాఁడు నాకిష్ట మగును
శుల్కములు దీయుపెండ్లిండ్లు చూడ నిదిశి, లాక్షరమ్మని పల్కఁగా నగు శపథము.

గీ. ఆఱునూటయెనుబదిమూఁ డాంతరంగి, కానవరతాన్యకామినీహారి లేచి
నాగవాసంబుఁ జూడఁ గృష్ణచరితంబు, వినను దశమంబు చదువనం చనఁ బ్రతిజ్ఞ.

గీ. ఆఱునూటయెనుబదినా ల్గనుభవంబు, గలజనము చెప్ప వినక నిష్కారణముగ
డిగి యొనరిచి దండుగఁబడి తెల్లబోయి,నోట వ్రేలిడుకొనుట యనుభవ మగును.

గీ. ఆఱునూటయెనుబదియై దతఁడుచేయు, దాన లోపములున్నవి నేను జేసి
చూపెద నటంచు వద్దన్నఁ జొరవచేసి, తాను లోపముసేయఁ దొందర యటంద్రు.

గీ. ఆఱువందలయెనుబది యాఱు కన్ను, దెఱవలే దింతలో మించు దేశహితము
చేయువారలు లేరని సిద్ధపడుట, సభల వాగ్జృంభణమ్మును రభస మగును. ౬౮౭

గీ. ఆఱువందలయెనుబదే డగును బొడ్డు, పచ్చియాఱదు నంకిళ్లు పట్టువిడువ [కతన.
వార్యసభనిల్చి యేమేమొయనఁగఁబోవు, "నయితె" "యిఖనేమి" యంచుబాల్యమ్ము

గీ. ఆఱువందలయెనుబది యైనవెనుక, నెనిమిదగును గ్రంథములలో నేమి కలదొ
చదువలే దందుకైన నాసక్తి లేదు, శక్తిలే దూహలకు మొగ్గ చతురిమంబు. ౬౮౮

గీ. ఆఱువందలయెనుబది యవలఁదొమ్మి, దక్షిగోచర మగుదాని నరయలేఁడు
తెల్పినను గ్రహియించెడు తెలివిలేదు, నాత్మశోధన కెగురుట యత్నమగును. ౬౮౯

గీ. ఆఱువందలతొంబది యగ్బరపుడు, నెలకు నఱువదిదినములు గలవటనియెఁ
దోఁచుచున్నది గణితము తోడుపడును, గ్రహగతికి నంచు నెంచ దూరశ్రవణము.

గీ. ఆఱునూటతొంబదియొక్క టడిగినాఁడఁ, బండితుల నెవ్వరికిని దోఁపదు కవిత్ర
యంబునం గలపదము లెన్న నెడునూహ, నాకులెక్కింపఁదోఁచె నన్నవగు నూహ.

గీ. ఆఱునూటతొంబదియుశెం డరుణగిరి య, డప్పుపుట్టెనొ తెలియ నింతేని నెందు
జాడవారకటః గాని శ్రీశైలపర్వ, తం బనాది యటన దూరదర్శనంబు. ౬౯౧

గీ. ఆఱునూటతొంబదిమూఁ డహర్నిశములు, పుట్టి యెన్నాళ్లొ కాలేదు భూమికంటెఁ
జాలనీవల యద్దాలనా యమునను; స్పష్ట మని చెప్ప నగును నిస్సంశయంబు. ౬౯౩

గీ. ఆఱునూటఁతొంబదినాల్గు స్యందనంబు, లేలతాకని రెండేల రాలటంచు
నన్యభాషల నాల్గుమూఁడైన వెఱుఁగ, కాకళించుట విశద మజ్ఞాన మనఁగ. ౧౯౪
గీ. ఆఱువందలతొంబదే సార్యులనఁ, కను గలవు తోఁక లవిగదా క్రోఁతినుండి
మానవులు పుట్టిరనఁగఁ బ్రమాణ మనుచుఁ, జెప్ప నాకాశపుఁబురాణ మొప్పు నెందు.
గీ. ఆఱువందలతొంబదాఱగను మనువు, మాటలే దంతయును వ్రాఁతమాత్ర మేను
సంజ్ఞలును గొన్ని గలవని చంటిపిల్ల, లెఱుక చేయుదు రన బుద్ధిహీనత యగు. ౧౯౬
గీ. ఆఱువందలతొంబదే డగునుదనపి, తామహునికాల మెఱుఁగఁ దుర్దగ్రంథకర్త
వ్రాసికొన్నది నమ్మఁ దూరక యపార్థ, ములను దలక్రిందుచేయు దుర్బుద్ధి యగును.
గీ. ఆఱునూటతొంబదియెన్మి దగును బుద్ధ, గయకుఁ బడమట గుహలోని కారుఫలక
లిఖితమును బట్టి తెనుఁగు ము స్లెటంచుఁ, జూచినట్టులె చెప్పుట చోద్య మగును.
గీ. ఆఱునూటతొంబదితొమ్మి దన్నిటికిని, సరియయినకాల మెఱుఁగరా దిరువదిరువ
దబ్దములు చేర్చిచూడ సత్యమున కంత, దవ్వుగా దని పలుక నిర్ధారణంబు. ౧౯౯
గీ. ఏడువందలవెట్టియౌ నిన్నిగతుల, సకలసందేహములకు నాస్పదము గగన
పూర్ణ్యనిర్మితి నందలు నద్భుతపరి, శోధకుం డని మెచ్చ నిర్వాహకంబు. ౨౦౦

ఇది సప్తమశతకము.

---

## అష్టమశతకము.

గీ. ఏడువందలయొకటి దుర్వృత్తి ప్రబలి, దేహమును రోగములకును గేహముగను
జేసి తన ప్రాణముల కన్యజీవములను, బలులు వేయుట బుద్ధిదౌర్బల్య మగును.
గీ. ఏడువందలరెండు మేనెఱుఁగ కల్ల, రిగను జిల్లరగాఁగఁ దిరిగి కృశించి
బాధపడువాని నింద్రాక్షిభస్మ మొక్క, మండలము పెట్టుకొమ్మన్న మనుజువెఱ్ఱి. ౨౦౨
గీ. ఏడువందలమూఁడు విజ్ఞోడుగాఁగ, సంచరింప సుపరిచితి సంగ్రహించి
నట్టియత్నకు నమవస నర్ధరాత్ర, మునను వేరులు దీయించుకొనెడువెఱ్ఱి. ౨౦౩
గీ. ఏడువందలనాల్గు వేయిండ్లపూజ, రిగఁ జరించెడు మగనాలు మగనియొడల
మర్లమాతంగిపురుపుల మలయజయుతి, నలఁద మిథునానురాగవిఖ్యాతి నొందు. ౨౦౪
గీ. ఏడువందలయైదు నీహృయరోగ, మితరులకు నెక్కకుండ మాయింటికడప
నడుమ మేకుబిగింతును నక్కకొమ్ము, సంగ్రహింపు మటన్న నసాధ్యమగును. ౨౦౫
గీ. ఏడువందలయాఱు నిస్వీడును శని, వాహనాదియోగం బబ్బు బ్రహ్మరథము
పట్టెదరు చెఱి నెంకుటను నొక్కనొ, కవెలుఁ గన్నను బొంగు టుక్కంత యగును

గీ. ఏడువందలయేను నాకేని వెట్టి, కుదిరిపోయెను దలసఁ జుట్టెపను చెందు
చేవరోకలి యెవ్వళో చెప్పనేమి, మూఁడుతలచుట్లు నిలు వన ముదురువెట్టి. ౭౦౭

గీ. ఏడువందలయెనిమిది యెల్లరోగ, ములకు నిచ్చెద రక్షరేకులను గలవు
లారెయితులు సంగరములు దురాయికట్టు, లనిన నమ్ముట ప్రాణమ్ము నమ్ముటయగు. ౭౦౮

గీ. ఏడువందలతొమ్మిది యెవ్వరేమి, చెప్పినను వానినే నమ్మి చేసి చెవుట
లోనఁ గలతెల్వి గల పనులొన వినుట, లోన లేకున్న నది యొకలోభగుణము.

గీ. ఏడువందలపది యంబటేఱు వచ్చె, ననుచుఁ బొంగెడికోడలి కత్తగారు
చేతఁగోలబుఱ్ఱ చూపుట చెలఁగువెట్టి, తెలియఁబడు నెల్లవోఁ బరాధీనమనఁగ.

గీ. ఏడువందలపదునొకం డేమియన్న, నదియ నమ్ముట పార్థివాహారము విష
లిప్తమును జేసి యది నెమిలిగని యాడుఁ, బావురము గూయు ననఁగ విశ్వాసమగును.

గీ. ఏడువందలపండ్రెండు వృక్షములను, గూండ్ల సంజీవిపుల్లలు గూర్చుఁ జెమరు
కాకులని వానినేటిలోఁ గలపఁ బాము, లట్లు యెదురీఁదు నని నమ్మువట్ల జగతి. ౭౧౨

గీ. ఏడువందలపదుమూఁ డిపుడు జగతి, హంసలే దని లేవ సింహంబటంచుఁ
జాతకము వెన్నెలంజెను జక్రవాకి, రాత్రి థవుఁబాయు ననుచు నేర్పలుచువెట్టి.

గీ. ఏడువందలపదునాలు గెసఁగుఁ దిండి, వెట్టి సర్వంబునందును వివిధగతుల
నద్భుతంబు పిపీలికాద్యఖిలసురుని, వఱకు దీనిని గెలిచినవారు లేరు. ౭౧౪

గీ. ఏడువందలపదునైదు పృథివిమొదలు, పంచభూతమ్ములను మ్రింగఁ బ్రళయమెదురు
చూచుచుండునభూతిమఖ్ చూచుచుండు, లోకమునుమ్రింగఁజూచును లోకమెపుడు

గీ. ఏడువందలపదునారు మృత్యువు యమ, కాలదుష్కార్యములు జగజ్జాలమును భ
జింప వక్త్రంబుదెఱచి కాంక్షించికొనియు, సిద్ధముగనుండుటను చెలిసికొననగును.

గీ. ఏడువందలపదునేఁ డిదేమిలెక్క, ప్రాణులు భుజించుఁ బ్రాణుల నైలుమొదలు
నోరులేనిజంతువులు నాహారమునకుఁ, గడఁగినవి తిండిలో నిదిగాదె వింత. ౭౧౭

గీ. ఏడువందలపదునెన్మి దేఱు చెఱువు, బావి యిట్టివి యున్నల వారినుండి
తోలఁచి యెలయించి పతులకొఁగిపులకడపి, తెచ్చి కోడండ్రమెసవు నత్తిపిరియేమొ

గీ. ఏడువందలపందొమ్మి దేమియమఁడు, ప్రాణులను జంపిలినక యుల్పముగ నెంచొ
డాఁగియుండిన జీవు దృఢంబుగాఁగ, నతినిశితపాశబద్ధుఁజేసి తిగియంగ. ౭౧౯

గీ. ఏడువందలయిరువది యిట్టివెట్టు, లను గనియు యెంతయెడలున్న, లత్యపెట్టె
కీఁగ చీమయు దోమయు నేర్చికొనియె, ప్రాలఁ గుట్టఁగ రుతిసేయ వలయునెడలు.

గీ. ఏడువందలమీఁదట నిరువదొక్కఁ, డెల్ల వర్జించి యడవిలో ఋషులు ప్రాణి
కోటి కాధార [illegible] దున్నకతన.

గీ. ఏడువందలయిరువదిఁ గూడు రెండు, భూమిభర్తల కపరంజిభోజనంబు
చేయుచున్నను బిచ్చుకచిట్టిపడియ, ములఁ జపలత్వమది తిండిమూలమ కద. ౭౨౨

గీ. ఏడునూటయిరువదిమూఁ డిందునందు, ననుచుభేదంబులేకుండ నఖిలమునను
దిండిపెట్టి ప్రసంగ్మంబు దేకయున్న, లేదు స్వారస్య మీభూమి లేశమైన. ౭౨౩

గీ. ఏడునూటయిరువదనా ల్గెనితోఁప, కున్నధర్మాధికారి కానున్నతీర్పు
నట్టుగనె యాఁపి పోయి యాహారమొనరఁ, జేసి మఱివచ్చి కూర్చుండి చెప్పఁదీర్పు

గీ. ఏడువందలయిరువదియేను సభల, యాదినో మధ్యముననో లేకంతముననొ
తిండిపెట్టి యొకింత లేకుండ జనులు, రారనుచు వ్రాయుచుంద్రు కార్యక్రమముల.

గీ. ఏడువందలయిరువదా ఱిట్టుసభను, జరుగదే గద శాస్త్రచర్చ ఫలహార
ముండకున్నను నడుమ నేమున్నదింకఁ, దిండికోసముకద యెల్లదేవులాట. ౭౨౬

గీ. ఏడువందలయిరువదియేడు మనకె, కాదు ఖండాంతరులకును గలదుతిండి
పెట్టి చలుదులబల్లల న్వింతపుస్త, కములు వెలసెను సభలలోఁ గలవుతిండ్లు. ౭౨౭

గీ. ఏడువందలయిరువది యెనిమి దింక, సర్వసాధారణపుఁదిండి జనులలోన
నున్న నొకవింతగా నైన నుండవలయు, దానికంటెను మిక్కుటమైనఁ జెడును.

గీ. ఏడునూటిర్వదియుఁదొమ్మి దింటనుదయ, మున నె యిడ్డైన పనికిఁ బోవునపు డన్న
మొంటిగంటకు లఘుభుక్తి యింటికేగి, సంజతతిఁ బాలు రాత్రిభోజనము తగునె.

గీ. ఏడువందలముప్పది యెపుడుఁగుక్షి, జీర్ణ మగుటకు నెడమీక పూర్ణముగను
నింపిపెట్టినఁ దొలుతఁ దానింపె యగును, బిదప రోగోదయంబగు నెత్తితిండి. ౭౩౦

గీ. ఏడునూటముప్పదియొక్క టింట రెండు, రువ్వములు దిని పనికిఁ బోబువ్వ మూటఁ
గట్టుకొని చేతఁగొనిపోవుఁ గరవటముల, నించి కొనిపోవు నంటుసాం బెంచకుండ.

గీ. ఏడునూటముప్పదిరెండు దృష్టిదోష, మించుక యు లెక్కసేయఁ డస్పృశ్యతావి
చారమున కెడయీయఁ డాచార మెడపు, బాడబత్వంబు నిల్పుకోఁ బాటుపడును.

గీ. ఏడునూటముప్పదిమూఁడు నెల్లిదంబు, నేసి యొరులను లఘుభుక్తి చేయ కట్టు
గడపుదురు పట్టుమని నాల్గుగంటలంచు, శేయి యెట్లుపవసియించు నోయెఱుంగ.

గీ. ఏడునూటముప్పదినాలు గింతికింట, నాదివారము రా భయం బమవసయును
బితృతిథులు వచ్చుచున్నఁ జెప్పెడిది గలదె, పథకమప్పటికప్పు డే ర్పాటుసేయు.

గీ. ఏడువంనముప్పదియేను తిండి, దేహపరిపుష్టికో రోగదీప్తికో యె
ఱుంగ రింటను లేకున్న నంగడులకుఁ, బోయి చిఱుతిండి యరువుగాఁ బుచ్చికొంద్రు

గీ. ఏడువందలముప్పదా ఱిట్టు లన్న, ములను దెగడుటచే ద్వేష కలననన్న
దోష మొదవును మాకు నా క్రొత్తపట్టి, పడును ... యా ... చేయనిపట్ల వచ్చు

గీ. ఏడువందలముప్పదియేడు గలిసి, యున్న బలమున్నఁ దినవచ్చు నౌకరి కింత
యంటచేయివిద్రుపకుండు టన్న మనుసె, యక్కటా యని వాపోవునట్టివెట్టి. ౭౩౮

గీ. ఏడువందలముప్పదియెన్మి దెంస, టో నిసువు లింటఁ జూచు చుట్టూఁతలూఁగ
మగని కొక్కనికే సోలవడమెఁ డెత్తి, దోసిపోయు నొకానొకతోయజాక్షి. ౭౩౯

గీ. ఏడునూటముప్పదితొమ్మి దెల్లప్రొద్దు, మగనిఁ బిల్లలఁ గనుఁబ్రాని మగువ తాను
దిండి కెగఁబడి కొని యనుదినము గొనును, రుగ్మతల నంచులోలోన రోయు వెట్టి.

గీ. ఏడువందలనలువది యెన్నఁడేని, జబ్బుచేసిన భుక్తి విసర్జనంబు
చేసి యేకొఱ్ఱగంజియో పోసికొనక, యందుఁలోఁ గోరుకులు ఫలాహారములకు. ౭౪౦

గీ. ఏడువందలనలువదొం డేమిసేయు, జొన్నపేలములను దినుఁ డన్న వైద్యు
నూఁబపై లంఘనములోన మందగించు, ద్రాక్షరస మాదిగాన వ్యాధి ప్రబలపఱుప

గీ. ఏడునూటనలువదిరెం డెవ్వరేని, జేయునది యగ్గమానొ కాదో యటంచుఁ
జప్పచేయక తాను నాపసెణి వెట్టి, పనులు చేయుట కగు నొకపాటివెట్టి. ౭౪౨

గీ. ఏడునూటనలువదిమూఁ డెవ్వరో త, నకుబుసము చేయుపాడవయిన మడిపించి
కుట్టుకొనియెడు జింపుటకును సహింప, కదియె యెల్లర కిపు డవశ్యమయి యుండె.

గీ. ఏడునూటనలువదినా ల్గిచటిపుల్ల, నచటఁ బెట్టిన నగు మానహాని యింటఁ;
బెట్టెలను బేడలను నెత్తిఁబెట్టి యొకని, కెత్తుకొనుఁ గుక్కపిల్ల శైలెక్కుఘనుఁడు.

గీ. ఏడువందలనలువదియేను గొడుగుఁ, బట్టుకొన లోపమగు గౌరవంబునందు
మణుఁగుబరువున్నఁ జేతిలో మడఁతతోలు, సంచి యుండు టలంకారసత్తనుంబు.

గీ. ఏడువందలనలువదా ఱేడువార, ములనగలు దాల్చి యాంధ్రలక్ష్ములు సతీతి
లకము లిరుప్రక్క సుంత నాంగ్లజనవేష, ధారులై బండ్లఁ దిరుగు పెద్దలను బట్టు.

గీ. ఏడువందలనలువదియే డిదనుచి, తెనుగువేసంబు మీతోడఁ దవిలి తిరుగ
సిగ్గు మా కని పతులకుఁ జెప్పక యును, గమనము పతివ్రతాత్వరూప మగువెట్టి. ౭౪౭

గీ. ఏడువందలనలువదియెనిమి దబ్బి, నదియ చా లెద్దయుద్యోగ మనుచు గ్రంథ
మును స్పృశింపక చదివినముక్కల మఱి, చుచును జీట్లాడువా రెపో సోమరులన.

గీ. ఏడునూటనల్వదితొమ్మి దెడమచేతఁ, గాగితపుఁజుట్ట పీల్పుట కర్జుపట్టు
కొనుట నాగరకముగ గ్రొక్కుట కళాయి, యెడనుచెని మూయఁబెట్టుట యొడ్డివెట్టి

గీ. ఏడువందలయేఁబది యెవ్వరో యొ, నర్చినారని తాము నానావిధముల
నబకతబక విహారంబు లాచరణము, కందుఁబెట్టుట యగు ననర్థాఖ్య వెట్టి. ౭౫౦

గీ. ఏడునూటయేఁబదియొక్క పేమహత్తు, నో యనుకరింపఁ బాపిడి దీయవచ్చు
శిరము పంకింపవచ్చుఁ దెచ్చికొనవచ్చు, నొక్క మాహాత్మ్య మని యెన్నుకునికి వెట్టి.

గీ. ఏడునూటయేఁబది రెండు పృథివిపతుల, యొద్ద నొక్కింత యుద్యోగమున్న నితర
వృద్ధులను లెక్కసేయక పెద్దపెంకి, మాటలాడు టహంభావపాటవంబు. ౭౫౨

గీ. ఏడునూటయేఁబదిమూఁ డదూడినంత, నధిపుపై నేరములను నింద్యముగఁ జెప్పు
చందతిండ్లకుఁ దిరుగుట యాశ్రయించు, టగును గాళ్లబేరం బనునట్టివెఱ్ఱి. ౭౫౩

గీ. ఏడునూటయేఁబదినాలు గింబ నూరఁ, బండితులు గల్గియును వారిఁ బంతగించి
యితరదేశములకుఁ బోయి హేయవృత్తు, లందుఁ బండితులై ధన మొందుప్రజ్ఞ.

గీ. ఏడువందలయేఁబదియేను మద్య, పాన మతిగర్హ్య మదిగాన భవ్యులిందు
వత్తురు ప్రమాదమున నని వృత్తిసరణి, నెడ్డిగిజ్జిడి ద్వారమం దెత్తిరేని. ౭౫౫

గీ. ఏడువందలయేఁబదాఱ్ హీనకులులు, పెద్దయుద్యోగులై కులవృత్తి మఱచి
స్వకులజము సేవకజనమ్ముఁ జౌకసేయ, జన్మవాసనచాలమి యన్మదంబు. ౭౫౬

గీ. ఏడువందలయేఁబదియేడు హీన, కులుఁడు ప్రాభవమునను సత్కులునివలన
నాసపడుటఁ బ్రణామాదు లగు నధికృతిఁ, గలుగుగర్వంపువెఱ్ఱి జగంబులోన. ౭౫౭

గీ. ఏడువందలయేఁబదియెనిమి దిరుగు, పొరుగుబిడ్డలు చదివినపుస్తకములు
పుచ్చుకొని వీథిలో దీపములకడఁ జది, వియును నధికారమున దాని విస్మరింప. ౭౫౮

గీ. ఏడునూటయేఁబదితొమ్మిదింటఁ దండ్రి, యడ్డమగుగడ్డితిని ధనం బంపుచుండఁ
బట్టనములోన మిగుల దూబరిగ హోయలు, మెఱయు విద్యార్థి యరయమి మిదుమవెఱ్ఱి

గీ. ఏడువందలయఱువది యింటఁ దల్లి, దండ్రు లతిహైన్యమునఁ దినఁ దిండిలేక
యుండ నధికారియై పొరుగూర విందు, లారగించెడునతని గర్వాతిశయము. ౭౬౦

గీ. ఏడునూటయఱువదియొక్క టెవరు మీరు, వసతి యెక్కడ ననఁ దీనఁబస బయల్వె
డునని మిథ్యాభిధానంబులను జరించు, నతనియాకారగుప్తి యత్యంత మగును. ౭౬౧

గీ. ఏడునూటయఱువది రెం డెవ్వరయ్య, మీరలనఁగవి నిజమాడ మీనృపాలుఁ
డిట్లు విడిచెనె యందురో యేమొ యనుచు, స్వనరపతి స్వస్థలము జెప్పఁజంకు నేని

గీ. ఏడునూటయఱువదిమూఁ డిద్ధబుద్ధు, లాత్మవంచనచేసికో నాదరింప
సాహసింపరు నాక మీసాలబువ్వఁ, బిల్లి కిడువారు ఫో కదువెఱ్ఱివారు. ౭౬౩

గీ. ఏడునూటయఱువదినా ల్గిందఱుండ్రు, పండితులు భోగినులలోనఁ బరకయుండ
రట్టివారిని దిగనాడి యధిపు లన్య, దేశములు పోవువారి గుర్తింపరేని. ౭౬౪

గీ. ఏడునూటయఱువదియై దింటికొకఁడు, నిద్దఱును స్త్రీలతోఁగూడ నింద్రగణము
లెన్నియో నేరకయు కవి నేనటంచు, శేచినంతన సత్కవి లేవఁ డేని. ౭౬౫

గీ. ఏడువందలయఱువదా ఱెందుఁజూడఁ, బ్రబలి పాఖ్యానము లనుచ పండితుండు
కావ్యములు ప్రాసి. సత్కవిగౌరవంబుఁ, గ్రిందుపఱుచుచు నయశంబు నందు నేని.

గీ. ఏడువందలయఱువదియేడు దొంగ, త్రాగుడున కలవాటయి తాడుప్రాఁకి
చెట్టుమీఁదనె త్రాగెడు చెట్టఁ బట్టి, లొట్టె నుమ్మెత్తసుంఠఁ గలుప జనించు. ౭౬౭
గీ. ఏడువందలయఱువదియెనిమి దటులె, యీఁదుపైనున్న లొట్టెలో నింతకుంకు
డులనురుసును గలుపఁగఁ బుట్టు నది చోరు, ప్రాణముల కెగ్గుదలఁపఁ గర్తగు నఘము
గీ. ఏడువందలయఱువది కివలఁ దొమ్మి, దగును నాగ్లేండ్లబాలుఁడు నమ్మపాలు
మానకుండిన వేఁపాకుఁ గానుగాకు, నలఁపి చూచుకములపయి నలఁదఁబుట్టి. ౭౬౯
గీ. ఏడువందలడెబ్బది యీర్ష్యచేతఁ, బరులకొంపలుగాల్చెడు పాతకునకుఁ
బట్టునంతమునకు దేహపాటవంబు, దప్పి యుద్దామసంజ్వలద్దాహ మొకట. ౭౭౦
గీ. ఏడునూటడెబ్బదియొక్క టింతయున్న, నంతగాఁ జెప్పుకొనుచుఁ గర్మాలయములు
వర్తకస్థానములు నని పత్రికలను, బ్రచుర మొనరించువారిధైర్యమున కగును. ౭౭౧
గీ. ఏడునూటడెబ్బదిరెండు గృహముపేరు, పునఁగువారును భోగపువాసనయు నన్న
రీతిఁ బెదపెద్దపేరులు వృత్తి యల్ప, మయ్యు గంతులువెట్టుసంఘాతిశయము. ౭౭౨
గీ. ఏడునూటడెబ్బదియుమూఁ డెందుఁ జేరు, గొప్పయును నూరుదిబ్బ యన్గతిగ భార
తీవిలాసంబు సభ్యులతెలివి క్రిందు, మట్టు దాఁటకయుండుటఁ బట్టియుండు. ౭౭౩
గీ. ఏడునూటడెబ్బదినాలు గెల్లపత్రి, కలను బ్రకటించి యేమికావలసియున్న
మేము పంపింతు మన్నింట మేలుసరకు, లనుచు నాకాశరామన్న యార్భటింప.
గీ. ఏడునూటడెబ్బదియైదు పృథివిపతుల, యప్పులం దీర్చి బాగుచేయంగసంఘ
మొకటినిల్పి యనామధేయులు ధనంబు, గూర్పఁ గొంపకునూలుప్రోగును లగింప.
గీ. ఏడువందలడెబ్బదా ఱింటఁ జేరు, బల్లమాత్రము యుండును వచ్చిచూడ
నొకరుఁ గనఁబడ రార్భాటమో దిగంత, విశ్రుతులయట్లు తముదామ విలిఖనంబు.
గీ. ఏడువందలడెబ్బదియేడు మేము, పండితులను బరీక్షించి పట్టములను
బిరుదముల నిత్తుమని యప్రవేశవిద్యు, లప్రయోజకులధనంబు నపహరింప. ౭౭౭
గీ. ఏడునూటడెబ్బదియెన్మి దెల్లయుదధి, రత్నములు సంగ్రహించి విక్రయముచేయు
దుము పరుల నమ్మి మోసపోదు రని గాజు, ముక్కలను జూపువర్తకమునకుఁ బట్టు.
గీ. ఏడునూటడెబ్బదితొమ్మి దితరులిచ్చు, దానికంటెను దగ్గింతు దానికంటె
మేలుసర కని నమ్మించి మిగులఁ జెడ్డ, వాని నమ్మి మేడలుగట్టి బాగుపడుట. ౭౭౯
గీ. ఏడువందలయెనుబది యిరుగుపొరుగు, ధనికు లేమియుఁ దనకు మెత్తవడకున్నఁ
దప్పుపత్రములను నసత్యప్రమాణ, సాక్ష్యముల లొంగఁదీయఁ బ్రశంస గలుగు.
గీ. ఏడునూటయెనుబదియొకఁ డింతిధనికు, రాలు విధవయునై యున్న దరసి నీదు
మగఁడు [illegible] మరణమంద, నిమ్మనుచుఁ దప్పువ్రాఁతల నేఁచుచున్న.

గీ. ఏడునూటయెనుబదిరెం డేమితోఁప, కున్న నీతల్లి యట్టిది యువిద యిట్టి
దనుచు వలకాటిరామనాథాఖ్య సెప్ప, ను త్తరంబుల సజ్జను నుడుకువెట్ట. ౭౮౨

గీ. ఏడునూటయెనుబదిమూఁ డెవ్వఁడైన, గడనపరుఁ జూచి యారీతి గడనసేయ
నేరకున్నను డానతినిపుణత నతఁ, డొనరిచినయట్లు వ్రాలుచేయునది నేర్వ. ౭౮౩

గీ. ఏడునూటయెనుబదినా ల్గీవు నాకు, సాయ మొనరింపకున్న రాజసభ కిపుడ
తెలియఁజేసి వేయింతు వృత్తిపయి నాయ, ముపయిఁ బన్నని ధని భయముపడఁజేయ

గీ. ఏడునూటయెనుబదియై దెదుటఁబడిన, నోరు మెదుపంగలేనియజ్ఞులు పరోక్ష
మున నొనర్చెడుదూషణమున జనించు, వెట్రి కసమర్థనామంబు విదితమగును. ౭౮౫

గీ. ఏడువందలయెనుబదా రేమిరాని, యింతి పేరిడి తనకున్న యెల్లశక్తి
వంచనములేక చూపి యపప్రలాప, ములను బత్రికలకు వ్రాయ మొదలువెట్ట.

గీ. ఏడువందలయెనుబదియేడు తప్పు, సాక్ష్యము లొసంగ ధర్మసంస్థల వసించి
ధనముగొని చూడకున్నను దనకుఁ దెలియు, ననునబద్ధంబు లాడునాతనికిఁ బట్టు.

గీ. ఏడునూటెన్బదెన్మిది యేఁబదేండ్ల, క్రింద జరగినసంగతికిని నలువది
యేండ్లవాఁ డిచ్చుసాక్ష్యం బదెట్టు లనఁగఁ, దండ్రివలనను వింటి వాస్తవ మటంచు.

గీ. ఏడువందలయెనుబదిసెనసి తొమ్మి, దగును దెల్లనివాని నల్లఁగను బొట్టి
వానిఁ బొడువరియని మృతు బ్రదికియున్న, వాఁడనుచుఁ బల్కి దుష్ట జీవనముసేయ

గీ. ఏడువందలతొంబది యీవలసిన, ధనము నెగవేయఁ దానె యాతఁ డిపుడిందు
లేఁడు మూన్నాళ్లలోవచ్చు నేఁడురేపు, తానుఁడని మభ్యపెట్టు వృత్తమ్మునందు.

గీ. ఏడునూటతొంబదియొక్క టీయఁదలఁపు, లేక యధమర్ణుఁడు నడి యెల్లిటికి నాలు
గయ్యెనని వల్లకాటిలో నన్యసంచ, యనపుటొలుకులు చూపించునట్టిచోట. ౭౯౧

గీ. ఏడునూటతొంబదియురెం డితనితండ్రి, మంత్రియై యుండి మరణించె మాతచెల్లెఁ
జెల్లెలికిఁ బెండ్లి మూఁగఁజేసెను విధాత, యనుచు నర్థికి వ్రాసియిచ్చినయతనిది.

గీ. ఏడునూటతొంబదియుమూఁ డెల్లవ్యాఘ్ర, లక్షను వంసం దని యొక్కతైలమ్ముఁ దెచ్చి
యమ్మఁగాఁ గొని మోస మైనపుడుఁగూడ, దానిపై నమ్మకము పోనితరుణమందు.

గీ. ఏడునూటతొంబదియునా ల్గింతపోసి, కొనిన నలచేతఁ బెడచేతికిని దిగు నది
యంతకంటెను గుణముచేయ దని యెంచ, కన్నిటికి నదియే మం దటంచు నమ్మ

గీ. ఏడువందలతొంబదియేను గొన్ని, యేండ్లక్రిందటఁ బుట్టి నాఁడెల్లనిండెఁ
జూఋకులమ్మని దానికై వెఱచి యెల్ల, వారలును మేఁకపాట్టు చేపట్టుకొనిరి. ౭౯౫

గీ. ఏడువందలతొంబదా ఱితరులొనరు, చు ఘనకార్యము లల్పముల్ శూన్యఫలము
లాత్మకృత్యమ్ము లల్పమ్ము లనఘము లని, తెల్పు సంపాదిపతులవట్టియు వెట్టి. ౭౯౬

గీ. ఏడువందలతొంబదే డేమిఁచేసి, నారు మీ రిండఅధిక లున్నారు మేము
చేసితిమి బీదలము పొడిచి విడిచితి మ, టంచు హంసకాకీయంబు లాడునపుడు.
గీ. ఏడువందలతొంబదియెనిమి దీవ, దర్థమిచ్చి శిబిఖ్యాతి కాసపడెడు
వారి, నిచ్చిన దింతైనఁ బతకముగను, జేసి తగిలింపుఁ డని వారిచెప్పపట్ట. ౭౯౮
గీ. ఏడునూటతొంబదిలొమ్మిదింతటంక, పొడికి నొదిగెడు నల్పంపుఁబూడ చితుకఁ
గొట్టి యొసఁగి జగంబెల్ల గోలవెట్టి, స్వర్ణపతకంబు లనువారివర్ణనంబు. ౭౯౯
క. ఎనిమిదివందలు ముగ్గురు, జనులం గూర్చుండఁబెట్టి సలిపినసభ చె
ల్లిన దలిజయప్రదంబుగ, ఘనసమ్మోదముగ నని ప్రకటనము చేయన్. ౮౦౦

ఇది యష్టమశతకము.

---

## నవమశతకము.

క. ఎనిమిదివందలయొక్కటి, జననంబగు వెఱ్ఱి యొకట సాజముగా న
ద్ది నశించుఁ దాన సాజము గను గొన్నిదినంబులకు నొకానొకమనమై. ౮౦౧
క. ఎనిమిదివందలరెండ, బ్బును మొదటను నూతనుఁడుకఁ బోవు నవశిలిం
గొని తాత నెత్తిమొత్తికొ, నిన మెదడున దుష్టరక్తనిష్కృతిగాఁగన్. ౮౦౨
క. ఎనిమిదివందలమూఁడగు, వనితలకై సంజ్ఞ శిరముపంకించి యొరుల్
గన నది వాడుక యని చె, ప్పనితొంతంబును నటింప వెఱఁగుఁదనంబౌ. ౮౦౩
క. ఎనిమిదివందలనాలుగు, మనోభవప్రకటనల జెడుమార్గంబుల వ
ర్తనసేయఁ గొంటఱకు సం, జననం బగు స్త్రీపురుషవిచారరహిత మై ౮౦౪
క. ఎనిమిదివందలరైదగు, మనోవికారమున కాది మంచివి చెడుగ
ట్లును గలవి లేనియట్లును, వినియును వినకుండినట్లు విపరీతముగాన్. ౮౦౫
క. ఎనిమిదివందలయాఱు గ, గన మంటుకొనంగ నిప్పు గరమునఁ బట్టన్
మనుదినఁగ గాలిలోఁ బఱ, వను నంబుధినీఁదఁ దెగువ ప్రకటముసేయన్. ౮౦౬
క. ఎనిమిదివందలయే డిం, తిని వంటలఁ దప్పువట్టుఁ దేఱకుఁ దిట్టుం
దనయులఁ గొట్టుం బిల్వక, యును నేమను నన్న మన్నమో యనుచుండున్. ౮౦౭
క. ఎనిమిదివందలయెనిమిది, యొనరించి యకృత్య మద్ది యొరు లెఱిఁగినచో
ట నటింప వెఱ్ఱివానిగ, తిని దప్పుకొనంగ నెప్డుఁ దిరమై యుండున్. ౮౦౮
క. ఎనిమిదివందలతొమ్మిది, వనితాసంగాతిశయతఁ బరపురుషాభీ
ష్టనితాంతా[illegible] ౮౦౯

క. ఎనిమిదివందలపది పు, ట్టును విషయోగమునఁ జచ్చెడుచ్చ్యగములం ది
న్నను సున్నముఁ గ్రుళ్లిన పం, డ్లును జేఁపలు మెసవ నర్థలోపముకలిమిన్. ౨౧౦

క. ఎనిమిదివందలపదునొక, టిని గనుఁగొందురు బుధులపటిష్ఠావయవా
ప్తిని గల్గునంగవికలత, జనకాదవికారకార్యసంఘటనమునన్. ౨౧౧

క. ఎనిమిదివందలపదిరెం, డు నిరంతరభుక్తి నెక్కుడుగ నిద్రింపన్
దినమింటిపనులచే శిశు, వున కసువికలావయవత పుట్టుకగోలెన్. ౨౧౨

క. ఎనిమిదివందలపదుమూఁ, టను జిన్నశిరంబు గల్గుటను మస్తిష్కం
బున కుండఁ దావులేమిని, బనుపడు నజ్ఞాన మదియప్రజ్ఞ మగున్. ౨౧౩

క. ఎనిమిదివందలపదునా, ల్గును దలియుఁడు తల్లికడుపులో నుండఁగనే
జనియించు నింద్రియంబుల, కును దోహదభేదములను గొందఱ కెందున్. ౨౧౪

క. ఎనిమిదివందలపదునై, దున నిసువును జీఁకటింట దుర్వాసనలో
నను బండఁబెట్టఁ గ్రమమునఁ, గనలేదు శిరంబు నిలుపఁగాలే దెపుడున్. ౨౧౫

క. ఎనిమిదివందలపదునా, అనఁబడు బిడ్డకును బుట్టినదిమొద లెపుడున్
ధ్వని వినకుండఁగ నిశ్శ, బ్దనికేతనగుప్తిఁ మూఁగ బధిరుఁడు నగునాన్. ౨౧౬

క. ఎనమన్నూటపదేడగు, మనుజులకును శస్త్రవైద్యమార్గంబున వ
చ్చినవెఱ్ఱి కొన్నిదినములు, చనఁ బోవు న్నిలుచు బలవిశాలత లేమిన్. ౨౧౭

క. ఎనిమిదివందలపైఁ బదు, నెనిమిది తలిదండ్రులు బలహీనులుగాఁ బు
ట్టినశిశువుల కొక్కప్పుడు, గనిపించు న్వెఱ్ఱి యతివికారముగాఁగన్. ౨౧౮

క. ఎనిమిదివందలపైఁబది, యునుదొమ్మిది తండ్రి కంటియుండిన నదియే
తనబిడ్డల కుత్పన్నమ, గును వంశానుగత మనఁగఁ గొన్నిప్రకృతులన్. ౨౧౯

క. ఎనిమిదివందలయిరువది, జననికిఁ గలవెఱ్ఱి యామెసంతతికిం గ
ల్గును దఱచుగఁ గొందఱలోఁ, గనఁబడుఁ గనఁబడకయుండు గ్రహచారమునన్.

క. ఎనిమిదివందలయిర్వది, యునునొక్కటి తండ్రివెఱ్ఱి యుండును సుతునం
దునఁ దల్లివెఱ్ఱి సుతయం, దునఁ జూపట్టు నది కర్మదోషముకతనన్. ౨౨౧

క. ఎనిమిదివందలయిరువది, యును రెంటను నొకనివెఱ్ఱి యొకనికి రాఁబో
వునపుడు పురుషులకం టెను, వనితలవెఱ్ఱి సుతలకును నవశ్యము వచ్చున్. ౨౨౨

క. ఎనుమన్నూటిరువది మూఁ, డనుజుల కన్నలది వచ్చు టరుదై యుండున్
జనకునిది తనయునికి వ, చ్చునదే తఱ చరయవచ్చుఁ జూచాయలుగన్. ౨౨౩

క. ఎనమన్నూటిరుపదినా, ల్గనియెద రతిదోషమున సహవాసము మై
శ్రీ నియోగం ... ట్టును వెఱ్ఱి యిది గనఁబడ దెపుడున్. ౨౨౪

క. ఎనమన్నూటిరువదిరైు, దునఁ దలపెద్దదియు నొడలు దుర్బలయుతముం
జననీజనకులలోపం, బుననో తనలోపముననొ పుట్టి కృశించున్. ౨౨౫

క. ఎనమన్నూటిరువదియా, ఱున నిరుదల లొక్కమేను లొమ్ముగ జఠర
మ్మును గరచరణయుగమ్మును, దనుకొని పుట్టెదరు గాని తడవుండ రిలన్. ౨౨౬

క. ఎనమన్నూటిరువదియే, డున నంగవిహీనులను గొడుకులం గూఁతుం
డ్రను గని నిర్లజ్జావళి, తను ధనమార్జించెదరు ప్రదర్శనరీతిన్. ౨౨౭

క. ఎనిమిదివందలయిరువది, యెనిమిది తరతరము వచ్చునేవెట్టియుఁ బో
వును మూఁడుతరము లైనం, దనయుని వఱకును మనుమనిదాఁకనె నిలుచున్. ౨౨౮

క. ఎనిమిదివందలయిరువది, యును దొమ్మిది యిల్లువరుస నొదవెడు పైవె
ట్టిని గొంచఱు త్రైపూరుష, మనరు కులక్రమమును విడువదందురు స్తోక్తిన్. ౨౨౯

క. ఎనిమిదివందలముప్పది, తనుకుం బురుషులకుఁ గొన్నితావుల స్త్రీలం
జెనకుం గొనితావులలో, నను దేశవిభేదమునను గనంబడుచుండున్. ౨౩౦

క. ఎనిమిదివందలముప్పది, యునునొక్కటి పురుషులందొ యువతులయందో
చినతనమునఁ దోఁపదు యా, వనకాలమునుండి తోఁచు బహుభంగులుగాన్. ౨౩౧

క. ఎనిమిదివందలముప్పది, యును రెండగు వెట్టి యెప్పు డుద్భవమగునో
కనుఁగొనఁ గష్టతరంబై, నను నేదే నొకసమయమునం దఱి చననౌ. ౨౩౨

క. ఎనిమిదివందలముప్పది, యునుమూఁడగు వెట్టి శైశవోజ్జితముగఁ ద
క్కినమూఁడవస్థలందును, గనఁబడు ముఖ్యంబుగా నొకానొకదానన్. ౨౩౩

క. ఎనిమిదివందలముప్పది, యునునాలుగు వెట్టి యొదవనుంకించెడుచో
ననుమానంబులు మెండగుఁ, గనువేదురుపుట్టు నిద్రకంటికిఁ గఱవౌ. ౨౩౪

క. ఎనిమిదివందలముప్పది, యునునైదగు వెట్టి మదికి నూఱటలేకుం
డును నిజమునచ్చ దెంతటి, కిని గల్పన లమితమగును గృశతజనించున్. ౨౩౫

క. ఎనిమిదివందలముప్పది, యును నాఱగు వెట్టి నేన యొడయఁడ లోకం
బున లేఁడు తక్కొరుండను, మనోదృఢము వచ్చు నొకటి మనుజున కెందున్. ౨౩౬

క. ఏనిమిదివందలముప్పది, యును నేడగు వెట్టి నేననూనమతి నా
కు నిల గలసర్వవిషయము, లును దెలియుం గొండు మీకు లోపడ ననెడున్. ౨౩౭

క. ఎనిమిదివందముప్పది, యెనిమిది తనవెట్టి తనకు నింపగు నెపుడున్
గను లెగురవైచుచును బ, ట్టినపాటనె పట్టుకొని పఠించుచునుండున్. ౨౩౮

క. ఎనిమిదివందలముప్పది, యునుదొమ్మిది వెట్టివాని యూహకు జగమె
ల్లను వెట్టి [illegible] దొరికెడి దోసమున్. ౨౩౯

క. ఎనిమిదివందలనలువది, యెనరించు నసత్ప్రలాప మారకయేడ్పుఌ
మునుపటియుపహాంశుకృత్యము, లను వెలిపుచ్చుకొనుచుండు లజ్జ నశించుఌ. ౨౪౦

క. ఎనిమిదివందలనలుబది, యునునొక్కటి నేను దీర్ప లాగిఁ జెప్పి విధం
బును న్యాయాధిపునకు శి, క్షను రమ్మనుఁ డెవ్వ రడ్డుగాపత్తు రనుఌ. ౨౪౧

క. ఎనిమిదివందలనలువది, యును రెంటను నాకుఁ జక్రయోగం బుండె
న్నను దర్శింపుఁడు నిత్యముఁ, గొనితెం డను నుపయలకు కుతుకం బందుఌ. ౨౪౨

క. ఎనిమిదివందలనలువది, యునుమూఁడను విజ్ఞ్ఞి నింక నుదయుంబందుఌ
జనపతిగా శ్రీమంకుం, డును కీరవసంతరాయఁడును ననుచుండుఌ. ౨౪౩

క. ఎనిమిదివందలనలువది, యును నాలుగు నేను వచ్చి యుదధిక్షోభం
బును మాన్పఁగలను గానీ, ననుఁ బిలిచినదాఁకఁ బోవ నాకేమి యనుఌ. ౨౪౪

క. ఎనిమిదివందలనలువది, యును నైదున సంద్ర మింత యుద్రేకమ్మె
ప్లును జూపలేదు పోని, మ్మని యూరకయున్న నజుపు లతియయ్యె ననుఌ. ౨౪౫

క. ఎనిమిదినందలనలువది, యును నాలుగు వొల్లి భూమియును సాగరముఌ
నినుపాఱెఁ జెజీసగముగాఁ, జనఁజన హరియించెఁ బుడమి సాగరమనినఌ. ౨౪౬

క. ఎనిమిదివందలనలువది, యును నే డనుఁ గొండలెల్ల నుదధిని వైవఌ
జనులకు గరిసెనమునకై, వెనుకం బనిలేదు రాజు వెడఁగని నవ్వఌ. ౨౪౭

క. ఎనిమిదివందలనలువది, యెనిమిది ననుఁజూచి యోర్వ కీవైద్యం డె
వ్వనితో మార్చెను నాతలఁ, గనుకయె నాబుద్ధి మాఱెఁ గాఁబోలు ననఌ. ౨౪౮

క. ఎనిమిదివందలనలువది, యునుదొమ్మిది నెంతచెప్పఁ డొప్పను నాకీ
తనువునకుఁ దగినతలయా, కనుఁగట్టెను వైద్యుఁ డని వికావిక నవ్వఌ. ౨౪౯

క. ఎనిమిదివందలయేఁబది, మునుపటివారలను నిట్టిపోలిక నే యొ
క్కనితల యొక్కని కడికిని, గనఁబడరా తలలుమార్పుగండ్రలు ననెడుఌ. ౨౫౦

క. ఎనమన్నూటేఁబదియొక, టిని ననుఁబంపెను నటంచు చెప్పరముగ సా
త్త్వినిమల్లయ్యను బంతులు, పనిచినవాఁ డనినకథ యబద్ధము యనెడుఌ. ౨౫౧

క. ఎనమన్నూటేఁబదిరెం, టను గాలికి బొండచేయుటం గనలఁగతే
నను రిత్త మిన్నకయ యుం, డినచోటన యుండు లేదనిన నమ్మకయే. ౨౫౨

క. ఎనమన్నూటేఁబదిమూఁ, డను దెఱచిననోరు మూయుటయు మానిననో
టిని దెఱచుటయును నెఱుఁగక, మన మవశంబైన నుండు మలిపినదాఁకఌ. ౨౫౩

క. ఎనమన్నూఁటేబదినా, ల్గునఁ జే యూర్ధ్వముగఁ గీలుకొలిపిన నట్లే
యునుచును [illegible] తెనయంతం బడినదాఁకఁ దాపని నోలెఌ. ౨౫౪

క. ఎనమన్నూఱేఁబదిరైయై, దున నున్నది లేనియట్లు తోఁచును లేకుం
డిన నున్నటు భావించుర్, వినఁ డితరులమాట పట్టువిడువం డెపుడుర్. ౭౧౫

క. ఎనమన్నూఱేఁబదియా, ఱున గోపన్నయెద రబ్బులో లెత్తించేర్
జనపతి ధనముహరించిన, నను సాంగిషను బంధనం జేటి కనుర్. ౭౧౬

క. ఎనమన్నూఱేఁబదియే, డున పింఛెజను గొప్ప డొంకను సుఖినై
యొనరుతు వ్యాపారము న, ప్పున నితరానున్న నది విశేషం బనుచుర్. ౭౧౭

క. ఎనిమిదివందలయేఁబది, యెనిమిది పానంగు నాశ్రయించిన యెడఁ గా-
లునిపురి కసహ్యకరవ, స్తునికాయముఁ బంపి బ్రదుకఁద్రోవగల దనర్. ౭౧౮

క. ఎనిమిదివందలయేఁబది, యునదొమ్మిది వేఁడినూనె యుక్కుంగంబం
బును నినుపముక్కు కాకులఁ, బనిచిన ధనమీఁడె యముఁడు బలె యని నవ్వర్.

క. ఎనిమిదివందలయఱువది, మునుపటిదరలకును గొంచెముగఁ దక్కువకే
యినుమాఱును ముమ్మాఱును, బనిచిన దండుగకునోర్చి పైలాభమనుర్. ౭౨౦

క. ఎన్నమన్నూటఱువదియొక, టను నాకన్న లివిగావు టక్కరిగాం డ్రే
యనువుననొ సంగ్రహించిరి, యనర్థపుంగన్న లాసఁగి యని చింతించుర్. ౭౨౧

క. ఎనమన్నూటఱువదిరెం, టను శాత్రము వట్టినని చటాలున నింత
న్నినిచినదాని నొలుకఁబో, యును బోసియు రిత్త దసెడునూహాయె చెందుర్. ౭౨౨

క. ఎనమన్నూటఱువదిమూఁ, టను గొమరుఁడు గలిగెనని కటకటంబడు నా
జనని మృతినొంచె నని హ, ర్షనినాదాస్యుఁ డగు మ్లేచ్ఛసంఘము పోలెర్. ౭౨౩

క. ఎనమన్నూటఱువదినా, ల్గొనరించు నదేపనిగ నహోరాత్రము రో
దనమును గాదే హానిము, సు నిద్రయును భోజనంబునుం గొనకుండుర్. ౭౨౪

క. ఎనమన్నూటఱువదియై, దున బాగుగనున్ననాఁటి తోయమువారిం
గనుఁగొని ప్రాద్దయ్యేను బో, దును సంబళముల నొసంగుదును నేఁడ నెడుర్. ౭౨౫

క. ఎనమన్నూటఱువదియా, ఱున మాకీనాఁడు సెలవు బొమ్మదుపు లట
య్యును బనియుండుటఁ జనియెప, ననుమాత్రము రమ్మనియెను నాయండ నెడుర్.

క. ఎనమన్నూటఱువదియే, డు నిరంతర ముండు దొర విడువఁడు శిరోవే
ష్టన ముండవలయు మాకెపు, డును నని మునుపటిగతి యిపుడును బలెఁ బలుకుర్.

క. ఎనిమిదివందలయఱువది, యెనిమిది తప్పానరుపంగ సీడిచినైనం
జనియును మాదొగ మాకా, ర్యనిలయమును మేము మేమటంచుం బలుకర్. ౭౨౮

క. ఎనిమిదివందలయఱువది, యునదొమ్మిది నిన్న నెవ్వరో నాబుద్ధిం
గొనిపోయిరి [illegible] లేమర్. ౭౨౯

క. ఎనిమిదివందలడెబ్బది, తనభార్య వచించి యిడినఁ దప్పించుచు వా
నిన యొరులు దెచ్చి కంచం, బున వడ్డింపఁగను మెచ్చి భుజియించినచోన్. ౭౬౦

క. ఎనిమిదివందలడెబ్బది, యునునొక్కటఁ జుట్టమొ చెలియో వచ్చినభా
ర్యను మెఱమెచ్చులకై తి, ట్టును రెండవవూర పచ్చడులు లేవనుచున్. ౭౬౧

క. ఎనిమిదివందలడెబ్బది, యును రెం డగుఁ జిన్నతనము నొకవెఱ్ఱిగఁ దా
నను గల్పించును నాలో, చనరహిత మనర్థయుత మసమ్మతకృతియున్. ౭౬౨

క. ఎనిమిదివందలడెబ్బది, యునుమూఁ డగు శైశవమున నూహాలేశం
బునఁ జేయఁగూడనిపనుల, నొనరింతురు కార్యములుగ నొక్కట శిశువుల్. ౭౬౩

క. ఎనిమిదివందలడెబ్బది, యును నాలుగు బాలకులకు నుండందగున
ట్టి నిశాతత్వము చుఱుకును, ననువుపడవయేని బుద్ధి వ్యర్థంబ యగున్. ౭౬౪

క. ఎనిమిదివందలడెబ్బది, యును నై దతినిశితగుణము నుగ్రత్వము మాం
ద్యనితాంతత్వము గల్గిన, జనియించుం దాన నతిప్రశస్తి గలుగునే. ౭౬౫

క. ఎనిమిదివందలడెబ్బది, యును నాఱనఁ జుఱుకుఁదనము నొదవింపను మాం
ద్యనిరస్తనంబు సేయను, జనకులు నొజ్జలు నసడ్డసలుప జనించున్. ౭౬౬

క. ఎనిమిదివందలడెబ్బది, యును నేడగు మూఢ యింక నుచితస్థితికిం
జను దేనికారణంబున, నొనరుతు రవినిశ్చయార్థయుతకార్యంబుల్. ౭౬౭

క. ఎనిమిదివందలడెబ్బది, యెనిమిది మస్తిష్కకోశ మిమిడిక గానం
డని హేతువునం దొందర, యును బడుబడుచుఁ గోసికొనుటయుఁ దటస్థంబౌ. ౭౬౮

క. ఎనిమిదివందలడెబ్బది, యునుదొమ్మిది దీన నిట్టియుత్సాహము పు
ట్టునటంచు వారియాటల, కనుకూలించుచు నె చూపి యనమిం బుట్టున్. ౭౬౯

క. ఎనిమిదివందలయెనుబది, యనుజ్ఞయీకున్న నంతరార్థము మెదడుం
బొనరింపలేఁడు కార్యము, లను జనుఁ డవి తగ్గ బాలు నడుగఁగనేలా. ౭౭౦

క. ఎనమనూటెనుబదియొకఁ, డనుమతియీకున్నఁ జేయునాయాపనులన్
జనుఁ డెఱుఁగనేరఁడు చదివి, యును నర్థం బొసె చూచియును గనఁబడునే. ౭౭౧

క. ఎనమనూటెనుబది రెం, టను దలలో మెదడునకు దృఢత్వము రామిం
బొనరింత్రు బాలు రడ్డము, మనీష గలవారు చేయుమార్గంబునకున్. ౭౭౨

క. ఎనమనూటెనుబదిమూఁ, టను బాలురయట్లు మర్కటన్యాయంబుం
గనఁబఱచి బ్రహ్మచారులు, సునిశ్చయము చేయఁగలరు చోద్యపువెఱ్ఱిన్. ౭౭౩

క. ఎనమనూటెనుబదినా, ల్గునఁ గిష్కింధాపురమ్ము కులముగ విద్యా
ర్థినికా[illegible]బనులన్. ౭౭౪

క. ఎనమన్నూ ఱెనుబదియే, ను నరుం డేయూడువాఁడును న్విద్యార్థి
త్వనియూఢి నుండఁ బోడము న, వినయము నాక్షేపము వెడవెడయల్లరులున్. ౮౮౫

క. ఎనమన్నూ ఱెనుబదియా, ఱు నగరవాస్తవ్యులై యెఱుంగని యయ్యా
జనపదవాసులఁ గనిన, వ్వినయంతన పుట్టును వెఱవేఁకి మనమునన్. ౮౮౬

క. ఎనమన్నూ ఱెనుబదియే, డు నరు ల్గలన్యాయసభను దుందుభములు వ
చ్చి నిరభ్యంతరముగ ని, చ్చెను సాక్ష్యము లనిన నమ్మచెన్నఁటిలనమా. ౮౮౭

క. ఎనిమిదివందలయెనుబది, యెనిమిదిలో వచ్చి వేంకటేశ్వరుఁడా కో
కనదపురంబున సభలో, ననిచ్చె సాక్ష్యం బటంచు నరులనికొనినన్. ౮౮౮

క. ఎనిమిదివందలయెనుబది, యును దొమ్మిది దమ్మిడికిని నొదుగనిగూకీ
లను గొని గాలిపటములం, గొని యెడలెఱుఁగకవివేకి క్రమ్మఱుట నగున్. ౮౮౯

క. ఎనిమిదివందలతొంబది, జనులందఱు నట్టులెత్తి సంభ్రమ మొప్పన్
మినుఁజూచు చిలను గనుఁగొన, కనర్థముగఁ బల్లటీలనంటి పరువిడన్. ౮౯౦

క. ఎనిమిదివందలతొంబది, యునునొక్కటి గాలిపటము నొరుఁ డెగసైవం
గని దానికిసై యెయిదుట, క నేసులకుఁ బుట్టుపెట్టి కన్వర్థమగున్. ౮౯౧

క. ఎనిమిదివందలతొంబది, యును రెండగు దయ్యమొకని యొడలువిడిచి పో
చును నానవాలు కొఱకై, ఘనవృక్షాగ్రంబు కొమ్మ ఖండించు ననన్. ౮౯౨

క. ఎనిమిదివందలతొంబది, యునుమూఁ డన్యమత మందియును బంతులు నా
యనివారుఁ బిళ్లెగారని, స్వనామముల విడువరే నసహ్యకరంబొ. ౮౯౩

క. ఎనిమిదివందలతొంబది, యునునాలుగు నాకు బిరుదు లడిగి లిఖించెన్.
మును మొసటకు రాజశ్రీ, యనియె మహాశబ్దమెడపె నని దుఃఖింపన్. ౮౯౪

క. ఎనిమిదివందలతొంబది, యునునై దేమియును లేక యుప్పరితట్టం
బనివడిపోయుచు నేనొక, ఘనవంశమువాఁడ ననుచు గర్వించు నెడన్. ౮౯౫

క. ఎనిమిదివందలతొంబది, యునునా అనుదినమువచ్చు నుసుగక జీతం
బును గట్టు నతం డెటుపో, యిన నేమని శిష్యు నొజ్జ యేమనకున్నన్. ౮౯౬

క. ఎనిమిదివందలతొంబది, యును నేఁ డధికారబలము నూఁతముగా నా
కును మ్రొక్కుఁడనుచు నధికులు, ననధికులం డానవెట్ట నాలోచింపన్. ౮౯౭

క. ఎనిమిదివందలతొంబది, యెనిమిది యధికారి మ్రొక్క నింతన నష్టం
బును బొంద ననక కులఘన, తను గాపాడుకొనఁ జూచుధన్యునిఁ బట్టున్. ౮౯౮

క. ఎనిమిదివందలతొంబది, యునుదొమ్మిది నధికకులుని నూరక నిలుపున్
నినుచుం[illegible]లుని నధికృతుఁ డింతలోనఁ బోవునె గురుతల్. ౮౯౯

ఉ. తొమ్మిదివందలం జవితిఁ దోయజవైరిని జూడ నిందవ
చ్చు మ్మతి చూడరా దపుడు చొప్పడెఁ గృష్ణునియంతవానికే
పొమ్మని యుం ద్రము ల్విసరి ముండులు జోస్నలుఁ జల్లి యింటివా
రమ్మెయిఁ దిట్టినం బడిన హీనత గాదని యెంచఁగా నగుక్. ౯౦౦

ఇది నవమశతకము.

---

## దశమశతకము.

క. తొమ్మిదివందల యొక్కటి, యిమ్ముల జనులకును గలహ మెత్తించి స్వలా
భమ్మునకై పోరించుచు, గుమ్మరపురుగట్టు లౌరులకుం గనఁబడినక్. ౯౦౧
క. తొమ్మిదివందల రెండగు, నెమ్మది నెల్లూరిలోని నెఱజాణల ప్ర
శ్నమ్ములు రావూరిరసికు, లిమ్మెయి విప్పిరని చెప్పి రేని జగమునక్. ౯౦౨
క. తొమ్మిదివందలమూఁడగు, నిమ్మండలమందుఁ జెప్ప నీపలుకులనే
యమ్మండలమున యుక్తిహ, నమ్ముగ వచియింపఁ బ్రహసనమునకు ననువై. ౯౦౩
క. తొమ్మిదివందలనాలుగు, సమ్మతముగ సర్వసిద్ధిపరసులు కావ్యా
శమ్మెలరసికుల కంపిన, కమ్మలటం చకటవికటకతలం దెలుపక్. ౯౦౪
క. తొమ్మిదివందలఁయిదొక, యమ్మకు నబ్బకును బుట్టినట్టి చరిత మా
యమ్మమ్మ చేసెనని సక, లమ్మగు జగమునను నొక్కలాసునె చెప్పక్. ౯౦౫
క. తొమ్మిదివందలయాఱగు, నెమ్మెయి వీరబలుని వని హిందీలోనే
గమ్మత్తు పలుకులందురొ, క్రమ్మఱ నవి తెనుఁగు బాచిగానికి నదుకక్. ౯౦౬
క. తొమ్మిదివందలయేడగు, సొమ్ములు పెట్టుకొనిన పురుషుని నవ్వుచు నే
బొమ్మనఁ జేతను జెఱిగని, బొమ్మలపచ్చాకుబొట్టు పొడిపించుకొనక్. ౯౦౭
క. తొమ్మిదివందలయెనిమిది, కొమ్మల గ్రంథంబులందుఁ గుత్సితము నస
హ్యమ్ముగ వర్ణించిరటం, చమ్మాదిరిపటము లింట నంటంగట్టక్. ౯౦౮
క. తొమ్మిదివందలతొమ్మిది, రమ్మన్నను రారు వారరమణీమణిన్మ
త్తమ్ముఁ గనుంగొనఁ గొక్కొ, కమ్మునకు న్వ్యాఖ్య పీఠికలు వ్రాయుదురా. ౯౦౯
క. తొమ్మిదివందలపది గ్రంథమ్మున వర్ణనలు సంగతముగావు స్వహ
స్తమ్మున ముంజే దిసమొల, గుమ్మల పచ్చలను బొడిచికొన సంగతమా. ౯౧౦
క. తొమ్మిదివందలపదునొకఁ, డిమ్మనుజుం డేలవచ్చు నిచ్చటి కుపకా
రమ్మేదియేనిఁ గోరునొ, పొమ్మని [illegible] ౯౧౧

క. తొమ్మిదివందలపండ్రెం, డ్రమ్మక తునిలోన గుండమందునఁ బడఁగా
నమ్మాట నారదుండు ది, వమ్మున నింద్రునకుఁ జెప్పపట్టునఁ గలుగున్. ౯౧౨

క. తొమ్మిదివందలపదుమూఁ, టమ్మనునొకవెట్టి దామిటారులకున్నా
సమ్మున నయ్యెడ బుతుబం, ధమ్మొనరించు నదివో యథారీతినగున్. ౯౧౩

క. తొమ్మిదివందలపదునా, ల్గమ్మెయి నరులందునం చురభ్యాసవిశే
షమ్ములఁ గనఁబడి బలప, ర్వమ్ములఁ బోనాడు విపదు బ్రదికినవఱకున్. ౯౧౪

క. తొమ్మన్నూటపదేనగుఁ, గొమ్మలకుం గర్భమువుడుఁ గొంపఱ కొదవుం
బిమ్మటఁ పనంత విడుచు ష, భమ్మగు నామీఁద వలదు వైద్యముచేయన్. ౯౧౫

క. తొమ్మన్నూటపదారయి, కొమ్మకు ముట్టుడుగఁబోవుకాలఁదిని గని దే
హమ్మున నిలిచి యధికవై, ద్యమ్మునఁ గా కెడలనట్టి యావెట్టిలగున్. ౯౧౬

క. తొమ్మన్నూటపదేడగు, ముమ్మరపువెట్టి సతికిఁ బురుడుదినములం
గ్రమ్మును దానొక నెల గడు, వమ్మొనసిన నంత క్రూరభావం బుడుగున్. ౯౧౭

క. తొమ్మిదివందలుఁబది యా, పిమ్మట నెనెన్మిదియుఁ బట్టి పీడించు సతిం
గొమ్మలనఁ జెలిమిటన నిష్టమ్ముండదు తత్సమయవశంబున నెందున్. ౯౧౮

క. తొమ్మిదివందలు మఱిపం, దొమ్మిది భద్రాకరణము తోడన చలినీ
ళ్లమ్మునిఁగి పిపప దధ్య, న్నమ్ముం దిని నిద్రవోయినం దలనట్టున్. ౯౧౯

క. తొమ్మిదివందలయిరువది, సమ్మోహమ్మనఁగ భంగు సారాయమ్ము
గ్రమ్ముగనుపయోగించెదు, నమ్మతిహీనునకుఁ బట్టి యార్తింబెట్టున్. ౯౨౦

క. తొమ్మన్నూటిరువదియొక, టిమ్ముగ శాంతస్వభావు నెలయించి దురం
తమ్ములగుపనులఁ బఱపును, ముమ్మాటికి దుడుకు మందు మూర్ఖుంజేయున్. ౯౨౧

క. తొమ్మన్నూటిరువదిరెం, డెమ్మానిసికైన వెట్టియెత్తుటకున్మం
దుమ్మదము నిద్ర పట్టదు, పమ్మినతలనొప్పి యెట్టిపట్టున నుండున్. ౯౨౨

క, తొమ్మన్నూటిరువదిమూఁ, డెమ్మగువకునైనఁ బట్ట నెప్పుడు మగనిం
దెమ్మనును గాసు లాభర, ణమ్ములు లేకున్న భోజనము పెట్ట ననున్. ౯౨౩

క. తొమ్మన్నూటిరువదినా, ల్గెమ్మాడ్కిని నిద్రరాని హీనబలున్ శీ
ఘ్రమ్మున లోపడఁజేసి కృ, శమ్మొదరించి యలయించు సాధారణతన్. ౯౨౪

క. తొమ్మన్నూటిరువదియై, దమ్మొకము నరులఁబొందు నవసరములు గొం
చెమ్ముగఁ దెలిసియుఁ దెలియని, యమ్మాదిరినుండు వాని నరయరు విమతిన్. ౯౨౫

క. తొమ్మన్నూటిరువదియా, అమ్మక్క సుఖోద్భవంబు లసురోగములం
గ్రమ్మినపిమ్మట నొదవెడు, భిమ్మిటి నొడలెల్ల ముదపెట్టుగ ముడుఁగున్. ౯౨౬

క. తొమ్మన్నూటిరువదియేడే, డమ్మానవునొడలు కంపమందును వాగ్దో
షమ్మున గొడుసును సుఖమే, హమ్మున నెమ్మానవునకు నావెట్టియగున్. ౯౨౭

క. తొమ్మన్నూటిర్వదిపై, నిమ్మను నెనిమిదిఁ బ్రమేహాకృత మగువెట్టిన్
సొమ్మధికమ్మయి పానము, గొమ్మలు జూడమ్ము గలుగఁ గొలుపు నెఱుఁగుఁడా. ౯౨౮

క. తొమ్మిదివందలయిరువది, తొమ్మిది జనియించు వెట్టితోఁ బొడమును బు
ట్టమ్మునుగట్టని కట్టుతు, ఱమ్మున విప్పికొని తిరుగఁగాఁ గుతుకంబున్. ౯౨౯

క. తొమ్మిదివందలముప్పది, యమ్మాదమునందు నరున కూర్ధ్వము చూపన్
సొమ్మలు భయమును గదురుక, తమ్మునఁ దలవంచి సంతతము నిలఁ జూచున్. ౯౩౦

క. తొమ్మిదివందలముప్పది, యమ్మటి నొక్కటిని వెట్టి యుద్రేకములోఁ
గొమ్మలకుఁ బాలుచేఁప న, సమ్మతమగు బిడ్డ కపుడు స్తన్యంబొసఁగన్. ౯౩౧

క. తొమ్మిదివందలముప్పది, కిమ్మొనసిన రెంట మూర్ఛ గిట్టి నెతిం బై
త్తమ్మయి వికారమునఁ బడు, ముమ్మర మపు డట్టిమూర్ఛ పోనడవనిచోన్. ౯౩౨

క. తొమ్మిదివందలముప్పది, కెమ్మిం దరువాతిమూఁట నేర్పడు వెట్టిన్
సొమ్మసిలుఁదలుచు మూర్ఛం, ద్రిమ్మటపడు వాఁడు తగను గృహముననుండన్.

క. తొమ్మిదివందలముప్పది, కిమ్మీఁదటనాల్గు మతము కృతమగునది శై
వమ్మనివైష్ణవమని వివి, ధమ్మగు వాదములఁ బుట్టి తావిరియఁబడున్. ౯౩౪

క. తొమ్మిదివందలముప్పది, యమ్మీఁదను నైదు *గ్రద్దయగపడఁగా ను
త్కమ్మగ్గపడిన సాష్టాం, గమ్ముగ మ్రొక్కలిడుమతవికారముపొంపెన్. ౯౩౫

క. తొమ్మిదివందలముప్పది, కిమ్ములనాఱింటఁ బుట్టు నీమతవికృతిం
ద్రిమ్మరఁగఁజూచు నాతిం, గొమ్మల విడనాడి యిష్టగతి దేశములన్. ౯౩౬

క. తొమ్మిదివందలముప్పది, యమ్మొగి నేడయినవెట్టి నొక్కింతయుఁ గ
న్నమ్మాయఁడు నిద్రించిన, నమ్మో పైఁబడియె నొకమహాభూత మనున్. ౯౩౭

క. తొమ్మిదివందలముప్పది, కిమ్మగును సమీపమునను నెనిమిదిటం గం
తమ్ముం బిసికికొనం గూ, పమ్మునఁ బడ సాహసంబుఁ బాటించు మదిన్. ౯౩౮

క. తొమ్మిదివందలముప్పది, తొమ్మిదిటం గత్తిదెమ్ము ద్రోయును నాతం
గమ్మఁగ మ్రింగెదఁజాల వి, షమ్ముం గొని తెమ్మటంచు సాహసముఁ గొనున్. ౯౩౯

క. తొమ్మిదివందలనలువదిఁ, బొమ్మా దగ్గఱకు రాకుఁ బొడిచెద నీహ
స్తమందినఁ గఱచెద దూ, రమ్మున మెలఁగుం డనుచుఁ బరాకుం దెల్పున్. ౯౪౦

* తొండయగపడఁగాఁ గ్రొ,గమ్మునఁ జంపును సంతో,షమ్మునఁగను సాలెపురు
జగవెట్టిగదా.

క. తొమ్మిదివందలనలువది, యొమ్మటి యొక్కటి యపాయ మొదవనింతు నటం
చు మ్మిగిలిచెప్పు వానిగ్ని, హమ్మున నుంపఁజన దధికృదాయత్త మురుక్. ౯౪౧

క. తొమ్మిదివందలనలువది, యొమ్మ టిరెంటను భుజించు టుడుగును బలవం
తమ్మునఁ దిరిపించిన నధి, కమ్ముగఁ దిను వెట్టితిండి గానఁడు తృప్తిన్. ౯౪౨

క. తొమ్మిదివందలనలువది, యొమ్మటిమూఁడగును హింసయొనరించి విచా
రమ్ముపను పథల వెట్టిచి, ధమ్మున నటియించు వానితంత్రము లెంచుర్. ౯౪౩

క. తొమ్మిదివందలనలువది, యొమ్మటినాలుగు ప్రమేహామునకు సంతా
నమ్ము నిలువదు నిలువఁగ సు, ఖమ్ముగ మన దయు పెట్రిగా గణనకగుర్. ౯౪౪

క. తొమ్మిదివందలనలువది, యొమ్మటి రైదె వొక్కజనుని యుచిద గలింపం
గ్రమ్మును జెప్పక యొండేఁ, గమ్మునఁ బడియుండుఁ బ్రకృతిఁగాంచఁడు మరలన్.

క. తొమ్మిదివందలనలువది, యొమ్మటి యా ఆప్తస్మృతికి నొక్కఁడు వివశ
త్వమ్మంది తిరుగఁ బలుకఁడు, పిమ్మటఁ గారణము మఱచు వెట్టి మురిరేడుర్. ౯౪౬

క. తొమ్మిదివందలనలువది, యొమ్మటి యే డంతదాఁక యోగ్యుఁడు మితవా
క్యమ్ములు గలవాఁ డాపూ, త్యమ్మును నధిక ప్రసంగ మారంభించున్. ౯౪౭

క. తొమ్మిదివందలనలువది, యొమ్మటియెన్మిదిని బిలువ నో యనరేకా
ర్యమ్మును జేయుచు కదపిన, హుమ్మని పైఁబడుదురును మహోగ్రతబలిమిన్. ౯౪౮

క. తొమ్మిదివందలనలువది, తొమ్మిదిటన్ భయముపెట్టుగురు నేఁడ త్తుం
గ్రమ్మెన ని మ్మిదిగో గగ, నమ్మున కెగిరనను మఱి కనంబడ ననుచున్. ౯౪౯

క. తొమ్మిదివందలయేఁబది, నెమ్మదిగలవారుఁ బనుల నేర్పులు లనువా
రుమ్మాదము గదురంగ న, సమ్మతులను జేతఁగానిస్థలలు సైఁక ౯౫౦

క. తొమ్మన్నూటేఁబదియొక, టమ్మలికం బెమ్పుఁ గలుగు లుడివోయినచో
నెమ్మది గ నప్పు డవకా, శమ్ముం గని చేయ జను విచారం బెనలోన్. ౯౫౧

క. తొమ్మన్నూటేఁబదిరెం, డమ్మయ్యా బ్రతికిచెడ్డయపుడు వికారా
ఘమ్ములు దటికొన నుద్రే, కమ్మొనరుచు నధిపు లతని గ్రహియింత్రు వశిన్. ౯౫౨

క. తొమ్మన్నూటేఁబదిమూఁ, డొమ్మికచెడ వెఱ్ఱివలన నుపశమనంబై
క్రమ్మఱఁ గ్రమ్మఱ నదిప, ద్యమ్ముల నుబికినను గుగుర బహుకష్టమునన్ ౯౫౩

క. తొమ్మన్నూటేఁబదినా, ల్గిమ్మెడలి జనించు నరునిహృదయమున వికా
రమ్మది స్వాస్థ్యముఁ గను కాం, తమ్ముగ నుంచినను శేఁప దప్పం బెమ్పన్. ౯౫౪

క. తొమ్మన్నూటేఁబదియై, దమ్మెనడును బట్టి వెట్టియగు వికృతి వికా
రమ్మున నది సాధ్యాసా, ధ్యమ్ముల వాడఁబడు నెందు ద్వైవిధ్యమునన్. ౯౫౫

క. తొమ్మన్నూ టేఁబదియా; ఱమ్మడిరై పుట్టు వికృతి యను నవికృతియుఁ
గ్రమ్మఱు నవికృతిజన్యము, గ్రమ్మఱుదు వికృతిజ మెంతకఠినక్రియలన్. ౯౧౬

క. తొమ్మన్నూ టేఁబదియే, డిమ్ముల నవికృతివికార మింద్రియగతమై
నమ్మరలుఁ జికిత్సలచే, నమ్మస్తిష్కభవమట్లు లలయింప దొరుఁ ౯౧౭

క. తొమ్మన్నూ టేఁబదియును, బిమ్మట నెన్మిదిటఁ బుట్టు విషముజ్వరజా
తమ్మయిన సన్నిపాతవి, ధమ్మున నాగుడు నపరచికిత్సఁగలియునుఁ. ౯౧౮

క. తొమ్మిదివందలయేఁబది, తొమ్మిది వెజ్జేని సంధిదోషమునకుఁ గొం
చెమ్ముండు శేస ఏది సుల, భమ్ముగ వెజ్జులు గ్రహింపవలనగు నెందున్. ౯౧౯

క. తొమ్మిదివందలయఱువది, యమ్మలములు గొన్ని యున్న, నూరు న్విడియ
న్యమ్ముగు గ్రామమ్ములు పో, నెమ్మది యగు శీతవాతనీరాహృతులన్. ౯౨౦

క. తొమ్మన్నూటఱువదియొకఁ, డిమ్ముగఁ గుదిరెనని విడిచి యితరస్థలవా
సమ్మున్ స్వగ్రామము పే, రమ్మఱలను దెలియ కద్ది గ్రహచంద్రు నరుల్. ౯౨౧

క. తొమ్మన్నూటిరువదిరెం, డిమ్మహి ధనధాన్యవృద్ధు లిపుడిపుడే యీ
రమ్మను లోనగుచు వసం, తమ్మున శీతగిరిపోయెదరు తెలియరొకో. ౯౨౨

క. తొమ్మన్నూటఱువదిమూఁ, డమ్మలు పటుకరణఁ యుఁక్య స్వార్థపలకు స్త
న్యమ్మిచ్చిన పౌష్టవయో, వమ్మని దాదులను బెట్టఁ బట్టును నారిన్. ౯౨౩

క. తొమ్మన్నూటర్వదినా, ల్గమ్మాడ్కిని దాదిచేతి కర్పింగినయం
తమ్మనసు మరలి బిడ్డలఁ, గిమ్మన రెం తేప్చినఁ బకీయులకీర్తిన్. ౯౨౪

క. తొమ్మన్నూటర్వదినై, దమ్ముగబిడ్డ నైజముగ ప్రకృతిని బొం
దమ్మని ధాత్రి ప్రకృతి, స్నెమ్మని గాని భాషణాదిని మనసులఁ జేయున్. ౯౨౫

క. తొమ్మన్నూటర్వదియా, ఱీమ్మాడ్కిని ధాత్రి వెంప నిఁక నేమని మా
నమ్ములకొలంది తల్లులు, త్రిమ్మరుదురు పతులవెంట దేశములెల్లన్ ౯౨౬

క. తొమ్మన్నూటర్వదియే, డుమ్మాడము బాల్యమున సముద్భవమగు చో
నొమ్మలు నీడుపు వచ్చు హ, తమ్మున నాచిన్నికనొసటను గాల్తు రొగిన్ ౯౨౭.

క. తొమ్మిదివందలయఱువది, యుమ్మతి యెన్మిది జనించు నొగి హేతుజ్ఞా
నమ్మునకుఁ దావులేక య, క్రమ్మును నిర్హేతుకముగఁ గాలక్రమలన్. ౯౨౮

క. తొమ్మిదివందలయఱువది, తొమ్మిది నిష్కారణముగఁ దోఁచినయున్మా
దమ్ము లనృష్టవశమ్మున, నెమ్మదినెడఁ జెప్పలేము నిశ్చయమనుచున్. ౯౨౯

క. తొమ్మిదివందలడెబ్బది, యున్మాద మకారణజము లోకాటఁ బాపా
నమ్మువను మొదటిగాన వృ ద్ధిమెక్కనరంగ నా[illegible] ౯౩౦

క. తొమ్మిదివందలడెబ్బది, యొమ్మటి యొక్కటి ప్రయాణమొనరుచు నరు రా
త్రమ్ములను జొట్టి యపమా, ర్గమ్మునఁ బడిఁ ద్రోయు నాకొ యవిద్యాములకఁ. ౯౭౧
క. తొమ్మిదివందలడెబ్బది, యొమ్మటిరెం డందలనులు నోం బాయ్ బోయిల్
జుమ్మను పంజులవెలుఁగును, దమ్మనిజేయునఁట కొ యవిదయ్యములు జనుకఁ. ౯౭౨
క. తొమ్మిదివందలడెబ్బది, యుమ్మూఁటను వృద్ధు జనకు యువకుఁడు తద్వే
షమ్మును నసక్తభావము, నుమ్మనమున సేవగించు నుదురు ముడివడకఁ. ౯౭౩
క. తొమ్మిదివందలడెబ్బది యొమ్మటినాల్గగును వృద్ధు యువయువతీ వే
షమ్ములకు సేవగిల్లుఁ ది, రమ్మొక్క యవస్థ లంతరము లేకుండకఁ. ౯౭౪
క. తొమ్మిదివందలడెబ్బది, యొమ్మటి యైదగును ధనములొడ్డి పణము బె
ల్లమ్మెత్తెఁడు దినఁగ ఫ, లమ్ములు నూఱుదినఁ బెనఁగులం బడుచోటకఁ. ౯౭౫
క. తొమ్మిదివందలడెబ్బది, యొమ్మటి యా అలమి సంజ నొక్కొక్కని కుం
డు మ్మునిమాపునఁ బోవుఁ గ్ర, మమ్మున రేఁజీఁకటి యనెడు మగత ప్రకృతిచేకఁ.
క. తొమ్మిదివందలడెబ్బది, యొమ్మటియే డంటును బొరుగూరికిఁ బోవం
బిమ్మటను దుర్దశంబలె, గ్రమ్మున విడకుండు నింటఁగల కులశక్తుల్. ౯౭౭
క. తొమ్మిదివందలడెబ్బది, యొమ్మటి యెనిమిది యెదేని యుం బనిచెప్పం
డమ్మా యని చెప్పిననిమి, షమ్మునఁ గావించు పేశిచందము వినరే. ౯౭౮
క. తొమ్మిదివందలడెబ్బది, తొమ్మిది సంపర్కవశతఁ దోఁచుఁ జిరంటీ
సమ్మోహన మొక్కొకనికిఁ, గిమ్మనకుండంగ గొంతు గిట్టుచు నిద్రకఁ. ౯౭౯
క. తొమ్మిదివందలయెనుబది, సమ్మోహము నిద్రలేపఁ జట్టున నోరుపై
నుమ్మియుడు తుప్పుమని హ, స్తమ్మున నొకదెబ్బవ్రేయు దాపున నున్నకఁ. ౯౮౦
క. తొమ్మన్నూటెనుబదియొక, టమ్మనుజుం డొంటిఁ బండుటకు వెఱచు న్ని
ద్రమ్మిట్టి పడును హుంకా, రమ్ములు గావించుఁ దెలివిరామి నవశతకఁ. ౯౮౧
క. తొమ్మన్నూటెనుబదిరెం, డుమ్మాదము నిద్రలోన నొకనికిఁ దలపై
నమ్మదనకేలు నడుమున, కు మ్మీఁదను దూల మున్నఁ గొందల మందుకఁ. ౯౮౨
క. తొమ్మన్నూటెనుబదిమూఁ, డెమ్మానిసి సీసము భుజియించునొ వానిం
బిమ్మట వెట్టును జెయి పడుఁ, గ్రమ్మున గడుపునను నొప్పి కష్ట రదములకఁ. ౯౮౩
క. తొమ్మన్నూటెనుబదినా, ల్గుమ్మద ముద్భవిల వేణువూఁదినను గా
త్రమ్మునఁ బాడినఁ గరచర, ణమ్ముల లయవైచి తలవణంకించి నగుకఁ. ౯౮౪
క. తొమ్మన్నూటెనుబదియై, దిమ్మగు వీరాంగనాద్య మొక్కఁడు నైనకఁ
దిమ్మని తెయ్యని ... ౯౮౫

క. తొమ్మన్నూటెనుబదియా, ర్వమ్ములు నల్లులను జీర్ణమున కెపమీకుం
డమ్మెక్కనేని నధ్వశె. నమ్మునెఁ బొడసూపు వెట్టి నానాగతులన్. ౯౮౫
గీ. తొమ్మనూటెన్బదేడగు దోపమునపుఁ, బథ్యము నపథ్యమనక సాపడ విషాళ
నంబసుచుఁ బేరువెట్టిరి న్యాయవిదులు, సమశనము సుఖకర మని సమ్మతించి ౯౮౬
గీ. తొమ్మనూటెన్బదెన్మిది ద్యూతపాన, చౌర్యములలోఁగి వ్యసనిరైౖ సౌఖ్యనిద్రఁ
గనఁడయే న్బట్టుఁ దిండి కేకారవలదు, నిద్రవంటి సువస్తువున్నె నరునకు. ౯౮౭
క. తొమ్మన్నూటెనుబదియుం, దొమ్మిది నిద్రకు వళంబు దుఃఖము సుఖముం
బిమ్మట జ్ఞానాజ్ఞానము, లు మ్మనుటయుఁ జప్పుటది ప్రలోపింప నగున్. ౯౮౮
క. తొమ్మన్నూఱుండొంబది, యిమ్మర్త్యమునందుఁ గొంచ పేఁ బెంచుబిడా
లమ్మునకు రెండుకాళ్లని, సమ్మతిలరు పట్టువిడరు సత్యము గనరున్. ౯౯౦
క. తొమ్మిదివందలతొంబది, యుమ్మీఁదనొకండు వెట్టి యొక్కని కొకకా
ర్యమ్మునను బట్టుఁదల లో, క మ్మేమనుకొనిన మానఁగాఁబోఁ డదియున్. ౯౯౧
క. తొమ్మిదివందలతొంబది, యమ్మీఁదన్రెండు సంఘమంతయు సంస్కా
రమ్మొనరించెద ననితన, యమ్మాయికిఁ బెండ్లిసేయఁ డార్యత్వమునన్. ౯౯౨
క. తొమ్మిదివందలతొంబది, యుమ్మూఁడగుఁ గులముచెడిన యోగ్యతచెడ సౌ
ఖ్యమ్ముగనుట ముఖ్యం బని, ముమ్మా టినుమా అనాథ మొగుపుం బతికై. ౯౯౩
క. తొమ్మిదివందలతొంబది, కిమ్మటి నాల్గంటువెట్టి కేశోద్ధరణం
బిమ్మహిఁ గర్తవ్యమ్మను, నిమ్ముగఁ గదెపంగఁజాలఁ డితరేష్టహరిన్. ౯౯౪
సీ. తొమ్మిదివందలతొంబదియైదులో వ్యాకరణములేదు వలసినంత
యను నున్నది యె యొక్క డను నున్నదానిలోఁ బూర్ణభావము లేదుపో యటనను
శాస్త్రములనఁగ పట్ఛాస్త్రము ల్గావను నొలుకులు బౌమికలు నున్ని తుద మొ
దల్గనుఁగొను పెత్తి త్రవ్వి పోయుట కంబ్లు తోముట కన్నియో దొరలు వ్రాసి
రవి తెలుంగొనరింపఁగా నగును మీరు, దంపుఁ డేఁ జంకలను దట్టైన నటనుగలి
మీరు మీరు సంపాదించి మేల్మివిషయ, మిందు నేర్వ్రాసెదను దాని నేర్చి యనుమ.
సీ. తొమ్మిదివందలతొంబదియాఱులో గగనంబు నెగఁబ్రాఁకఁగలను పెక్క
లనుగట్టుకొని నిప్పులను గొంగులో ముద్దు సూదచేయుట యెంతో సులభ మనును
సంవత్సరముదొల్లి సవరించు నొకపని దమ్మిడి కంగటఁ దగులుదాని
జేతఁగాదా డబ్బు చేతలేదను సర్వసాధారణము చేయఁ జాలఁ డెదియు
నందఱును నొక్కధనికునె యడిగెదరు చి, కాసపడి యందఱకు ధని లాకునేర్వ
మిచ్చు గోఁచికిఁ దక్కువ దొమ్మ మే కుంటు లనువిధము మత్రసాంత్ర్యము నివసించు.

గీ. తొమ్మనూటతొంబదియేను కిమ్మనకయ, యూరకుంచురు జా బంది యను బరులకు
నర్థమిచ్చెదుచోటను నడుగ నంప, లేదటందురు నే నూర లేనటండ్రు. ౯౯౮

గీ. తొమ్మనూఱునుదొంబది తోడనెన్ని, డింట నుత్తరమందిన నింటివారు
చదువుకొని గాని యీయరు జనకులకును, ధనవిషయ మైనఁ జూపరుఁ దపవఁబోరు.

క. తొమ్మిదివందలతొంబది, తొమ్మిది యేవన్న నోరులదూషించుట యం
చెమ్మెగ నవ్వుచు నాత్మవి ధ మ్మందున నున్న దొఱఁడుఁ దలఁపనియెడలన్. ౯౯౯

ఉ. వేయవ వెట్టి పుణ్యము యభీష్టదమౌ పురుషార్థమౌ సుఖో
పాయము మెత్తురా నృపులు పండితు లెంతుర కొందురా జనుల్
చేయఁగనేల యింతశ్రమ చేసితి అక్కలు ముక్కలయ్యె రా
మా యని కృష్ణ యంచును నమారమణా యనునా ప్రణామముల్. ౧౦౦౦

గీ. వేయిపైనొక్కటవదగువెట్టిగాదె, వెట్టివారలవెట్టులువ్రేలువంచి
లెక్కపెట్టుట లనవెట్టియొక్కఁడైనఁ, గానలేకుంట నాబోఁటిగాఁడుజగము! ౧౦౦౧

క. పదునెనిమిదివందలనలు, వదిరైయెనగునట్టి శాలివాహనశకమం
దిది రుధిరోద్గారిబ్దము, నధికజ్యేష్ఠమును గలసినపు డొగిముగిసెన్.

---

చ. నవలలు వ్రాయువారలకు నాటకము ల్రచియించువారికి
న్నివిధవిశేషము ల్దెలియు విశ్వనిఘంటుగ నుండునంచు నే
వివరముగా వచించితిని వెట్టుల క్రిందను దీన లేనివా
ని వెనకి తెచ్చిపెట్టుకొను నేర్పరు లున్నను సంతసంబె కా.

గీ. పేరుఁ దెగడకుండు విషవృక్షము శ్మశాన, వాటికయును మాలపల్లి కష్ట
ముసలి యమ్మనారణమును మాతివలె నేగ, తి యనెడు నవిలేవెడివ్యాకృతులు.

గీ. ఒనరిచితిఁ గ్రొత్తపల్యాన్వయుఁడను సూర్య, రావునాఁ జనువాఁడను రామనామ్య
తనయుఁడను ఘనకౌండిన్యతాపసేంద్ర, గోత్రసంజననాతిపవిత్రకృతిని.

సమాప్తము.

---

# నన్నయభట్టారకవిలాసము.

## మధురాంధ్రగ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| | | రూ. | అ. | పై. |
| 1. సిరియాళచరిత్రము | (వచనము) - - - - | 0 | 2 | 0 |
| 2. రామలక్ష్మణులు | ,, - - - - - | 0 | 2 | 0 |
| 3. వాసవదత్తాజననము | ,, - - - - - | 0 | 1 | 0 |
| 4 కచునకు దేవయానికిం బెండ్లి | ,, - - - - | 0 | 2 | 0 |

నన్నయభట్టారవిలాస కార్యదర్శి,
76, స్వామినాయక్ రోడ్డు, చింతాద్రిపేట, చెన్నపురము.

# కవినాథవిలాసము—ఏలూరు.

ఇందు సమస్తవిధములైన గ్రంథములు దొరకును. గొప్పవిద్యాలయము.

| | | | |
|---|---|---|---|
| నీతిభవనము—ఒక్క చక్కని నీతిపుస్తకము - - - | 0 | 4 | 0 |
| పెట్టెకి వేయివిధములు మంచిప్రతి - - - - - | 1 | ( | 0 |
| ,, సాదాప్రతి - - - - - | 0 | 12 | 0 |
| ప్రబోధచింతామణి—మోచెర్ల హనుమంతరాయకవికృతము హిందీభాషలోని "బిల్వమంగళ" నాటకమునకుం దెనుఁగు - - - - - - - - - | 1 | 4 | 0 |
| వీరసంయుక్త—దేశచారిత్రనాటకము—మోచెర్ల హనుమంతరాయకవిగారు - - - - - - - | 1 | 0 | 0 |

పుస్తకముల జాబితాలకై వ్రాయుఁడు.

పై గ్రంథములన్నియు దొరకు చోటులు:—

నన్నయభట్టారక విలాసము—చింతాద్రిపేట, చెన్నపురము.
కవినాథవిలాసము—ఏలూరు.
సరస్వతీపుస్తకశాల—కాకినాడ.
కొత్తపల్లి-సూర్యరావు-39, హారిసన్ రోడ్డు, పుదుపేట, చెన్నపురము

